# గరిమెళ్ళ సాహిత్యం

సుప్రసిద్ధ జాతీయ కవి సాహిత్య జీవిత చరిత్ర

చల్లా రాధాకృష్ణ శర్మ
తె|| ప్రొఫెసర్
ఫ్లాట్-32, తిరువళ్ళువర్ వీధి
సదాశివనగర్, మధుర.

లక్ష్మీనారాయణ గ్రంథమాలా ప్రచురణ

# జాతీయ కవికి జోహారు

నీ గంభీర గళోద్గీతికలు
స్వాతంత్ర్య భావ వాహికలు!
నీ జీవిత మొక విషాద గేయం
తెలుగు జాతి కది మానని గాయం!

శారద నిన్ను చల్లగా చూడలేదు
ఆమె పేరుతో గ్రంథాలు ప్రకటించినా.
కల్పకవల్లి నిన్ను కరుణించలేదు
ఆమె పేరున హోటలు నడిపినా!

కన్నతండ్రి కాలధర్మం చెందినా
ప్రాణం లాంటి తాత కన్ను మూసినా
కటకటాల మధ్యనే కూర్చుండి
శోకం దిగమింగిన ధీరుడవు!

మా కొద్ది తెల్ల దొరతనం పాటతో
మామూలు మనుషులనే కాదు
మహిత చరిత్రుల్ని సైతం
మెప్పించిన వశ్యవాక్కవి నీవు!

ప్రగతి శీలాత్మక భావాలకు
పట్టితి వీవు బ్రహ్మరథం
గాంధేయుడవు మున్ముమూర్తులా.
పైకి కనిపించని విప్లవవాదివి!

పేదరికం రంపపు కోత పెట్టినా
దృష్టిలోపం ఎంతగా బాధించినా
ఆత్మాభిమానానికి అందలం పట్టిన
అకలంక త్యాగ చరిత! అంజలి నీకు!

స్వధర్మ స్వారాజ్య సంఘ సంచాలకులు
వేద విజ్ఞాన ధనులు నా శ్రేయోభిలాషులు
శ్రీ బి. వి. యస్. యస్. మణి గారికి



ధీ విశేషము నెల్లను దేశమునకు
మీదు గట్టిన మా గరిమెళ్ళ కథను
మంచివాడు, సుహృన్మణి మణికి నిత్తు—
స్నేహమున కది చెరగని చిహ్న మనుచు.

# మనవి మాటలు

రెండు దశాబ్దుల నాటి ముచ్చట. మదరాసులో కేంద్ర సాహిత్య అకాడెమీ ప్రాంతీయ కార్యాలయంలో పని చేసే రోజు లవి. ఆ రోజు ఉదయం ఆఫీసుకి బయలుదేరే సన్నాహంలో ఉన్నాను. మిత్రులు శ్రీ బి. యస్. రామారావు గారితో కలిసి శ్రీ గురుజాడ రాఘవశర్మగారు మా యింటికి వచ్చారు. గురుజాడ వారిని దర్శించడం అదే ప్రథమం. పరిచయాలయ్యాక, ఆయన మాటల్లోకి దిగారు. ఆకాశగంగ అవనికి దిగి నట్లనిపించింది. ఆ నిర్ఝరాంభః ప్రవాహానికి గేయాలూ పద్యాలూ ఉత్తుంగ తరంగాలై శోభ చేకూర్చాయి. గరిమెళ్ళ సత్యనారాయణగారి ప్రసక్తి వచ్చింది. అంతే. చెప్ప నలవికాని ఆవేశం, నవోత్సాహం ఆయన్ని ఆవ హించాయి. మా కొద్దీ తెల్ల దొరతనం ..ఆయన ఆలపించారు. ఇరుగు పొరుగువారు గుమిగూడారు. స్వాతంత్ర్యోద్యమకాలపు ఉత్సాహం అందరి లోనూ తొణికిసలాడింది. ఆఫీసు టైం మరిచిపోయాను. ఆయనంటే నాకు గురుత్వం ఏర్పడింది. ఆయన మాటల్లో ఎన్ని అమూల్య విషయాలు ... ఎందరి పేర్లు ..గురుజాడ వారితో పరిచయ భాగ్యం కలగడం నా పురా కృత సుకృతం. ఆ యశశ్శరీరుణ్ణి సభక్తికంగా స్మరించుకుంటున్నాను.

తదాదిగా గరిమెళ్ళను గురించి తెలుసుకోసాగాను. నా కృషి కొంతవరకు ఫలించింది. తత్ఫలితమే యీ పుస్తకం. గరిమెళ్ళ సాహి త్యాన్ని పర్యాప్తంగా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని వినయపూర్వకంగా మనవి చేస్తున్నాను.

గరిమెళ్ళ రచనల కోసం గాలించసాగాను. మిత్రుల్ని సంప్ర తించాను. తమకు తెలిసిన విషయాలు వారు తెలియజేశారు. గరిమెళ్ళ బంధువు లైన శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు, శ్రీ మేడేపల్లి నరసింగ రావుగారు ఆయనకి సంబంధించిన పెక్కు విషయాలు తెలియజేశారు. నరసింగరావుగారు 1987, మార్చి 29 న దివంగతులైనట్లు తెలుసుకుని చాలా విచారించాను. తమ బావగారి (మేడేపల్లి) వివాహ సందర్భంగా గరి మెళ్ళ చెప్పిన వేడుక పాటను (అముద్రితం) దిగువ ఉదాహరిస్తున్నాను.

పెళ్ళికొడుకు చరిత్రం బెంతో
పెద్దదై నాదమ్మ వినవె
గౌండ్ల వారి కొట్టు మొదలు
గళనకత్తె లిండ్లదాక ॥

ఇంగిలీషు మూడవఫారం
ఎపుడు చదివి పేలిపోయె,
చల్లగా భూమైనా దున్నె
శక్తి గూడా లేకపోయె,
కాఫీ ఉప్మా లేకుంటే ను
కాగిపోవు ప్రాణ మెల్ల,
మాపటి వేళైనా అన్నం
మాట గూడా తలపడాయె ॥

గరిమెళ్ళ వారి కుమార్తె శ్రీమతి జొన్నలగడ్డ ప్రభావతిగారు తమ పితృపాదుల అముద్రిత గేయాలు కొన్ని తెలియజేశారు.

మిత్రులు శ్రీయుతులు మల్లెల శ్రీరామమూర్తి, యం. వి శాస్త్రి, ద్వా. నా. శాస్త్రి, బి. వి. అప్పారావు ప్రభృతులు భారతి, కృష్ణాపత్రిక మొదలైన వాటిలో ప్రచురించబడిన గరిమెళ్ళవారి రచనల ప్రతులు పంపి నాకు తోడ్పడ్డారు. సహాయం చేసిన సహృదయుల కందరికీ సదా కృతజ్ఞుణ్ణి.

1982, సెప్టెంబరు 11, 12 తేదీలలో, తమిళం సంస్కృతం ఇతర భారతీయ భాషల పరిశోధన సంస్థ ఆధ్వర్యవంలో చెన్నపురి ఆంధ్ర మహా సభా భవనంలో ఆ సంస్థ విజిటింగ్ ప్రొఫెసరుగా నేను మూడుపన్యాసాలు చేశాను. వాటిలో ఒకటి గరిమెళ్ళ సాహిత్యం గురించి. డాక్టర్ రాజా సర్ ముత్తయ్య చెట్టియార్, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ బి. వి. యస్. యస్. మణిగారు మొదలైన ప్రముఖులు ఆ ఉపన్యాసాలకు

హాజరైన వారిలో కొందరు. గరిమెళ్ళ ఉపన్యాసానంతరం 'గరిమెళ్ళను గురించి పుస్తకం వ్రాయండి' అని ఆదేశించారు, నా శ్రేయోభిలాషులూ సహృదయులూ అయిన మణిగారు. ఆయన మాటలు నాకు కొత్త ఉత్సాహమూ కొండంత ధైర్యమూ కలిగించాయి. అంతవరకూ నత్తనడకగా సాగుతుండిన నా కృషి వేగం పుంజుకుంది. మణిగారి ఔదార్యం వల్ల నేటికి ఈ పుస్తకం వెలువడుతున్నది. ఆయనకి నా కృతజ్ఞతాంజలి.

ముచ్చట గొలిపే ముఖపత్రం రచించిన మిత్రులు శ్రీ యస్. రవి కుమార్‌గారికీ, సూచి తయారు చేసిన మిత్రులు డా. యస్. జయ ప్రకాష్‌గారికీ, మదరాసు – మధురల మధ్య ప్రూఫులు రాకపోకలు సాగించినా, విసుగు చెందకుండా పుస్తకం చక్కగా ముద్రించిన వెల్డన్ ప్రెస్సు వారికీ – ముఖ్యంగా శ్రీ జి. సాంబశివరావుకి – నా కృతజ్ఞతను తెలుపుకొంటున్నాను.

—చల్లా రాధాకృష్ణశర్మ.

# విషయసూచిక

# 1. స్వాతంత్ర్య ప్రశస్తి

రాజుని బట్టి ప్రజలు సంచరించిన రోజు లవి. ఆ రోజుల్లో రాజు సర్వ స్వంతంత్రుడు. అతని మాటకు తిరుగు లేదు. రాజు విష్ణ్వంశ సంభూతు డని భావించారు ఆ నాటి ప్రముఖులు. కాగా 'రాజు లేని ఊరు పూజలేని గుడి', 'రాజు నీతి తప్పితే నేల సారం తప్పుతుంది' వంటి సామెతలు వాడుకలోకి రావడంలో వింత లేదు. సంఘంలో రాజుకి గల స్థానం అలాంటిది!

బహు ప్రాచీను డైన తమిళ మహాకవి తిరువళ్లువర్ దృష్టిలో విధ్యుక్త ధర్మం తప్పని ప్రభువు దైవ సమానం!

*'తన విధి తప్పక తన ప్రజ నాదు*
*కొనెడు నృపతి దైవ మని వార్త కెక్కు.'*

అని ఆయన పేర్కొన్నాడు. ఉత్తమ ప్రభుత్వం గురించి ముచ్చటిస్తూ ఆయనే ఇలా అన్నాడు:

*'వినువీధి జూచి జీవించు లోకమ్ము;*
*మనుదురు ప్రభు దండమును జూచి ప్రజలు.'*

సర్వ ప్రపంచమూ వాన చినుకు కోసం ఆకాశం వంక చూస్తుంది. వాన కనుక లేకుంటే లోకం సస్య శ్యామలంగా ఉండదు; జీవిత వైభవమే నశిస్తుంది. లోకంలోని ప్రజలు రాజ దండాన్ని చూస్తూ—న్యాయ సమ్మత మైన దొరతనాన్ని అభిలషిస్తూ అన్నమాట—జీవిస్తారు. దేశంలో నీతి న్యాయం సుస్థిరంగా ఉన్నప్పుడే, సుఖ శాంతులతో ప్రజలు జీవించ గలుగుతా రనడం నిర్వివాదం.

రాజుకి సంఘంలో సర్వోత్కృష్టమైన స్థానం ఉండేది. కనుకనే, ఆ నాటి ప్రజలు రాజ భక్తిని అలవరుచుకున్నారు. రాజ భక్తి పరాయణు లైన అలనాటి మాన్యులూ సామాన్యులూ తమ ప్రభువుల కోసం తమ సర్వస్వాన్ని త్యాగం చేసిన ఉదంతాలు నేటికీ కథలు గాథలుగా ప్రచారంలో లేక పోలేదు.

రోజులు గడవను గడవను రాజు లంటే ప్రజా బాహుళ్యంలో అసహ్యమూ అనాదరభావమూ ప్రబలసాగాయి. రాజుల చెలిమి పాముల

చెలిమి, రాజులు మదోన్మత్తులు—వంటి అభిప్రాయాలు వెలుగులోకి వచ్చాయి. తత్ఫలితంగా రాజసేవ నరకప్రాయంగా తోచడంలో ఆశ్చర్యం లేదు. రాజాశ్రయాన్ని నిరసించిన పోతన, రాజగౌరవాలను తృణప్రాయంగా భావించిన త్యాగయ్య వంటి మహనీయులు ఆ నాళ్ళలో కొద్ది మందే కనిపించినా, వారు ప్రదర్శించిన ధైర్య స్థైర్యాలు విస్మరించరానివి. ఆనాటి కవుల మనోభావాన్ని 'రాచయీవుల నమ్మరాదు', 'రాచమూక నమ్మరాదు సుమ్మ' అన్న గౌరన, వేమన ప్రభృతుల మాటల్లో మనం చూడవచ్చు.

ఈ రాజ నిరసనభావం క్రమక్రమంగా స్వాతంత్ర్యానురక్తికి దారి తీసి వుండవచ్చు; సహజంగా మానవుడిలో ఉన్న స్వాతంత్ర్య దాహాన్ని ఇనుమడింపచేసి వుండనూ వచ్చు.

రాజాశ్రయాన్నీ రాజ గౌరవాలనూ ఎంతగానో అభిమానించినా, శ్రీనాథుడు స్వాతంత్ర్య ప్రియుడుగా దర్శన మిస్తాడు. తెలుగు నేల నాలుగు చెరగులూ పర్యటించినవాడు, కష్టసుఖాల కావడికుండలు మోసిన వాడు ఆ కవిరాజు!

పారతంత్ర్యపు బాధల్ని ఆ మహాకవి వర్ణించినంతగా మన ప్రాచీనాంధ్ర కవుల్లో మరొకరు వర్ణించలేదన్నా సాహసం కాదు. ఆ కవిరాజు సంతరించినట్లుగా భావించబడుతున్న పల్నాటి వీరచరిత్ర యిందుకు ప్రబల సాక్ష్యం.

నలగామ రాజుకి రాజనీతి విశేషాలు వివరిస్తూ పారతంత్ర్యం గురించి ప్రస్తావిస్తాడు, భట్టు. దేశం కనుక పరనృపాధీనమైనప్పుడు ప్రజలకు పారతంత్ర్యం తప్పదనీ, అలాంటివారు అనుభవించే కష్టాలు 'చెప్పంగ నలవియే శివునకు నైన' అనీ చెపుతాడు. పంజరంలో ఉన్న పక్షులవలె వారు బాధావహు లవుతారనీ, అందువల్ల

*'పార్థివా! యిటువంటి పారతంత్ర్యంబు*
*కటకటా పగవారి కైనను వలదు.'*

అని హితబోధ చేస్తాడు. పారతంత్ర్య ప్రాప్తివల్ల పొందక పొందక పొందినట్టి నరజన్మ దూషితమై పోతుందనీ హెచ్చరిస్తాడు. ఆ పార

తంత్ర్యపు బాప ఎలాంటిదో ఆ కవి సార్వభౌముని మాటల్లోనే తెలుసు కుందాము.

'బంధించి బుట్టలో పాములవాడు
వదలక పెట్టిన ఫణుల చందమున,
గంగిరెద్దుల వాడు కావర మణచి
ముకుదాడు పొడిచిన పోతెద్దులట్లు,
బోనులో నుంచిన పులుల విధంబు
స్వాతంత్ర్య హీనత బడియుండవలయు.'

స్వాతంత్ర్యం కనుక నశిస్తే, కొమ్ములు తిరిగిన వాడైనా కుక్కిన పేనులా పడివుండక తప్పదనే భావాన్ని పై పాదాలు గుండెకు హత్తుకునేలా వ్యక్తం చేస్తున్నాయి. ఎంత బుసలు కొట్టే సర్పమైనా సరే, బుట్టలో ఉన్న ప్పుడు గుట్టుగా ఉండవలసిందే. అలాగే ముకుదాడు పొడిచిన పోతెద్దూ, బోనులోని పులీ అణగిమణగి వుండక తప్పదు.

పారతంత్ర్యం వల్ల స్వేచ్ఛ నశిస్తుంది. స్వేచ్ఛ లేనప్పుడు మనస్సు లోని మంచి తలంపుని సైతం ఆచరణలో పెట్టడం గగన కుసుమ మవు తుంది. అటువంటి బ్రతుకు బ్రతకడం కంటె మరణించడమే శ్రేయస్కర మని శ్రీనాథుని అభిప్రాయం. అన్ని అనర్థాలకు కారణభూతమైన పార తంత్ర్యాన్ని అందుకే నిరసించాడు ఆయన. అది పగవారికైనా వద్దని పేర్కొన్నాడు.

పారతంత్ర్యపు బాధల్ని కళ్ళకి కట్టినట్లుగా తెలియజేసి శ్రీనాథుడు స్వాతంత్ర్యంలోని విశిష్టతను పరోక్షంగా తెలియజేసినవాడయ్యాడు. మానవ సహజమైన స్వాతంత్ర్యేచ్ఛకు అలా అక్షరరూపం కల్పించిన ఆ కవిరాజు ధన్యుడు!

## 2. స్వాతంత్ర్య సమరయోధుడు

వ్యాపారార్థం మన దేశానికి వచ్చిన పాశ్చాత్యులు రాజకీయంగా బల పడడంతో, మన స్వాతంత్ర్యానికి గ్రహణం పట్టినట్లయింది. కాని పడిన గోడలు పడినట్లే ఉండవుగదా!

మన దేశంలో ఇంగ్లీషువారి పరిపాలన స్థిరపడడం, మన కష్టాలు ఇనుమడించడం ఏకకాలంలో జరిగాయి. క్రమక్రమంగా పరాయివారి పరిపాలన పట్ల దేశీయులలో తీవ్రమైన అసంతృప్తి ఏర్పడసాగింది. తత్ఫలితంగా 1857 లో ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం జరిగింది. అందులో సిపాయిలు ప్రధాన భూమిక నిర్వహించారు. కాగా దాన్ని సిపాయీల తిరుగుబాటుగా అభివర్ణించారు.

ఇది యిలా ఉండగా, దేశీయులలో నవచైతన్యం పొటమరించింది. వివిధ రంగాలకు చెందిన మహాపురుషులు దేశం కోల్పోయిన ఔన్నత్యాన్ని తిరిగి సాధించాలని ఉద్బోధించారు. వారి కృషికి ఫలితంగా విభిన్న ప్రాంతాల వారికీ, వివిధ మతాల వారికీ ప్రాతినిధ్యం గల ఒక జాతీయ సంస్థ 1885 లో వెలుగు చూసింది. రాజకీయంగా స్వాతంత్ర్యాన్ని ప్రధానంగా ఆశించిన ఆ సంస్థే ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అనబడే భారత జాతీయ కాంగ్రెసు.

ఇలా ఉండగా, లోకమాన్య బాలగంగాధర తిలక్ 'స్వరాజ్యం నా జన్మ హక్కు' అని గర్జన చేశారు. ఆ గర్జన దేశం నలుమూలలలోనూ ప్రతిధ్వనించింది. అయితే స్వాతంత్ర్య సముపార్జన ఎలా జరగాలి? అని దేశనాయకులు ఆలోచించసాగారు. నాయకులలో కొందరు మితవాదులు. కొందరు అతివాదులు. మరికొందరు విప్లవవాదులు. కాని వారందరి ధ్యేయం మాత్రం స్వాతంత్ర్య సముపార్జనే. అందుకు వారవలంబించిన విధానాలు వేర్వేరు.

తరువాతి కాలంలో జాతిపితగా పేరు పెంపులు గడించిన గాంధీజీ రంగ ప్రవేశం చెయ్యడంతో, మన జాతీయోద్యమ స్వరూపమే మారిపోయిందనవచ్చు. ఆయనది వశ్య వాక్కు. విభిన్న భాషలవారూ వివిధ మతాలవారూ పండితులూ పామరులూ – ఒకరేమిటి అందరూ – ఆయనపట్ల అవిరళ భక్తి విశ్వాసాలు ప్రకటించారు. అంతేకాదు. ప్రజలకు శాంతి, అహింసలలో ప్రగాఢ విశ్వాసం కలిగింది. ఆయన తలపెట్టిన వివిధ ఉద్యమాలలో వారు సహర్షంగా పాల్గొని, వాటిని విజయవంతం చేశారు. ఆ విధంగా గాంధీజీ తిరుగులేని నాయకుడయ్యాడు.

స్వాతంత్ర్య సమరవీరులే కాక సాహిత్యోపాసకులైన కవులూ రచయితలూ ఎందరెందరో గాంధీజీ శిష్యులయ్యారు. తమ రచనల ద్వారా వారు గాంధీజీ సిద్ధాంతాలను దశదిశా వ్యాప్తం చేశారు. అలా చేసిన ప్రముఖులలో చిరస్మరణీయుడు గరిమెళ్ల సత్యనారాయణ.

గరిమెళ్ల నూటికి నూరుపాళ్లు గాంధీజీ శిష్యుడనడం చర్విత చర్వణం. ఆయన దేశభక్తుడు. స్వాతంత్ర్యసమరయోధుడు. జాతీయ కవి. అభ్యుదయ వాది. సంగీత శాస్త్రజ్ఞుడు. గాయకుడు. ఇన్ని విశిష్ట గుణాలు నెలకొన్నా మొదటినుంచీ చివరిదాకా పేదరికంతో బాధపడి, కడగండ్ల జడివానలో తడిసి ముద్దయి కన్ను మూసిన కష్ట చరితుడూ కర్మవీరుడూ గరిమెళ్ళ!

## 3. జీవిత కథ

జాతీయ కవి గరిమెళ్ళ సత్యనారాయణ శ్రీ కాకుళం జిల్లా, నరసన్న పేట తాలూకా గోనెపాడు గ్రామంలో 1893 లో ప్రభవించాడు. [1] పుట్టిన తేదీ గాని నెల గాని తెలియ రాలేదు. పితామహులు సూరయ్య. తండ్రి వెంకట నరసింహం. ఆయనకి రామకృష్ణమ్మ అనే వ్యవహార నామం ఉండేది. తల్లి సూరమ్మ. వెంకటనరసింహం దంపతులకు అయిదుగురు కుమారులూ ముగ్గురు కుమార్తెలూ జన్మించారు. అందరికంటె సత్యనారాయణ పెద్దవాడు. మిగిలిన వారు రామమూర్తి, లక్ష్మణమూర్తి, రామలింగమూర్తి, సూర్యనారాయణ, సీతారామమ్మ, చిన్న సీతారామమ్మ, లలితమ్మ ప్రభృతులు. [2]

వెంకటనరసింహం గారికి శ్రీ కాకుళం జిల్లాలో కొన్ని భూములూ, గోనెపాడుకి దగ్గరలో ఉన్న ప్రియాగ్రహారంలో స్వగృహమూ ఉండేవి. ఆ భూముల వ్యవహారం ఆయనే చూసుకునే వాడు. ఆయన మరణానంతరం ఆ భూములేమీ మిగల లేదు. సత్యనారాయణ గాని ఆయన సోదరులు గాని ఎక్కువగా ఉద్యోగ ప్రయత్నాలు చేయకపోవడం, కుటుంబంలో ఖర్చులు నానాటికీ పెరగడం ఇందుకు కారణంగా భావించబడుతున్నది. [3]

సత్యనారాయణ ప్రాథమిక విద్య స్వగ్రామమైన ప్రియాగ్రహారంలో సాగింది. విజయనగరం, మచిలీపట్టణం (బందరు), రాజమహేంద్రవరం

మొదలైన చోట్ల పై చదువులు చదివాడు. ప్రసిద్ధ భూస్వాములూ, బంధువులూ సహృదయులూ అయిన బారిస్టరు కన్నేపల్లి లక్ష్మీనరసింహం గారి ఆర్థిక సహాయం ఆయనకి లభించింది. ఆయన రాజమహేంద్రవరం వచ్చినప్పుడెల్ల శ్రీపాద కామేశ్వరరావుగారి యింట్లో ఉండేవాడు. డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు కూడా సహాయపడుతూ వుండేవారట. బి. యే., పట్టం చేతికి వచ్చింది.[4] తర్వాత ఆయన కొన్నాళ్ళు గంజాం జిల్లా కలెక్టరు గారి కార్యాలయంలో గుమాస్తాగాను, ఆ తర్వాత విజయనగరం ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుని గాను ఉద్యోగం చేశాడు.[5]

ఆనాటి వెలనాటి బ్రాహ్మణుల సంప్రదాయం అనుసరించి, సత్యనారాయణకు చిన్నప్పుడే వివాహం చేశారు. అది మేనరికం.

మొదటి నుంచీ గరిమెళ్ళ స్వేచ్ఛాప్రియుడు. ఆ స్వేచ్ఛా ప్రియత్వం ఉద్యోగం చెయ్యాలనే కోరికకు సైంధవుడై అడ్డుతగిలి వుండవచ్చు. యల్. టి. (ఉపాధ్యాయ శిక్షణ) అయ్యేందుకు ఆయన రాజమహేంద్రవరం వెళ్ళాడు. అది 1920. ఆ యేడు ట్రెయినింగు కళాశాలలో చేరాడు. కాని యల్. టి. పూర్తి చేసినట్లు తెలియడం లేదు. గురుజాడ రాఘవశర్మగారి యీ మాటలు పరిశీలించండి: "జాతీయోద్యమములో చదువుకొన్నవాళ్ళందరు చెడిపోలేదే! యల్టి పూర్తి చేసికొని, సంపాదించుకొనుమని ఎందఱో పెద్దలు వీరికి సలహా యిచ్చారు. ఈ జాతీయ వీర విప్లవ కవికి ఆ సలహా లేవీ గిట్టేవి కావు. మూర్ఖపు పట్టుదల, విసిగి పోయేవారు కూడ కొందఱు."[6] కాని మేడేపల్లి నరసింగరావు గారు, "ఆయన యల్. టి. పాసయి ఛత్రపురంలో గాని ఇచ్ఛాపురంలో గాని ఉద్యోగం చేసినారని వినికిడి" అని తమ లేఖలో పేర్కొన్నారు.[7] సత్యనారాయణ యల్.టి. పూర్తి చెయ్యలేదనే పలువురి అభిప్రాయం.

ఇలా ఉండగా, 1920, డిసెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహా సభలో సహాయ నిరాకరణ తీర్మానం ఆమోదించబడింది. తత్ఫలితంగా అసహాయోద్యమం వెలుగులోకి వచ్చింది. మన స్వాతంత్ర్యాన్ని హరించి వేసిన బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం చెయ్యకూడదని ఆ ఉద్యమ ఆశయం. ఉరుకులు వేసే ఉత్సాహంతో విద్యాధికులూ విద్యార్థులూ ఉద్యమంలో పాల్గొన్నారు. ఉద్యమం బలం పుంజుకోసాగింది. మహాత్ముని

శంఖారావం గరిమెళ్ళ శ్రవోయుగళిలోను మారుమోగసాగింది. అంతే; చదువుతున్న చదువుగాని మరే విషయం గాని ఆయనకి ప్రముఖంగా కనిపించలేదు. చదువుకి స్వస్తి చెప్పాడు. వీరావేశంతో ఉద్యమంలోకి దూకాడు. సహజంగా స్వాతంత్ర్య ప్రియుడూ, కవీ అయిన గరిమెళ్ల కంచు కంఠం నుంచి 'మా కొద్దీ తెల్లదొరతనము' అనే గొప్ప పాటవెలువడింది. ఆంగ్ల ప్రభుత్వం అనుసరించిన దమన నీతిని సామాన్యులకు కూడా తేటతెల్లం చేస్తున్న ఆ గేయరాజం సంతరించినందుకు గరిమెళ్లకు ఒక సంవత్సరం కఠిన కారాగారవాస శిక్ష పడింది. ఆ పాటను పాడిన వారికే శిక్ష పడినప్పుడు, తత్కర్తకు శిక్ష పడడంలో వింత యేముంటుంది ?

మా కొద్దీ తెల్లదొరతనం పాట పెద్దల్నీ పిన్నల్నీ స్త్రీలనీ పురుషుల్నీ మంత్ర ముగ్ధుల్ని చేసింది. ఆ పాట తెలుగు వారిని ఎలా వశం చేసుకున్నదీ, తెలుగువారి మీద ఎలా ముద్ర వేసిందీ టేకుమళ్ళ కామేశ్వరరావు గారు కళ్ళకి కట్టేలా పేర్కొన్నారు. 8 కాంగ్రెసు స్వచ్ఛంద సేవకులు ఖద్దరు దుస్తులు ధరించి, గాంధీటోపీ పెట్టుకుని, బారులు తీరి, మువ్వన్నె జెండా ఎగురవేసుకుంటూ,

'మా కొద్దీ తెల్లదొరతనము - దేవ
మా కొద్దీ తెల్లదొరతనము'

అని ఆకాశం దద్దరిల్లేలా పాడుతూ వీథుల్లో కవాతు చేసేవారట! ఆ దృశ్యం తలుచుకుంటేనే మేను పులకరిస్తుంది.

ఆ రోజుల్లో 'దండాలు దండాలు భారతమాత' అనే ప్రసిద్ధ దేశభక్తి గేయం కూడా చాలా ప్రచారంలో ఉండేది. ఈ గేయ కావ్య రచనలో గరిమెళ్ళకు భాగం ఉందని కొందరు భావించారు. 9 కాని యిది వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రిగారల రచన.

గరిమెళ్ళ ఎంత స్వాతంత్ర్య ప్రియుడో, అంత ప్రజాభిమానం కలవాడు. ఆయన ఆత్మ ప్రత్యయాన్ని, ప్రజల మీది విశ్వాసాన్ని గ్రహించేందుకు ఆయన 'హిందూ' ఆంగ్ల దిన పత్రికలో ప్రకటించిన యీ కింది లేఖ (జైలు నుంచి వ్రాసింది) ఎంతైనా ఉపకరిస్తుంది. 10 అలవోకగా పరిశీలించినా, ఆయన వ్యక్తిత్వం మన కళ్ల యెదుట ప్రత్యక్ష మవుతుంది.

[శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ ఆంధ్రుల కిచ్చిన సందేశం—ది హిందూ, 11-2-1922]

'సోదర సోదరీమణులారా,

నేను నా ధర్మం కొంత నిర్వర్తించి అందుకు కొంచెం ఎక్కువగానే విశ్రాంతి తీసుకోడానికి వెడుతున్నాను. ఒక యేడాది పాటు నా కలాన్ని నా కంఠాన్ని ఉపశమింపజేయడానికి బ్రిటిషు ప్రభుత్వాధికారులు నిశ్చయించారు. ప్రజల భద్రతకు—అనగా ప్రభుత్వపు ఉనికికే—నేను ప్రమాదకరంగా పరిణమించగల నని వారికి తోచింది. కాని నా కిది ఆశ్చర్యంగా ఉంది. వా రనుకున్నట్టుగా నేను అలాంటి వాడినైతే, వారు నన్ను ఆలస్యంగా బంధిస్తున్నట్లు భావిస్తున్నాను. నాకున్న సర్వోత్కృష్టమైన శక్తిని నేను దేశానికి సమర్పించాను. నా భౌతిక శరీరాన్ని నిర్బంధంలో ఉంచుతారు. కాని నా ఆత్మను సాహిత్యం ద్వారా దేశం మీదికి వదిలిపెట్టాను. అది సంఘటితమై బలం పుంజుకోవాలి. నా దుర్బల శరీరం కంటె అది శక్తివంతంగా పనిచేస్తుంది. ప్రభుత్వ నిషేధాజ్ఞలు మన స్వాతంత్ర్యాన్ని నోరు నొక్కే రోజులు గతించాయి. శారీరకంగా గాక నేను నా పాటల ద్వారా నా ప్రజల మధ్య నడయాడాలని ఎంతగానో అభిలషించాను. ప్రజలు కనుక వినియోగింప దలుచుకుంటే, ఆ సదవకాశాన్ని ప్రభుత్వం వారు కల్పించారు. ప్రస్తుతం నేను వ్యర్థుడి నని నాకు తెలుసు. స్వరాజ్య స్థాపన, మీ ఘన విజయాల ప్రశస్తినీ ఉద్దేశించి నేను గానం చెయ్యడానికిగాను భగవంతుడు నన్ను మళ్ళీ మీ మధ్యకు పంపగలడు.'

జైలులో బంధించబడినా, గరిమెళ్ళ మనస్సులో దేశభక్తి ప్రబోధాత్మక గీతాలు సుళ్లు తిరిగేవి. వాటిని ఆయన జైలునుంచి విడుదల కాగానే నలుగురిలో గొంతెత్తి పాడ సాగాడు. అవి ప్రజల్ని ఆకట్టుకున్నాయి. ప్రజలు కూడా వాటిని పాడ సాగారు. ఇదంతా చూసిన ప్రభుత్వాధికారులు గరిమెళ్లను బయట ఉంచడం తమ ఉనికికి ప్రమాదకరమని భావించారు. మళ్ళీ ఆయన మీద రాజద్రోహ నేరం మోపబడింది. కాకినాడలో మేజస్ట్రేటు ముందర హాజరు పరిచారు. మోపబడిన నేరానికి మీ సమాధానం ఏమి టని మేజస్ట్రేటు అడిగాడు. జన్మతః కవి అయిన గరిమెళ్ళ మాటల కోసం తడుముకోలేదు. ఆ స్వాతంత్ర్య సమరయోధుడు మామూలు మాటల్లో

చెప్పలేదు వాఙ్మూలం. పరప్రభుత్వ నిరసన భావం మాటమాటను స్పందిం పగా, ఆయన నోటినుంచి ఒక అద్భుత గేయమే వెలువడింది.

'కూలిపోతున్నది కూలిపోతున్నది
మూలమట్టముతోటి కూలిపోతున్నది ప్రభుత్వం
కూకటివేళ్ళతో కూలిపోతున్నది మూర్ఖ ప్రభుత్వం'

రెండున్నర సంవత్సరాల కఠిన శిక్ష గరిమెళ్ళకు విధించారు.

ఆయన శ్రీకృష్ణ జన్మస్థానంలో ఉండగా—అనగా 1923 జనవరిలో—తండ్రి వెంకట నరసింహంగారు దైవికం చెందారు. అయినా గరిమెళ్ళ ఆంగ్ల ప్రభుత్వానికి క్షమాపణ చెప్పుకుని బయటికి రాలేదు. జైలులోనే ఉండడానికి యిష్టపడ్డాడు. అంత దుఃఖంలోను తాతగారికి వేదాంతపరంగా లేఖ వ్రాశాడట! ఆ తాతగారు కూడా 1924 లో కాలధర్మం చెందారు. శిక్షాకాలం పూర్తి అయిన పిమ్మటనే ఆయన బయటికి వచ్చాడు. ఆయన స్వాతంత్ర్య ప్రియత్వం అలాంటిది! అంత ఉన్నతమయింది!

బంధవిముక్తుడైన గరిమెళ్ళ స్వస్థలానికి వెడుతుంటే, ఎందరో ఆదరపూర్వకంగా ఆయనకు సన్మానాలు చేశారట! అభిజ్ఞులు చెప్పినట్టుగా, ఆయన జీవితంలో అదే బహుశః ఆనందకరమైన ఘట్టం. తదనంతరం ఆయనకి భార్యా వియోగం కలిగింది. అప్పు డాయనకి ఇద్దరు కుమార్తెలు.

గరిమెళ్ళది స్వతంత్ర ప్రవృత్తి. ఆయన ఏ ఉద్యోగంలోను పట్టు మని పది రోజులు పని చేసినట్లు కనిపించదు. అసలు ఉద్యోగం చెయ్యా లనే తీవ్ర వాంఛ ఆయనలో ఉన్నట్లు కనిపించదు. ఆయన జాతీయోద్య మంలో చేరడం, ఆయన గాని, ఆయన సోదరులుగాని అంత తీవ్రంగా ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యకపోవడం, కుటుంబం ఖర్చులు నానాటికి పెరగడం, ఉన్న పొలమూ పుట్రా తండ్రి మరణానంతరం మిగలక పోవడం—మొదలైన కారణాలవల్ల ఆయన జీవిత శకటం గతుకుల బాట మీదనే సాగింది.

తన కుమారులు ఉన్నత విద్యాభ్యాసం చేసి ఉద్యోగాలు చేస్తారనే ఆశకొద్దీ వెంకటనరసింహంగారు అప్పులు చేసి పిల్లలకి చదువులు చెప్పించా రట. ఆయన ఆశాభంగం చెందివుంటాడు. ఆ అప్పుల్ని, గరిమెళ్ళ మిగి లిన ఆస్తిని అమ్మివేసి తీర్చాడు. ఆ తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు.

ప్రియాగ్రహారంలో 1909 లో స్థాపించబడిన జ్ఞానోదయ సమాజ గ్రంథాలయానికి ఆయన కొంతకాలం కార్యదర్శిగా పని చేశాడు. ఆ గ్రంథాలయంలో 600 పుస్తకాలు ఉండేవి.[11] నవ్యభావ బంధురములైన పుస్తకాలు ముద్రించాలనే సదుద్దేశంతో ఆయన శ్రీ శారదా గ్రంథమాల స్థాపించాడు. ఏడెనిమిది పుస్తకాలు చిన్నవీ పెద్దవి అచ్చు వేశాడు. కాని లాభం హుళక్కి. "ఆ రోజులలో ఆ పుస్తకములకు ప్రచారము ఏమియు లేని కారణమున, ఆయన తరచు రాజమండ్రి, విజయవాడ, మద్రాసులలో ఉండడంవల్ల ఆ పుస్తకములు అన్నీ పూర్తిగా చెడిపోయి చెదలుపట్టి పోయినవి."[12] కనుక పుస్తక ప్రచురణవల్ల ఆయన బాధలు ఏవంతైనా తీర లేదనడం సుస్పష్టం. కానీ ఆ పుస్తకాలు నవ్యభావవిలసితములనీ, తెలుగు సరస్వతికి అమూల్యభూషణములనీ చెప్పవచ్చు. యతిప్రాసలు లేని వృత్త రచన చేశాడు గరిమెళ్ళ. ఆయన ఖండ కావ్యాల వ్రాత ప్రతిని గురించి ముచ్చటిస్తూ ఏకుమళ్ళ కామేశ్వరరావుగారు, "చదవడానికి ఎంతో ముచ్చటగా వుంది. పిమ్మట దాని గతి విచారించగా అది కాలగర్భంలో కలిసిపోయినట్లుగా తెలిసింది" అని పేర్కొన్నారు.[13] ఇలా ముద్రితా ముద్రిత గ్రంథాలు గరిమెళ్లవి ఎన్ని కాలగర్భంలో కలిసిపోయినవో!

1921 లో గరిమెళ్ల 'స్వరాజ్య గీతములు' పుస్తకం వెలువడింది. 1926 లో ఖండకావ్యములు (1 వ భాగం), 1923 లో హరిజనుల పాటలు మొదలైనవి వెలువడ్డాయి. ప్రకటించబడిన సంవత్సరాలు స్పష్టంగా తెలియ రాకపోయినా, 1926 నాటికి భక్తిగీతములు, బాల గీతములు, మాణిక్యము (బ్లాంక్ వర్సులో నాటకం), నూతన జాతీయ గీతములు, అర్థత్రయ సర్వ స్వము (తిరుక్కురళ్ తెలుగుసేత) మొదలైనవి వెలువడ్డాయి.

గరిమెళ్ళ చాలాసార్లు జైలు శిక్ష అనుభవించాడు. ముఖ్యంగా తిరుచ్చిరాపల్లి జైలులో ఉన్న రోజుల్లో ఆయన యన్. యస్. కృష్ణస్వామి అయ్యంగారు, హాలాస్యం అయ్యరుల వద్ద తమిళం నేర్చుకున్నాడు; కడ లూరు జైల్లో ఉండగా కూడా నేర్చుకుని వుండవచ్చు. తిరుక్కురళ్ వంటి అనర్ఘరత్నాన్ని తెలుగు చేయగలిగినంత తమిళ భాషాపాండిత్యం అలవరుచు కున్నాడు! ఇది పేర్కొనదగిన అంశం. ఆయనకి తమిళ భాషాభిమానం పుష్కలంగా ఉన్నట్లు చెప్పవచ్చు. మరో సుప్రసిద్ధ నీతి గ్రంథమైన

నాలడియారుని (చతుష్పది) కూడా తెనిగించాడు. ఉత్సాహంగా ఉన్నప్పుడు ఆయన తమిళ గీతాలు ఏవో పాడుతూ వుండేవాడట! "ఆయనకు తమిళం బాగా పరిచయం ఉన్నట్టు అప్పుడప్పుడు విలాసంగా తమిళ పాటలు కూడా పాడుతుండేవారని మనం అనుకోవాలి."[14]

కన్నడం కూడా కొద్దిగానో గొప్పగానో నేర్చుకున్నాడు గరిమెళ్ల. కన్నడ భాషాజ్ఞానాన్ని వృద్ధి చేసుకుందామని ఆయన రాజమహేంద్రవరంలో అప్పుడప్పుడు టేకుమళ్ల అచ్యుతరావుగారి యింటికి వెళ్ళేవాడు. తళ్ళికోట అనే కన్నడ నాటకాన్ని అనువదించసాగాడు. "మీరు సొంతంగా నాటకాన్ని వ్రాయడానికి ప్రయత్నం చేయరాదా?" అని టేకుమళ్ల కామేశ్వరరావుగారు ప్రశ్నించగా, అందుకు గరిమెళ్ల, "మానవ స్వభావాన్ని లోతుగా పరిశీలిస్తేనేగాని అట్టిది వ్రాయడానికి సాధ్యం కాదు" అని ఆయన ప్రత్యుత్తర మిచ్చారట! ఈ సమాధానం వల్ల గరిమెళ్ళ నిజాయితీ, దృశ్యకావ్యరచన పట్ల ఆయనకి గల ఆదరభావం వ్యక్త మవుతున్నాయి. నాటకాంతంహి సాహిత్యం గదా మరి!

ఆంగ్లంలో కూడా గరిమెళ్ళ కొన్ని రచనలు చేశాడు. 'హార్ట్ ఆఫ్ ది నేషన్' అనే పద్యకావ్యం వ్రాశాడు. యస్. యన్. గరిమెళ్ళ అనే పేరుతో ఆయన మదర్ ఇండియా పోయం రచించి చక్కగా ముద్రించాడు.[15] అవిభక్త మదరాసు రాష్ట్రంలో అప్పటి జస్టిస్‌పార్టీ విద్యాశాఖా మంత్రిగారయిన ఏ. వి. పాత్రోగారిని సంబోధిస్తూ ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనకు సంబంధించిద సూచనను సమర్థిస్తూ సంతరించబడిన రచన యిది. ఇది ఒక పెద్ద గేయం. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఆంగ్లంలో వ్రాసిన 'ది ఎకనామిక్ కాంక్వెస్ట్ ఆఫ్ ఇండియా' అనే గ్రంథాన్ని గరిమెళ్ళ 'భరత ఖండము పైని ఆర్థిక విజయము' లేక 'బ్రిటిష్ సామ్రాజ్యము (లిమిటెడ్)' అని తెనిగించగా, ఆ తెలుగు గ్రంథాన్ని హిందూస్థాన్ పబ్లిషింగ్ కంపెనీవారు 1938 లో ముద్రించారు. ఇది 200 పుటల గ్రంథం. 'అది అనువాదపటిమకు, భాషాశైలికి గీటురాయి' అని మల్లెల శ్రీరామమూర్తిగారి అభిప్రాయం.[16]

గరిమెళ్ళ వారి నాలుగవ తమ్ముడు సూర్యనారాయణ మదరాసులో మైలాపూరులో ఒక హోటలు నడిపేవాడు. దాని పేరు కల్పక విలాస్!

జీవనోపాధి నిమిత్తం గరిమెళ్ళ 1933 లో మదరాసు చేరుకున్నాడు. తల్లి ఆయనతోపాటు ఉండేది. గృహలక్ష్మి మాసపత్రికను కె. యన్. కేసరిగారు నిర్వహిస్తూ వుండేవారు. గరిమెళ్ళ ఆ పత్రికా సంపాదకునిగా నియుక్తుడయ్యాడు. ఆయన కేసరిగారికి కుడి బుజంగా వ్యవహరించేవాడు. కొంతకాలమైన తర్వాత ఆయన సంపాదక పదవినుంచి తప్పుకున్నాడు. కొంతకాలం ఆచార్య రంగా గారి వాహినికి సహాయ సంపాదకునిగా పని చేశాడు. ఆ తర్వాత ఆంధ్రప్రభ దినపత్రికా కార్యాలయంలో సహాయ సంపాదకుడుగా చేరాడు. అప్పట్లో న్యాపతి నారాయణమూర్తిగారు సంపాద కులుగా ఉండేవారు. అక్కడ కూడా గరిమెళ్ళ స్థిరంగా ఉండలేదు. కొన్నాళ్ళు ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా (పత్రికా రచయితగా) కాలక్షేపం చేశాడు. ఆనందవాణికి సంపాదకుడుగా కూడా పని చేశాడు.

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, భాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు మొదలైన సహృదయులు గరిమెళ్లకు ఆర్థికంగా సహాయపడుతూ వుండేవారు. గరిమెళ్ల ప్రతిభను గుర్తించి ఆయన్ని ఆద రించిన వారిలో వావిళ్ళ వారు ప్రముఖు లనవచ్చు. ఆయనకి గరిమెళ్ళ అంటే చాలా అభిమానం. నెలకు పది రూపాయలు ఇచ్చేవారట! తమ త్రిలిఙ్గ వార పత్రికలో గరిమెళ్ళ,వ్యాసాలను ప్రకటించేవారు. ఆ రోజుల్లో ఎన్నో రాజకీయ వ్యాసాలు ఆయన వ్రాశాడు. దుందుభి, వికారి అనే లేఖినీ నామాలతో కూడా వ్యాస రచన చేశాడు. అప్పుడప్పుడు సంపాదకీయాలు కూడా వ్రాసే వాడని అభిజ్ఞులు చెపుతారు. అంతేకాక తనవద్దకు వచ్చే వారికి వావిళ్ళ వారు, "తెలుగు దేశంలో సుబ్రహ్మణ్య భారతి అని చెప్ప దగినవాడు సత్యనారాయణ గారు. ఆయన యెడ తెలుగువారి ఆదరణ ఎట్లుందో చూడండి" అనేవారు. [18] శాస్త్రులుగారికి గరిమెళ్ళ పట్ల అంత అభిమానం!

నిజానికి గరిమెళ్ళ తెలుగుదేశపు సుబ్రహ్మణ్య భారతి. వా రిద్దరూ జాతీయ కవులు; గేయ కవులు. తమ తమ భాషల్లో ఎన్నో గీతాలు వెల యించారు. తమిళనాట భారతి వలె, తెలుగు నాడులో గరిమెళ్ళ జాతీ యోద్యమ ప్రచారం చేసిన వాడే. అంతే కాదు; వాళ్ళ గీతాలు ఉద్యమ ప్రచారానికి బహుధా ఉపకరించాయి. ఇద్దరూ వావిళ్ళ వారి సహాయం

కొద్దిగానో గొప్పగానో పొందిన వారే. వివిధ జానపద గేయ రీతుల్ని ఆదరించి, వాటిలో ప్రశస్త గీతాలు సంతరించారు.

వివిధ పత్రికలకూ, ఆల్ ఇండియా రేడియోకీ (మదరాసు కేంద్రం) రచనలు చేసి తద్వారా ధనార్జన చేస్తూ వుండినా, సహృదయుల ఆర్థిక సహాయం లభిస్తూ వుండినా గరిమెళ్ళ మదరాసు జీవితం దుర్భర దారిద్ర్యానికి నామాంతరంగా ఉండే దనడం సత్య సన్నిహితం. దైనందిన జీవితం దిన దిన గండంగా గడిచేది. ఒక వైపు పేదరికం. మరో వైపు అనారోగ్యం. ఈ రెండూ ఆయన్ని పట్టి పల్లార్చినాయి. ఆయనకి ఒక కంటికి శస్త్రచికిత్స చెయ్యగా, ఆ కన్ను గుడ్డి దయింపట. గోరుచుట్టు మీది రోకటి పోటులా, అవసాన కాలంలో పక్షవాతం తోడయింది.

అన్నగారికి తోడు నీడగా సంచరిస్తూ వుండిన రామలింగమూర్తి 1944 లో కాలధర్మం చెందాడు. ఆ యేడే చాలాకాలం వ్యాధిగ్రస్తురాలై ఉండిన గరిమెళ్ళ సహధర్మచారిణి సత్యవతి స్వర్గస్థురాలయింది. ఆమెకు ఇద్దరు కుమార్తెలు. 1951 లో ఆయన తల్లి మరణించింది. ఈ మరణాల వల్ల ఆయన మానసికంగా ఎంత బాధపడి వుంటాడో మనం ఊహించుకోవచ్చు.

అప్పటి గరిమెళ్ళ దుర్భర పరిస్థితుల్ని 'పెంకి పిల్ల' అనే మాస పత్రిక సంపాదకులు శ్రీ పసుమర్తి రాఘవరావుగారు తమ పత్రిక ద్వారా తెలియజేశారు. ఆయన ప్రకటించిన యీ విజ్ఞప్తిని పరికించండి: [19]

*'...వీరికి సహాయం చేయండి*

గరిమెళ్ళ సత్యనారాయణ—వీరు చాలాకాలం ఆంధ్రప్రభలో శ్రీ న్యాపతి నారాయణమూర్తిగారి వద్ద సహాయ సంపాదకునిగా పని చేసారు. ఈ రోజు నిరాధారంగా వున్నారు. పాపము ఈ మధ్యనే వీరికి పూర్తిగా దృష్టి పోయింది. తనకు చేదోడు వాదోడుగా నుండి ధన మార్జిస్తున్న సోదరుడు అకాలమృత్యువు వాత పడినాడు. అది జరిగి ఎన్నాళ్ళో కాలేదు. గత నెల 22 వ తేదీనాడు వీరి గృహిణి పరలోక ప్రాప్తి చెందినది. 10, 6 సంవత్సరముల వయస్సులో నున్న ఇద్దరి పిల్లల్ని పోషించి పెద్ద వారిని

చేయవలసిన బాధ్యత వీరి యందుంది. ఉదారవంతులు, మిత్రులు సహాయం చేయ మనవి.

—రాఘవరావు'

అప్పట్లో గరిమెళ్ళ మైలాపూరులో వీరపెరుమాళ్ కోవిల్ వీధిలో 35 నెంబరు గల యింట్లో నివసించేవాడు. ప్రస్తుతం బరంపురంలో నివసిస్తున్న రాఘవరావుగారిని కలుసుకుని బరంపురం మిత్రులు డి. కృష్ణమూర్తి గారు నాకు వ్రాసిన లేఖలో ఇలా తెలియజేశారు : 20 "పెంకిపిల్ల సంపాదకులతో శ్రీ సత్యనారాయణగారిని గూర్చి అడగ్గా వివరాలు తెలియవుగాని-వారు చాలా సహృదయులనీ, వారున్న యింట్లోనే ఒక భాగంలో పెంకిపిల్ల కార్యాలయం వుండేదనీ, వారికి మిత్రుల సహాయంతో అతి కష్టంగా దినం గడిచేదనీ చెప్పారు. కేసరి కుటీరం వారు కొంత సహాయం చేసేవారని తెలియ పర్చారు."

శస్త్ర చికిత్స కారణంగా ఒక కన్ను గుడ్డి కాగా, ఆతర్వాత రెండో కంటి చూపు కూడా పూర్తిగా పోయిందని అభిజ్ఞులు చెపుతారు.

గరిమెళ్ళ మదరాసు జీవితం ఎంత శోచనీయంగా గడిచిందో టేకుమళ్ళ కామేశ్వరరావుగారి వ్రాతల వల్ల విదిత మవుతుంది. హృదయ విదారకము లైన ఆయన మాటలు ఆలకించండి : 21

చేస్తున్న ప్రభుత్వోద్యోగాన్ని వదులుకుని పత్రికా రచయితగా (1950 లో) మదరాసు చేరుకున్న టేకుమళ్ళ వారిని ఉద్దేశించి గరిమెళ్ళ నిస్పృహతో ఇలా అన్నాడట : "మేము అవస్థ పడుతూనే ఉన్నాము, మహానుభావా ! ఏమి పాముకొందామని మీరు కూడా దీనిలోకే దిగారు !"

ఏ పనేనా చూసుకోలేక పోయేరా ? అని టేకుమళ్ళ వారు ప్రశ్నించగా, గరిమెళ్ళ వారి ఉద్రేకపూరితమైన ప్రత్యుత్తరం ఇలా విన వచ్చింది: "కొందరు త్యాగం చేయాలి ! నశించాలి ! నాశనమై పోవాలి ! అప్పుడే కాని దేశం బాగుపడదు."

మదరాసులో ఉంటే ఏముందండి లాభం ? అని టేకుమళ్ళ వారు అడగ్గా, గరిమెళ్ళ చెప్పిన జవాబు : "మరెక్కడా లేని లాభం ఉంది. ఈ మూల అడుగుకొని తిన్నట్లు ఆ మూలవాడికి తెలియదు."

"ఒకసారి ఆయన చేతికర్ర మీద ఆనుకొని నడుస్తూ దారిని పోతూన్న ఇద్దరిని ఆపి చెయ్యి చాపేరు. వాళ్ళు వేసింది లేదు లెండి. నేను అంతకు ముందు చెవులతో విన్నదే కళ్ళార చూసేను." టేకుమళ్ళ వారి మాట లివి.

రాజకీయ బాధితులకు ఇచ్చినట్లుగా గరిమెళ్ళకు కూడా ప్రభుత్వం వారు పది ఎకరాల పదిసెంట్లు మెట్ట భూమిని ఉమ్మరి పల్లె అనే గ్రామంలో ఇచ్చారనీ, ఆ భూమి వల్ల ఆయన చిల్లి గవ్వ అయినా అనుభవించలేదనీ, అస లాయన ఆ భూమినే చూచి వుండలేదనీ, ఆయన వారసులు కూడా ఆ భూమి వల్ల లాభం పొంద లేదనీ గరిమెళ్ళ వారి మూడో అల్లుడు యర్ర గుంట్ల వెంకట కృష్ణారావుగారు పేర్కొన్నారు. 22 ఇంతకూ ఆ భూమిని గరిమెళ్ళ తన స్వాధీనం చేసుకోలేదు.

అవసాన కాలంలో దుర్భర దారిద్ర్యం అనుభవించినా, గరిమెళ్ళలో దేశభక్తి అణుమాత్రమైనా తగ్గలేదు. ఒకసారి కిన్నెర పత్రికా సంపాదకులు పందిరి మల్లికార్జునరావుగారితో సాహిత్య విషయాలు చర్చిస్తూవుండగా 'మా కొద్దీ నల్ల దొరతనం' అనే గేయం వ్రాయమని గరిమెళ్ళవారిని కొందరు అడిగారని ఆయన అన్నారు. నేను దిగ్భ్రాంతి చెందాను. మూడేళ్ళ క్రితం గుంటూరులో ఒకనాడు మిత్రులు ద్వా. నా. శాస్త్రిగారూ నేనూ కలిసి 'అమరేంద్ర'గారి (సి. నరసింహ శాస్త్రి) యింటికి వెళ్ళాము. మాటల సందర్భంలో ఈ ఉదంతం ప్రస్తావనకు వచ్చింది. అప్పుడు అమరేంద్రగారు ఇలా అన్నారు. 'ఒకరోజు గరిమెళ్ళ సత్యనారాయణగారు పిల్లలమర్రి హనుమంతరావుగారి యింటికి వచ్చారు. అప్పుడు ఈ విషయం మాటల మధ్యలో వచ్చింది. కొందరు నన్ను మా కొద్దీ నల్ల దొరతనం అనే గేయం వ్రాయమంటున్నారు. కాని నా మనస్సు అందుకు ఒప్పుకోవడం లేదని గరిమెళ్ళ వారు స్పష్టం చేశారు.' తట్టుముట్టాడే పేదరికం అనుభవిస్తున్నప్పటికీ, గరిమెళ్ళ నిజమైన దేశ భక్తుడుగా, స్వాతంత్ర్య ప్రియుడుగా, నిజాయితీ గల వ్యక్తిగా నిలబడగలిగాడు!

కాంగ్రెసు నాయకులవల్లగాని స్వాతంత్ర్యానంతరం పదవుల్లోకి వచ్చిన ప్రముఖులవల్లగాని గరిమెళ్ళకు చెప్పుకోదగిన సహాయం లభించ లేదని తెలియవస్తున్నది. అసలు ఆయనపట్ల వారు చూపవలసినంత ఆదర

భావం చూపలేదేమో అని అభిజ్ఞులు భావిస్తారు. ఇది నిజమనిపిస్తుంది. స్వతంత్ర భావాలు కల ఆయన కూడా నాయకుల సహాయం కోసం అర్రులు చాచినట్లు కనిపించదు. ఈ సందర్భంలో గురుజాడ రాఘవశర్మ గారి మాటలు స్ఫురణకు తెచ్చుకోవడం సమంజసం. ఆయన యిలా పేర్కొన్నారు. "వీరప్రబోధమూనిసికి తెలివి తేటలలో లోపము లేక పోయినప్పటికి, లౌకిక జ్ఞానము లోపంవల్ల కడపటి జీవితం బహు కడ గండ్ల పాలైందని యెరిగినవారు అనేవారు."

నిజమే. గరిమెళ్ళకు తెలివితేటలు ఉన్నాయి; చదువు సంధ్యలు ఉన్నాయి. లేనిదల్లా లౌకిక జ్ఞానమే. ఏది ఎలా ఉన్నా, అవసాన కాలంలో గరిమెళ్ళను విరక్తి, నిరాశ, నిస్పృహ మొదలైనవి ఆవహించి వుండవచ్చు ననడంలో ఆశ్చర్యం లేదు. బ్రిటిషువారి కుటిల రాజనీతిని నీతిని ధైర్య స్థైర్యాలతో ప్రతిఘటించి చాలాసార్లు కారాగార వాస క్లేశం అనుభవించిన ఆ వీరయోధుడికి ఇలాంటి భావాలు కలగడం దురదృష్టం! 'ఆయన చివరి రోజులలో చాలా విరక్తి చెందినట్టు కనిపించింది' అని నరసింగరావుగారు పేర్కొన్నారు.23 ప్రముఖ పత్రికా సంపాదకులు నండూరి రామమోహనరావుగారు కూడా తమ (10-11-1982) లేఖలో ఇలా అన్నారు. "నేను ఆయన్ని తరుచుగా చూస్తూ వుండేవాడిని. ఆంధ్ర పత్రిక ఆఫీసుకు వస్తూ వుండేవారు. సన్నగా, పొట్టిగా, పేదరికంతో బాధపడుతున్న వ్యక్తిగా కనబడేవారు. మా కొద్దీ తెల్ల దొరతనము అనే ప్రసిద్ధ గీతం రచయితగా మా సబ్ ఎడిటర్ల మందరం ఆయనను గౌర వించేవాళ్ళం. ఏదో ఇష్టాగోష్ఠిగా మాట్లాడి వెళ్ళిపోయేవారు. మాటల్లో frustration బాగా కనబడేది." ఈ విషయాన్ని మల్లెల శ్రీరామమూర్తి గారు కూడా సమర్థించారు. "ఆంధ్ర జాతీయ నాయకులు తనను గుర్తించ లేదనే బాధ ఆయనలో వ్యక్త మయ్యేది."24

జాతీయోద్యమం సాగిన రోజుల్లో గరిమెళ్ళ పాటలు ప్రచుర ప్రచా రంలో ఉండేవి. ఎంద రెందరో వాటిని పాడేవారు. సుప్రసిద్ధ జాతీయ నాయకులు ఆచార్య రంగాగారు 'ప్రజా పాటల త్యాగయ్య' అని గరిమెళ్ళను ప్రస్తుతించారు. 'ఆయన కాలంలో ఆయ నంతటి జాతీయ కవి మరి లేడు అనిపించుకున్నవాడు గరిమెళ్ళ" అన్న ఖద్దూరి సుబ్బారెడ్డిగారి మాటలు

అక్షరాలా నిజం.[25] అలాంటి ప్రముఖుడు స్వాతంత్ర్యానంతరం—అందు లోను కాంగ్రెసు పార్టీ ప్రభుత్వాధికారం చేపట్టిన రోజుల్లో—విస్మృత జీవి కావడం నిజంగా దురదృష్టం!

స్వాతంత్ర్య సముపార్జన కోసం తన విద్యా బుద్ధుల్ని త్రికరణ శుద్ధిగా మీదు కట్టి, చరమ దశలో మరీ దుర్భరమైన జీవితం గడిపిన గరిమెళ్ళ సత్యనారాయణ మదరాసులో 1952, డిసెంబరు 18న—అనగా మరో త్యాగమూర్తి పొట్టి శ్రీరాములుగారు ఆత్మార్పణం చేసిన మూడవ రోజున—స్వర్గస్థుడయ్యాడు. మరణించేనాటికి ఆయన అరవైయేళ్ళవాడు. ఆ మహనీయుడు మరణించినప్పుడు దగ్గర 10 - 12 ఏళ్ళ కుమార్తె తప్ప మరెవ్వరూ లేరు. అంత్యక్రియలు ఇరుగుపొరుగు వారు జరిపారట![26].

గరిమెళ్ళకు నలుగురు ఆడపిల్లలు. పురుష సంతానం లేదు. ముగ్గురు కుమార్తెలకు ఆయన ఉండగానే వివాహాలు జరిగాయి. కడపటి కుమార్తె వివాహం ఆయన మరణానంతరం జరిగింది. ఆ వివాహానికి తెన్నేటి విశ్వనాథంగారు వందరూపాయలు సహాయం చేశారు.

నడి వయస్సులో ఉండగానే గరిమెళ్ళను నిరాశ వరించినట్లు కని పిస్తుంది. "తెలిసిన మొహాలు ఎదురవకుండా ప్రశ్నించకుండా నేను రాత్రులు ప్రయాణం చేస్తాను" అని 1927 లో ఆయన టేకుమళ్ల కామేశ్వరరావుగారితో అన్నారట! [27]

'జాతస్య మరణం ధ్రువం'. ఈ మాట యిప్పటిది కాదు. సృష్టితో పాటే మరణమూ ఏర్పడింది. మొదట్లో కొందరు ఎలా జీవించినా, మరణానంతరమైనా వారి ప్రతిభ గుర్తించబడుతుంది. వారికి స్మృతిచిహ్నా లంటూ కొన్ని వెలుగులోకి వస్తాయి. ఆ విధంగా వారి పేరు ప్రచారంలో ఉంటుంది. ఈ దృష్టితో చూస్తే, గరిమెళ్ల నిజంగానే దురదృష్టవంతు డనిపిస్తుంది. జీవితకాలంలోనూ ఆయనకి రావలసినంత పేరు పెంపులు రాలేదు. విగత జీవుడైన తర్వాత విస్మృత జీవి అయ్యాడు. ఆంధ్రరాష్ట్ర పత్రికా సంపాదకుల సంఘం పక్షాన ఒక సహాయ నిధిని సేకరించాలని కొందరు ప్రయత్నించి విఫల మనోరథు లయ్యారట! ఆయన మరణా నంతరం ఆయన సాహిత్యం ఎలా కాలగర్భంలో కలిసిపోయిందో, ఆయన

పేరు ఎలా మాసిపోయిందో తెలుసుకోవడానికి ఆయన అల్లుడు యర్రగుంట్ల వెంకటకృష్ణారావుగారు కామేశ్వరరావుగారికి 1963, జూలై 12 న వ్రాసిన లేఖలోని యీ విషయాదికం తోడ్పడుతుంది.[28]

"సత్యనారాయణగారు చనిపోయిన తరువాత వారి పుస్తకాలు కొందరు తీసికొని వెళ్ళిరి. కాన ప్రస్తుతము నా యొద్ద వారి పుస్తకము లేవియును లేవు. కొన్నాళ్ళవరకు కొన్ని వ్రాత పుస్తకము లుండెను. కాని అవి కూడ ఈ పదకొండు సంవత్సరములలో నాశనమైన వని తమకు వ్రాయుటకు చిన్నతనము కల్గుచున్నది. వారు చనిపోయినాక తమరే ప్రప్రథమముగా వారిని గురించి తెలిసికొన కోరినారు."

కాని ఎప్పటికైనా గరిమెళ్ళను గురించీ, ఆ జాతీయకవి సృష్టించిన సాహిత్యాన్ని గురించీ తెలుసుకోవడానికి తెలుగు వారు తప్పక కృషి చేయగలరనే నా ఆశాభావం.

ఈనాడు గరిమెళ్ళ పేరు ప్రఖ్యాతులు నలుగురికీ తెలియకపోవచ్చు. ఆయన రచనలు ప్రచుర ప్రచారంలో లేకపోవచ్చు. ఆయన ఏ పదవులూ నిర్వహించి వుండకపోవచ్చు. కాని మరచి పోదామన్నా మరవలేని ఒక సంఘటన ఆయన జీవితంలో అంతర్భాగమై పోయింది. ఆ సంఘటన ఆయనకే కాదు తెలుగు వారికే గర్వకారణమై ప్రతిభాసిస్తున్నది. [29]

అది గాంధీజీ సబర్మతీ ఆశ్రమం. మహాత్ముని ఆదేశానుసారం జాతీయ గీతాలు వెలయించిన రచయిత లందరూ ఆశ్రమంలో సమావేశ మయ్యారు. మీ గీతాలు వినిపించండి—అని జాతిపిత కోరాడు. రచయితలు వివిధ భాషలలో తాము రచించిన గీతాలు వినిపించసాగారు. గరిమెళ్ళ వంతు వచ్చింది. తన పాట వినిపించే ముందు, "నా పాటకి ప్రభుత్వం వారు ఒక సంవత్సరం కఠిన నరకం విధించేరు" అన్నాడు గరిమెళ్ళ. గాంధీజీకి నమ్మకం కుదరక, "నేను నమ్మను; నీవు మరి ఏదైనా చేసి వుండాలి" అన్నాడు. దగ్గరున్న వాళ్ళు 'కాదు' అన్నారు. మహాత్ముడు ఆశ్చర్యపోయాడు. పాట వినిపించ మన్నాడు. గరిమెళ్ళ తన కంచు కంఠ మెత్తి మా కొద్దీ తెల్లదొరతనము పాట ఆలపించాడు. గాంధీజీ గరిమెళ్ళని ఎంతగానో ప్రశంసించాడు. అంతే కాదు, ఆ పాట వరుసలో తమ తమ

భాషలలో పాటలు వ్రాయవలసిందని మహాత్ముడు ఆ రచయితల్ని కోరాడు.

జాతీయ గేయ రచయిత, ప్రసిద్ధ కవి అయిన పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారు గరిమెళ్ళను ఇలా ప్రస్తుతించారు. 30

*'మా కొద్దీ తెల్లదొరతనము*
*వాకొన్నా వీ వంచు*
*పట్టి నిన్ను దొరలు*
*బందీ చేశారూ.'*

*'పాట వ్రాసి జనుల*
*బాటను దీర్చావు*
*పాట నీ జీవితమే*
*కాటు వేసింది.'*

---

జ్ఞాపికలు

1. గోనెపాడు గ్రామం శివారైన ప్రియాగ్రహారంలో జన్మించినట్లు గురుజాడ రాఘవశర్మగారు (గరిమెళ్ళ సత్యనారాయణగారి జీవిత చరిత్ర, 1985), యం. వి. శాస్త్రిగారు (ఆంగ్ల వ్యాసం, గరిమెళ్ల సత్యనారాయణ, తెలుగు వాణి, జూలై–సెప్టెంబరు 1979) పేర్కొన్నారు. జన్మించిన గ్రామం గోనెపాడు అని చేకుమళ్ల కామేశ్వరరావు (నా వాఙ్మయ మిత్రులు, 1966, పుట 327), మల్లెల శ్రీ రామమూర్తి (మృతవీరుని స్మరణ అనే వ్యాసం, విజయవాణి, 15-8-1982) ప్రభృతులు పేర్కొన్నారు.

గరిమెళ్ళ స్వగ్రామం ప్రియాగ్రహార మని అందరూ అంగీకరించిన అంశం.

2. ఈ వివరాలు నాకు తెలియజేసిన వారు విజయనగరం వాస్తవ్యులైన మేడేపల్లి నరసింగరావుగారు. ప్రసిద్ధ వైణికు లైన వీరు గరిమెళ్ళ సత్యనారాయణగారి మూడవ చెల్లెలు లలితమ్మగారిని 1926 లో వివాహం చేసుకున్నారు. నరసింగరావుగారు ప్రసిద్ధ విద్వాంసులూ, ప్రముఖ రచయి

తలూ అయిన బులుసు వేంకటరమణయ్యగారి వియ్యంకులు. వేంకటరమణయ్యగారి ప్రోత్సాహంతో నేను నరసింగరావుగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాను. గరిమెళ్ళ జీవితానికి సంబంధించిన వివరాలు తెలిపిన వీరిరువురికీ కృతజ్ఞణ్ణి.

3. నరసింగరావుగారి లేఖ (31-12-1985).

4. సత్యనారాయణగారి పెద్ద తమ్ముడు ఇంటర్మీడియేటు, మిగిలిన సోదరులు యస్. యస్. యల్. సి. ప్యాసయ్యారు (మేడేపల్లి వారి మరో లేఖ).

5. పట్టభద్రుడైన తర్వాత ఉద్యోగం దొరకలేదని ఏకుమళ్ళ వారి అభిప్రాయం. నా వాఙ్మయ మిత్రులు, పుట 328.

6. గరిమెళ్ల సత్యనారాయణగారి జీవిత చరిత్ర, పుట 10. నా వాఙ్మయ మిత్రులు, పుట 324.

7. "...టీచరుగా పనిచేస్తూ కాంగ్రెసు మూమెంటులో చేరి సదరు ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చినారు." నరసింగరావుగారి లేఖ (31-12-85). ట్రెయినింగు పూర్తి చేసినట్లు యం. వి. శాస్త్రిగారు కూడా తమ వ్యాసంలో పేర్కొన్నారు.

8. నా వాఙ్మయ మిత్రులు, పుట 328. ఆచంట జానకిరాం గారు తమ స్మృతిపథంలో ఇలా పేర్కొన్నారు (పుటలు 83-84): "నా దేశ భక్తి ప్రబోధ మెంత తీవ్రముగా ప్రజల హృదయములలో నాటిపోయినదనగా, పెండ్లిండ్లలో కూడ బ్యాండు వాద్యము ప్రారంభ మైనచో మా కొద్దీ తెల్లదొరతనము పాట వినిపించెడిది. స్త్రీలు రా రా! గాంధికుమారా! అనుచు నలుగు పాటలు, తలుపు దగ్గర పాటలు పాడేవారు. మంగళ హారతిని పట్టిన పసిపిల్లలు మంగళంబు భరతమాత—అని ఆరంభించెడి వారు.'

9. బులుసు వేంకట రమణయ్యగారి లేఖ.

10. ఈ లేఖ మద్దూరి సుబ్బారెడ్డిగారి 'తెలుగులో జాతీయోద్యమ కవిత్వం' (1982) నుంచి గ్రహించబడింది.

[Mr. Garimella Satyanarayana's Message to the Andhras—The Hindu, 11th February, 1922]

Dear brothers and sisters,

I have done my little work and am going to a comparatively long rest. The British bureaucracy have determined to lull my pen and my voice for a period of one year. It pleased them to think that I am dangerous to the 'Public tranquility' which means its own existence. Certainly it is a revelation to me. If am really such as it suspected me to be, it certainly caught me at too late an hour. I have given out to the country what is best in me. My physical body is to be locked up, but my soul I have let off into the country through literature. Let it be gathered, consolidated and worked out. It will work more than my frail body. The times are past when the government's proscription or prohibition could gag our liberties I often times wished to move among my people through my songs than through my person. The government have created that peculiar opportunity, if the people can avail themselves of it. I feel that I am most hollow now and may God grant that I should return into your midst for the sake of singing the establishment of Swarajya and the glory of your achievements.'

11. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1919.

12. నరసింగరావుగారి లేఖ (31-12-1985).

13. నా వాఙ్మయ మిత్రులు, పుట 324.

14. నరసింగరావుగారి లేఖ.

15. ఖులుసు వేంకట రమణయ్యగారి 17-1-1984 లేఖ.

16. మా కొద్దీ తెల్లదొరతనము వ్యాసం, ఆంధ్రపత్రిక, 30-6-1985.

17. మదరాసులోని మైలాపూరులో మూడవ తమ్ముడు రామలింగ మూర్తి హోటలు నడిపే వాడని కొందరి అభిప్రాయం. ఆ హోటలు పేరు

కల్పక విలాసం. కాని నరసింగరావుగారు తమ లేఖలో శ్రీవాస్ హోటలని వ్రాశారు. మైలాపూరులోని ప్రసిద్ధ శివాలయం కపాలీశ్వరర్ కోయిల్. అమ్మవారి పేరు కర్పగాంబికై. అనగా కల్పకాంబిక అని అర్థం. దేశ భక్తులు రచయితలు సుప్రసిద్ధ వైద్యులు అయిన డా. గూడూరి నమశ్శివాయగారు తమ లేఖలో ఇలా వ్రాశారు. 'గరిమెళ్ళ సత్యనారాయణగారు చివర రోజులలో మద్రాసులో కల్పకం విలాస్ హోటల్ నడుపు కాలంలో పరిచయ మయ్యారు ఒకనాడు ఒక బస్తా జగ్గయ్యపేట దోసకాయలు పంపగలవా ? అని అడిగారు. అల్లాగే నని చెప్పి ఇంటికి వచ్చిం తరువాత పంపించాను...చాలా కృతజ్ఞతలు తెలుపుతూ కార్డు వ్రాశారు.'

18. నా వాఙ్మయ మిత్రులు, పుట 326. ఆ మాటలు విని 'నేను తల వంచుకోవలసి వచ్చింది' అంటారు కామేశ్వరరావుగారు.

19. 1946, మే నెల పెంకిపిల్ల పత్రిక.

20. 16–2–1979 నాటి లేఖ.

21. నా వాఙ్మయ మిత్రులు.

22. పైదే, పుట 329.

23. ఆయన 31–12–85 లేఖ.

24. మా కొద్దీ తెల్లదొరతనము వ్యాసం, ఆంధ్రపత్రిక, 30–6–85.

25. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట 259.

26. బులుసు వేంకట రమణయ్యగారి లేఖ. అందులో ఈ విషయం తెలియజేస్తూ, ఆయన యిలా పేర్కొన్నారు. "పేపర్లో ఈ వార్త చదివి నేను మైలాపూరు వారి యింటికి వెళ్ళాను. అమ్మాయికి సహాయంగా 3 గంట లున్నాను. తర్వాత మెయిలులో ఆయన అల్లుడొకడు వచ్చిన తర్వాత ఇంటికి వచ్చాను."

27. నా వాఙ్మయ మిత్రులు, పుట 325.

28. పైదే, పుట 329.

29. పైదే, పుట 323.

30. జయభారతి.

# 4. గుణగణాలు

గరిమెళ్ళ అనగానే ఆయన అకుంఠిత దేశభక్తి ప్రధానంగా స్ఫురణకు రావడం పరిపాటి. మూర్తీభవించిన దేశభక్తుడు. రూపు గట్టిన అచ్చమైన దేశభక్తి. నిజమైన దేశభక్తుడు కనుకనే, కటిక పేదరికం అనుభవించినా, పదవిలో ఉన్న కాంగ్రెసు వారు గాని నాయకులు గాని తనను ఆదరించకపోయినా, మా కొద్దీ నల్లదొరతనం గేయం వ్రాయమని కొందరు ప్రోత్సహించినా, ఆయన అలా చేయక దేశభక్తుడుగానే ఉండి, దేశభక్తుడుగానే కన్ను మూశాడు. పేదరికం అన్ని అనర్థాలకు ఆలవాలమైనా, ఆయన పేదరికంతోనే యమయాతనలు పడ్డాడు గాని పదవులు ఆశించలేదు. అంత స్వతంత్ర ప్రవృత్తి ఆయనది!

గరిమెళ్ళ నిరాడంబర జీవి—ఆయనతో పరిచయమున్నవాళ్ళ అభిప్రాయ మిది. ఖద్దరు నియతిగా ధరించేవాడు. 'ఖద్దరు కళ్ళీ జుబ్బా, ఖద్దరు పంచ, ఖద్దరు ధోవతీ వేసుకునే వారు' అని నరసింగరావుగారు తమ లేఖలో పేర్కొన్నారు. పుల్లెల శ్రీరామమూర్తిగారు ఇలా అన్నారు: 'వారిని మద్రాసులో కలుసుకుని ఆయన దుస్థితికి బాధ పడ్డాను. ముతక మాసిన ఖద్దరు దుస్తులతో వుండే వారు.'[1] కావి రంగు ముతక ఖద్దరు పంచె ధరించే వారని గురుజాడ రాఘవశర్మగారు కూడా పేర్కొన్నారు.

తమ బావగారిని గురించి చెపుతూ, 'వారి అలవాట్లు చాలా మంచి అలవాట్లు. ఏ విధమైన దురలవాట్లు ఉండేవి కావు' అన్నారు నరసింగరావుగారు.[2] బరంపురం కారాఖిల్లీ సేవించేవాడని తెలుస్తున్నది. గజయీతగాడనీ వ్యక్త మవుతున్నది.

గరిమెళ్ళ సుస్వరద్రూపి కాడనీ, అయినా కురూపి మాత్రం కాదనీ ఆయనతో పరిచయం గలవారందరూ ముక్త కంఠంతో పేర్కొన్నారు. రాఘవశర్మగారు కళ్లకు కట్టినట్లు ఆయన వేషభాషల్ని అభివర్ణించారు.[3] ''ఒకమాదిరి చామనఛాయ. పైకి కొంత మోటు మనిషిగా కనబడుతాడు. 5 అ. 4 అంగుళముల మధ్య రకం యెత్తు. పలుచని శరీరము. పెద్ద నుదురు. తీర్చిన కళ్ళు. గంభీరమైన చూపు. కోటేరు వంటి ముక్కు ... మితభాషి. కంచు కంఠ స్వరము. ..అనునాసిక ధ్వని మిళితమైన వాక్కు.

నిష్కల్మషమైన నవ్వు మొగం.'' ఎంత మితభాషి అంటే, అడిగిన దానికి మాత్రం సమాధానం చెప్పేవాడు.

గరిమెళ్ళతో బాగా పరిచయం కల వ్యక్తులలో టేకుమళ్ళ కామేశ్వర రావుగా రొకరు. రాజమహేంద్రవరంలోనే గాక మదరాసులో కూడా ఆయన్ని తరుచుగా కలుసుకునేవారు. గరిమెళ్ళ వేషధారణనే కాక ఆయన గుణగణాలను కూడా కామేశ్వరరావుగారిలా అభివర్ణించారు.[4] ''ఆయన నలుపు అని చెప్పదగిన చాయ. మామూలు మనిషి కంటె కొంచెం ఎత్తరి. మోటుగా కనబడతారు. పెద్ద నుదురు. ఒత్తైన క్రాపింగు. పెద్ద కళ్ళు. గంభీరమైన చూపు. ఖద్దరును ధరించే వారు. బహుమిత భాషి. మనం ఎన్నో ప్రశ్నలను వేస్తేగాని సమాధానం రాదు. మాట్లాడడం మొదలు పెడితే అడ్డులేని వాగ్ధుటి. పెద్ద కంఠ స్వరం. ఉద్రేకంతో మాట్లాడ తారు. నిష్కల్మషమైన నవ్వు. పెద్ద పెట్టున నవ్వుతారు. సహవాసదోషం వల్ల కాబోలు బరంపురం మసాలా అలవాటు. ఎడమ చేతిని నడుముకి ఆన్చి తల వంచుకొని ఇన్నీసుపేటలోని (రాజమహేంద్రవరం) ఇంటి ఎత్తు అరుగుల మీద పచారు చేస్తూండేవారు. దేవు డిచ్చిన దార్ఢ్యము బాగుంది. గోదావరికి అడ్డుపడి అవతలికి చేరుకొనేవారు.''

గాంధీజీ సిద్ధాంతాలలో ఎనలేని విశ్వాసం గలవాడు గరిమెళ్ళ. కను కనే ఆయన మహాత్ముని నిర్మాణ కార్యక్రమంలోని వివిధాంశములు గురించి చక్కని గేయాలు వ్రాసి ప్రచారం చేశాడు. మహాత్ముణ్ణి గురించి కూడా పెక్కు గేయాలు వెలయించాడు.

మాతృదేశాభిమానం ఎంత మిక్కుటమో, గరిమెళ్ళకు ఉపనిషత్తులు మొదలైన వాటియందు అంతే అభిమానం. ఆయన గీతాలు చదివే కొద్దీ యీ అంశం స్పష్ట మవుతుంది. ఆయన కావించిన మాతృస్తవంలోని యీ కింది చరణాలు పరిశీలించండి.

*''ఉపనిషత్తు లుద్భవించె యుదర మందున*
*ఉదర మందున, అవి నిదుర చెందునా!*
*సకల పురాణేతిహాస సారభరితవు*
*సారభరితవు, ఓంకార మహితవు.''*

గరిమెళ్ళ బహు భాషాభిజ్ఞుడు. తమిళం, కన్నడం, ఆంగ్లం మొదలైన భాషలు అభ్యసించాడు. అయినా ఆయన మాతృభాషాభిమానం నిరుపమానం. ఆయన చేతిలో జాతీయగేయం అందాలు దిద్దుకుంది. అసహాయోద్యమ ప్రచారంలో స్వీయగానంతో ప్రజల్ని ఉద్రూత లూగించిన కవులలో ఆయన ప్రముఖుడని విజ్ఞుల అభిప్రాయం. రాఘవశర్మగారు ఆయన్ని జాతీయ గేయ కవి సార్వభౌముడని పేర్కొనగా, విశ్వనాథ సత్యనారాయణగారు ఆయన్ని జాతీయ కవి సార్వభౌముడని ప్రశంసించారు. గరిమెళ్ళ నూటికి నూరుపాళ్ళు జాతీయ కవి.

సరళమైన గ్రాంథికంలో గరిమెళ్ళ రచనా వ్యాసంగం చేశాడు. కొన్ని సందర్భాలలో అయితే అరసున్నలు కూడా ఉపయోగించాడు. ఆయన రచనల్లో శకటరేఫాలు కూడా తొంగి చూస్తాయి. గేయ రచనలో కూడా అక్కడక్కడ గ్రాంథిక భాషా మర్యాదలు కనిపిస్తాయి. అంత మాత్రాన గరిమెళ్ళ వాడుక భాషను ఆదరించలేదనో, వాడుక భాష అంటే ఆయనకు అభిమానం లేదనో అనుకోవడం అసమంజసం. వాడుక భాషలో గేయాలు వెలయించాడు. తేట తెలుగు మాటల మీద ఆయనకి గల అధికారం కొనియాడ దగింది. అంతేకాదు. మహాకవి గురజాడ అప్పారావుగారంటే ఆయనకి ఎంతో ఆదరభావం ఉన్నట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు. ఆ మహాకవి నిర్యాణం చెందిన సందర్భంగా గరిమెళ్ళ 'వాడుక తెనుగు' అనే శీర్షికతో ఒక దీర్ఘ గేయం (80 చరణాలు) వ్రాశాడు. అది 1915, డిసెంబరు 4వ తేదీన కృష్ణా పత్రికలో ప్రచురించబడింది.

*'స్వర్గలోకము పోయినావా*
*సరగుననను కన్నీళ్లు దొరలుచు*
*నాదు చిత్తము కలియబెట్టగ*
*నాయనా! ఓ అప్పరావూ!'*

అని ప్రారంభమయ్యే కవితలో ఒకచోట గరిమెళ్ళ అంటాడు గదా:

*''సహజమున సౌందర్య ముందని*
*చాటి చెపితివి లోక మంతకు.''*

వాడుక భాష కృత్రిమం కాదనీ, సహజ మైనదనీ, ఆ సహజమైన భాషలోనే సౌందర్య మున్నదనీ గరిమెళ్ళ నిస్సంశయంగా భావించాడు. ఆ తరువాతి చరణాలలో గరిమెళ్ళ తన భావాన్ని మరింత స్పష్టం చేశాడు.

*''నరుల నోళ్ళను నలిగివుండిన*
*నాణెమైన పదాల లోపల*
*ఆడుచుండును ప్రకృతి యంటూ*
*అందరికి తెలిపితివిగదరా!''*

నరుల నోళ్ళను నలిగే భాష గరిమెళ్ళకు కరతలామలకం.

1938, అక్టోబరులో పశ్చిమగోదావరి జిల్లాలోని కేశవరంలో జరిగిన 'ఆంధ్రదేశ ప్రోగ్రెసివు రైటర్స్' మహాసభకు గరిమెళ్ళ అధ్యక్షత వహించి 'వయోజన విద్య—నిరక్షరాస్యత నిర్మూలన' అనే విషయం గురించి చక్కని ఉపన్యాసం చేశారు. ఆనాటి సభను అప్పటి మంత్రి వర్యులు డాక్టర్ సుబ్బరాయన్‌గారు ప్రారంభించారు.[5] ప్రోగ్రెసివ్ రైటర్స్ అనే మాటను గరిమెళ్ళ 'పురోభివృద్ధి లేఖకులు' అని అనువదించారు.

'ఆంధ్రులు చవి చూడవలసిన నూతన సాహిత్య పాకములు ..' అని గరిమెళ్ళ శ్రీ శారదా గ్రంథమాలా ప్రకటనలో పేర్కొన్నారు. నూతన సాహిత్యం—బహుశః పురోభివృద్ధి సాహిత్యం—వెలువడాలని గరిమెళ్ళ ఆశించాడని భావించవచ్చు. ఆయన అభ్యుదయ వాది అనడం చర్వితచర్వణం. 'కొత్త పద్ధతులలో, కొత్త సందేశములతో వ్రాయవలసి వచ్చుటయు నన్నీ గ్రంథమును ప్రచురించుటకు బురికొల్పినవి—' అని గరి మెళ్ళ తన 'నూతన జాతీయగీతములు' సంకలనంలో చెప్పుకున్నాడు.[6] కొత్త పద్ధతులు, కొత్త సందేశాలు అవసర మని గ్రహించిన వాడు గరి మెళ్ళ. తన మనోభావాలకు అనుగుణంగా ఆ కొత్త సందేశాలను తీర్చి దిద్దాడు. మారుతున్న తరాలకు ఆకొత్త సందేశాలు నచ్చినా నచ్చక పోయినా, గరిమెళ్ళ ఆశించిన ఆ 'కొత్త' జాతికి నూతనోత్తేజం ప్రసాదిస్తుం దనడం సత్య సన్నిహితం.

తెలుగు సాహిత్యంలో కొత్త పద్ధతులు నెలకొనాలని ఆశించిన తెలుగు భాషాభిమాని గరిమెళ్ళ. షేక్స్పియర్ మహాకవిని అనుసరించి ఆయన బ్లాంక్ వర్స్‌లో (ముక్తచ్ఛందం) మాణిక్యము అనే నాటకం వెలయించాడు. పద్య రచనలో కవికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలనే ఉద్దేశంతో కాబోలు ఆయన యతిప్రాసలు లేని వృత్త రచన కావించాడు. సమష్టి భావానికి బ్రహ్మరథం పడుతూ విప్లవ గీతాలు రచించాడు. ఆ నాటి భావ కవుల పోకడలు ఆయనకి నచ్చలేదు. కనుకనే వారిని పరిహసిస్తూ 'చేవ గీతం' సంతరించాడు. రాజకీయ చైతన్యమూ, ఉద్రేక స్వభావమూ, అభ్యుదయ భావాలూ గల గరిమెళ్ళ వంటి కవికి భావకవిత్వం నచ్చకపోవడం వింత కాదు. "రాజకీయాల నుండి కవిత్వ విషయాలు ఎంచుకోవాలి కవులు" అని 1927 లో ఆయన అన గలిగాడంటే, గరిమెళ్ళ ఎంత అభ్యుదయ వాదో ఊహించుకోవాలి. రాజకీయాల నుంచి ఇతివృత్తం స్వీకరించి కళాత్మకంగా రచన చెయ్యడానికి ధైర్యంతోపాటు ప్రతిభ కూడా పుష్కలంగా ఉండాలి. సూత్రప్రాయంగా గరిమెళ్ళ అన్న యీ మాటల్లో కొండంత అర్థ ముంది!

మూర్తీభవించిన స్వాతంత్ర్య వాంఛ గరిమెళ్ళ. ఆయన నరనరాల లోనూ ఆ వాంఛ జీర్ణించుకు పోయింది. గేయం పాడినా, కావ్యం వెలయించినా ఆయనకు ప్రధానంగా స్ఫురించేది యీ స్వాతంత్ర్య వాంఛే. 1921 లో ముద్రితమైన 'ఖండ కావ్యములు' అనే పుస్తకానికి ఆయన మున్నుడి వ్రాసుకుంటూ ఇలా అన్నాడు: [7] "స్వాతంత్ర్య వాంఛ అను తేజస్సుతో మిళితములు కాని కవితాసక్తియు సాహిత్యాభిమానమును కేవల వ్యసనములును, విద్యాభిరుచి యొక విలాసమాత్రమును, దైవ భక్తి యొక బూటకము."

గరిమెళ్ళలో గూడు కట్టుకున్న స్వాతంత్ర్య వాంఛా స్వభావాన్ని అవగతం చేసుకోడానికి ఈ వాక్యం ఎంతైనా ఉపకరిస్తున్నది. స్వాతంత్ర్య వాంఛా రహితమైన కవితాసక్తీ, సాహిత్యాభిమానమూ కేవల వ్యసనము లట! స్వాతంత్ర్య వాంఛ లేని దైవ భక్తి కూడా బూటకమే అంటాడు, ఆ స్వాతంత్ర్య సమర యోధుడు. ఆ స్వాతంత్ర్య వాంఛతోనే ఆయన స్వాతంత్ర్య సమరంలో దూకి త్యాగమూర్తి అనిపించుకున్నాడు.

ఆ స్వాతంత్ర్య వాంఛే అడ్డు నిలవగా సరిగా ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యక చివరికి కటిక పేదరికంతో కొట్టు మిట్టాడి కన్ను మూశాడు.

ఆ నాటి ప్రముఖులు పలువురికి వలె గరిమెళ్ళ కూడా అఖండ భారతాన్నే అభిలషించాడు. ఈ అంశాన్ని మనం ఆయన గీతాలలో చూడవచ్చు. కాని దురదృష్టవశాత్తు, భారతదేశం ముక్కలు కాక తప్పింది కాదు. అలా తన మధుర స్వప్నం చెదిరిపోయినందుకు గరిమెళ్ళ ఎంతగానో బాధ పడ్డాడు. ఆ బాధను ఆయన 'చీలికలు' అనే గేయం ద్వారా వ్యక్తం చేశాడు. [8] పరికించండి :

''అఖండ హిందూస్థాన స్వప్నం
ఆఖరు కిట్టడు గంటించి.
పాకిస్థానుకు ముస్లిము లీగు
సంస్థానాలకు సంస్థానాలు
విభాగములకై వివిధ జాతులు
ఎవరికి యిష్టం అయినటు వారు
ఏవో కోర్కెలు కోరుతువుంటే
అందరికీ తా నిస్సహాయమై
ఆడించెను తల కాంగ్రెస్సు.
ముక్కలంటే ముక్కలా
స్థాన్లు సంస్థానాలే కాదు
జాతులను రాష్ట్రాలనే కాదు
సైన్యాలను పోలీసుల కూడా
కుల తత్వాలను కూపములలోకి
ఈడ్చివేసి, 'ఇటుపై మీ పాటులు
మీరు పడం' డని తాను తప్పుకో
తలచినట్లు ప్రకటిస్తూ వుండే
బ్రిటిషువాడి ప్రతిభను చూస్తే
విధాతకే అచ్చెరు వవుతోంది.''

తన కుటుంబ పరిస్థితుల వల్లనే కాక, ఈ చీలికల్ని తలుచుకుని కూడా గరిమెళ్ళ విరక్తి చెంది వుంటాడు. చిరకాల మధుర స్వప్నం చెదిరి పోయినప్పుడు ఎవరికి మాత్రం విరక్తి కలగదు !

ఈ సందర్భంగా గరిమెళ్ళ వారి కుమార్తె జొన్నలగడ్డ ప్రభావతి గారు చెప్పిన మాటలు పరిశీలించ దగినవి. ఆయన ఎప్పుడూ ఆలోచిస్తూ వున్నట్లు కనిపించేవాడనీ, వెన్నెల్లో కూర్చుని వ్రాసే వాడనీ, తమ చేత ఖద్దరు చీరలే ధరింప జేశారనీ, పట్టు చీరల్ని దగ్గరికి రానివ్వ లేదనీ, ఇంగ్లీషు చదువు మాన్పించారనీ ఆమె తెలియజేశారు. గరిమెళ్ళ ఎప్పుడూ ఆలోచనా నిమగ్నుడై ఉండేవాడనీ, ఆయనకి ఖద్దరంటే ప్రాణప్రాణ మనీ పేర్కొనవచ్చు. అక్షరాలా ఆయన గాంధీజీ శిష్యుడు !

---

జ్ఞాపికలు

1. 'మా కొద్దీ తెల్లదొరతనము' వ్యాసం, ఆంధ్రపత్రిక, 30-6-85.

2. ఆయన లేఖ (31-12-1985).

3. గరిమెళ్ళ సత్యనారాయణగారి జీవిత చరిత్ర, పుట 6.

4. నా వాఙ్మయ మిత్రులు, పుట 322.

5. గరిమెళ్ళ ఉపన్యాసాన్ని ఆంధ్ర సచిత్ర వార పత్రిక (1938, నవంబరు 2) ప్రచురించింది. గరిమెళ్ళ ఛాయా చిత్రాన్ని కూడా ప్రచురించింది. శనివారపు సుబ్బారావుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు.

6. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట 262.

7. పైదే, పుట 209.

8. ఆనందవాణి (8-6-1947), పుట 29.

## 5. శ్రీ శారదా గ్రంథమాల

గరిమెళ్ళ సత్యనారాయణది బహుముఖ ప్రతిభ. దేశభక్తుడూ రచయితా అయిన ఆయన శ్రీ శారదా గ్రంథమాలను స్థాపించాడు. ఆయన సంపాదకత్వాన ఆ గ్రంథమాల ఏడు పుస్తకాలు ప్రచురించింది. వాటి వివరాలు :

| | |
|---|---|
| భక్తి గీతములు | (రూ. 0-4-0) |
| బాల గీతములు | ( ,, 0-2-0) |
| మాణిక్యము | ( ,, 1-0-0) |
| నూతన జాతీయ గీతములు | ( ,, 0-8-0) |
| ఖండ కావ్యములు, 1 వ భాగము | ( ,, 0-8-0) |
| అఖండ కావ్యములు, 1 వ భాగము | ( ,, 0-8-0) |
| అర్థత్రయ సర్వస్వము, 1 వ భాగము | ( ,, 1-0-0) |

గ్రంథమాల లక్ష్యాలను తెలుసుకునేందుకు అర్థత్రయ సర్వస్వము పుస్తకం చివరి అట్టమీద ముద్రించబడిన వాక్యాలు బహుథా ఉపకరిస్తాయి. ప్రస్తుతం ఈ పుస్తకం అలభ్యం కనుక, వాటిని యథాతథంగా ఉదాహరిస్తున్నాను. (శ్రీ శారదాగ్రంథమాల అనే శీర్షికకు ఎడమవైపున దేవనాగరి లిపిలో ఓం అని ఉంది. ఆ ఓంకారం మధ్య రాధాకృష్ణుల బొమ్మ చిత్రితం బహుశః ఇది గ్రంథమాల చిహ్నం కావచ్చు.)

'ఈ గ్రంథమాలలో నెక్కువ భాగము సంపాదకునిచే వ్రాయబడిన గ్రంథములును, కొలది భాగము తత్తుల్యము లైన యుత్కృష్ట గ్రంథములును బ్రచురింపఁబడును. ఆంధ్ర జాతి యభివృద్ధి పొందవలె ననిన వీనిని బఠించి వీనిలోని జ్ఞానమును స్వీకరించి, వీని ననుసరించక తప్పదు. ఆంధ్ర సరస్వతికి నవ్యాభరణము లెవ్వి యనిన నివ్వియే యని పెక్కురు మహాశయు లభిప్రాయముల నిచ్చియున్నారు. అభినవాంధ్ర భారతి త్రొక్కవలసిన మార్గము లెల్లయు నిందు సూత్ర ప్రాయములుగాఁ గాక ప్రత్యక్షముగ గానగును. ఆంధ్రులు చవి చూడవలసిన నూతన సాహిత్య పాకము లెల్ల నిందమర్పఁ బడును. రసధారలు కాని పదముల ప్రోవులు కావు. సంవత్సరమున కారు రూపాయల గ్రంథములు ప్రచురింపబడును.'

ఆంధ్రజాతి అభివృద్ధి చెందా లనే సదుద్దేశంతో ఉత్కృష్ట గ్రంథాలు ప్రకటించాలన్నది సంపాదకుని ముఖ్యోద్దేశం. ఆ గ్రంథాలు ఆంధ్ర సరస్వతికి నవ్యాభరణాలై ప్రతిభాసించాలని ఆయన ఆశయం. 'అభినవాంధ్ర

భారతి త్రొక్కవలసిన మార్గము తెల్లయు నిందు సూత్రప్రాయములుగాఁ గాక ప్రత్యక్షముగ గాననగును.' అని సంపాదకుడు పేర్కొనడం గమనించదగిన అంశం. అలాగే నూతన సాహిత్యపాకము లనీ, రసధారలే కాని మాటల పోగులు కావనీ ఆయన తన లక్ష్యాన్ని విదితం చేశాడు.

గరిమెళ్ళవి ఉదాత్తాశయా లనడం నిస్సందేహం. పై పంక్తుల్ని అలవోకగా చదివినా ఆ విషయం తేటతెల్ల మవుతుంది.

ఆంధ్రజాతి అభివృద్ధి చెందా లంటే, తెలుగు సాహిత్యంలో నవ్యాభరణాలనదగిన రచనలు వెలువడాలని గరిమెళ్ళ ఆశించాడు. ఆ రచనలు వట్టి మాటల పోగులుగా ఉండరాదు; నూతన సాహిత్య పాకములలో రూపు దిద్దుకునే ఆ రచనలలో రసధారలు స్రవిస్తూ వుండాలి. కాగా జాత్యభ్యుదయానికి దోహదం చేసే నవ్య రచనలు రావాలని గరిమెళ్ళ ఆశించినట్టు చెప్పవచ్చు.

ప్రియాగ్రహారంలో స్థాపితమైన శ్రీ శారదా గ్రంథమాలను నిర్వహించడానికి ఆర్థిక స్తోమత అంతంతగా ఉండిన గరిమెళ్ళ యాతనలు పడ్డాడు. ఆయన మాటలు పరిశీలిస్తే యిది కళ్ళకి కట్టినట్టు స్పష్ట మవుతుంది. అర్థత్రయ సర్వస్వమునకు ఆయన వ్రాసిన మున్నుడిలోని (3-9-1926) ఈ మాటలు గరిమెళ్ళ మానసిక స్థితికి అద్దం పడుతున్నాయి. 'అయినను, అట్టి వృత్తి లోనికిఁ (వ్యవసాయము) బోవుటకు గూడ సర్కారువారి కృపా కటాక్షము వలన సగము వరకు ప్రారంభించిన యీ ధర్మోద్యమమును (గ్రంథ ప్రకటనోద్యమం) విసర్జించినచో, నాకు క్షమాపణ ముండదనే విశ్వాసముతోనే కష్టములకును, నవమానములకును దెప్పిపోటులకును గూడ వెనుక తగ్గక, అయిష్టులుగ నుండెడి శ్రీమంతుల అనంత సంపదలపై చిన్నదైనను ఈ తప్పని భావమును వైచుటకు సాహసించుచున్నాను .ఏది యెట్లయినను కార్యము కొనసాగించనిచే విరమించవలె నను నుద్దేశ్యము లేదనియు, అంతవరకు పుస్తకములకు వారు భావించు రీతిని నెక్కువ ఖరీదులు పెట్టుచున్నను పోషక రాజపోషక విరాళములు కోరుచున్నను, నేను పొందు కఠిన దూషణములకు బదులుగ నప్పుడప్పుడిట్టి మృదులము లగు సమాధానముల నిచ్చుచున్న (నన్ను) క్షమింప వలసిన ధర్మ మాంధ్రపూజ్యు లెల్లరిపై నున్న దని మనవి చేయుచు ..'

ఈ రోజులలో వలె, ఆ రోజులలోను సద్గ్రంథముల ప్రచురణ, విక్రయం మొదలైనవి 'కష్టసాధ్య' మైనవని గరిమెళ్ళ గ్రహించక

పోలేదు. అందువల్లనే శ్రీమంతుల ఔదార్యాన్ని ఆశించాడు. తన లక్ష్యసిద్ధికి వారి దెప్పిపొడుపుల్ని సహించక తప్పదనుకున్నాడు. ఆయన చేపట్టిన ఈ ఉద్యమాన్ని కొందరు 'సోమరి వృత్తి' అని పరిహసించి వుంటారు. 'యాచన' అని మరికొందరు ఎగతాళి చేసి వుంటారు. ఈ సందర్భంలో ఆయన మాటల్ని పరిశీలించడం సమంజసం. 'వ్యవసాయము చేసుకొనగూడదా? ఉద్యోగములు స్వీకరింపగూడదా? ఉదారుల ఉదారత నెన్నాళ్ళట్లు పీడించుచు ఈ సోమరి వృత్తికై గడంగెదవు. గాంధి మహాత్ముడు ఒడలు వంచి పని చేయుమన్నాడు గాని యిట్లు పుస్తకముల పేరట యాచించుకొను మన్నాడా?' ఆయనలో ఆత్మపరీక్ష కనిపిస్తుంది.

ఈ దెప్పిపోట్లు, అవమానాలు, కష్టాలు మొదలైనవి భరిస్తూ గరిమెళ్ళ గ్రంథమాలను ఎందుకు నిర్వహించాలనుకున్నాడు? అనే ప్రశ్న సహజంగా ఉత్పన్న మవుతుంది. సమాధానం కూడా ఆయనే తెలియజేశాడు. ఆంధ్రజాత్యభివృద్ధి, ఆంధ్ర సరస్వతికి నవ్యాభరణాలంకరణ— ఈ రెండూ ఆయన లక్ష్యాలు. అవి నెరవేరేందుకు చిత్తశుద్ధితో శ్రమించాడు. కొన్ని పుస్తకాలు ప్రచురించాడు; యథోచితంగా సాహిత్యసేవ చేశాడు.

పై విషయాదికాన్ని పరిశీలిస్తే, గరిమెళ్ళ తెలుగు భాషాభిమాని అనక తప్పదు. నిజమైన భాషాభిమాని కనుకనే కష్టనష్టాలను సహర్షంగా భరించగలిగాడు. 'నే నింకను భాషయందు గల అభిమానముచే దేవులాడుచు దానికి ద్రోహ మొనర్తునేమో యను పాతకమునకు వెఱచి తదేక దీక్షతో దానియందు కొట్టుకొనుచున్నాను గాని ఇంతకన్న ధన లాభప్రదములగు వ్యవసాయములను ఉద్యోగములను చేయనేరక కాదని విజ్ఞానులు గ్రహింపవలెను' అని ఆయన అన్న మాటలు సత్య సన్నిహితములనడం సమంజసం. గరిమెళ్ళ ఆంధ్ర భాషాభిమానం బహుధా ప్రశంసార్హం!

శ్రీ శారదా గ్రంథమాల నడవడానికి గరిమెళ్ళ భాషాభిమానంతో పాటు ప్రముఖుల ఔదార్యం కూడా కారణ మయింది. శాశ్వత రాజపోషకులు, రాజపోషకులు, పోషకులు, అభిమానులు గ్రంథమాలకు లభించారు. శ్రీయుతులు రావూరు శ్రీశైలపతి, కాశీనాథుని నాగేశ్వరరావుగారలు

శాశ్వత రాజపోషకులు. శ్రీయుతులు బిక్కిని వెంకటరత్నం, పురాణం సూరిశాస్త్రి, వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి ప్రభృతులు పోషకులు. అభిమానులలో శ్రీయుతులు మాజేటి నాగభూషణరావు, శెడింబి హనుమంతరావు పంతులు, నడింపల్లి నరసింహారావు, మద్ది సుదర్శనం అండుకో, గొర్తి గోదావరిశర్మ ప్రభృతులు ఉన్నారు. గరిమెళ్ళ తలపెట్టిన పవిత్ర కార్యానికి చేదోడు వాదోడుగా ఉండిన ఆ భాషాభిమానుల్ని సభక్తికంగా స్మరించడం సముచితం.

## 6. గరిమెళ్ళ గీతాలు

ఒక ఉద్యమం ఉద్ధృతంగా సాగే రోజులలో, అందులో పాల్గొనే నాయకులలోనూ కార్యకర్తలలోనూ పొంగులు వారే ఉత్సాహమూ ఉద్రేకమూ నెలకొని ఉండడం సహజం. ఉద్యమం తగ్గుముఖం పట్టడంతో, ఆ ఉత్సాహోద్రేకాలు పాలపొంగు కావడమూ సహజమే. అంతేకాక ఉద్యమకాలంలో వెలువడిన సాహిత్యం ప్రచారం కోల్పోయి కాంతివిహీనంగా కనిపిస్తుంది. కాని మన జాతీయోద్యమ చరిత్రను గాని ఆ నాళ్ళలో వెలుగు చూసిన సాహిత్యాన్నిగాని అలవోకగా పరిశీలించినా మనకు నూతనోత్సాహం కలుగుతుంది; ఆనాటి వాతావరణం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. ఆనాటి నాయకులలో కార్యకర్తలలో కనిపించే కార్యదీక్ష మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. ఆ త్యాగమూర్తుల ప్రధానలక్ష్యం స్వాతంత్ర్య సముపార్జన. ఆ లక్ష్య సాధనకోసం ఆ మహనీయులు తమ శక్తియుక్తుల్ని మీదు కట్టారు; తెలివి తేటల్ని ధారవోశారు. సుఖ సంతోషాలకు బదులుగా కష్ట నష్టాలనే వరించారు, సహర్షంగా. తరతరాలుగా పేరుకుపోయిన కుల మత భేదాలను విస్మరించారు. అఖండ భారతదేశాన్నే తమ దేశంగా భావించారు. ఏ మతానికి చెందినా, ఏ భాషకు చెందినా—అందరమూ భారతీయులమనే విశాల భావానికి బ్రహ్మరథం పట్టారు. అలాంటి త్యాగధనులూ విశాల హృదయులూ కనుకనే, వాళ్ళు నిర్వహించిన ఉద్యమం, సృష్టించిన సాహిత్యం నేటికీ సంభ్రమాశ్చర్యాలు గొలుపుతున్నాయి. లక్ష్యశుద్ధి సంతరించుకున్న విషయం ఏదైనా సరే, అది చిరస్మరణీయం కాక తప్పదు!

త్రికరణశుద్ధిగా గరిమెళ్ళ ప్రభృతులు గాంధీజీని తమ గురువుగా గుర్తించి గౌరవించారు. వాళ్ళ దృష్టిలో మహాత్ముడు పురుషోత్తముడు; దేవుడు. అటువంటప్పుడు ఆయన సిద్ధాంతాలు వాళ్ళకి వేదతుల్యాలు కావడంలో ఆశ్చర్యం ఏమి లేదు. కాగా గరిమెళ్ళ రచనలు గాంధీజీ సిద్ధాంతాలకు మణి దర్పణాలు !

గరిమెళ్ళ దృష్టిలో గాంధిజీ సంసారపయోధి దాటిన విశాల మనస్కుడు. ఆయన సిద్ధాంతాలను పాటించినప్పుడే భారతం సిరుల కొటారమవుతుందని గరిమెళ్ళ విశ్వాసం. ఆయన చెప్పిన యీ పద్యం పరికించండి :

'భారతభాగ్య చంద్రునకు
   భారెడు పోగు నొసంగు డంచు సం
సారపయోధి దాటిన వి
   శాల మనస్కుడు గాంధి చెప్ప, ఈ
చేరువ నెవ్వ రద్ది చెవి
   చేర్పెడు వారలు తోచకుండు, రీ
ధారుణి కెట్టులో సిరుల
   ధామము కాగల భాగ్యముబ్బుటల్.'

(ఖండ కావ్యము)

గాంధీజీ సిద్ధాంతాలలో అపార విశ్వాసం ఉన్నవాడు కనుకనే, సంఘంలో గూడుకట్టుకుని వున్న అంటరానితనాన్ని గరిమెళ్ళ గర్హించాడు. నిమ్న జాతు లనబడే వారికి సంఘంలో గౌరవమైన స్థానం కలదనే విషయాన్ని గరిమెళ్ళ వివరించిన తీరు హృద్యం.

'హిందూ సంఘమురా మనది—యెవ్వారు కాదనురా
సందేహించినవాడే వేరొక—సంఘంబై చెడురా॥
రామ చరిత మనదీ—దాని రచయిత మనవాడు
భారతమ్ము మనది—ధర్మవ్యాధుడు మనవాడు
వల్లి మనపిల్ల మనకు అల్లుడు మురుగయ్యా...'

ఈ పాదాలను స్థూలంగా పరిశీలించినా, గరిమెళ్ళ హృదయం వ్యక్త మవుతుంది. రామాయణ భారతాల వంటి రమణీయ రచనలు మనవే. రామాయణ కర్త బోయవాడని ప్రతీతి. భారతం సృష్టించిన వ్యాసుడు మత్స్యకన్యకకు ప్రభవించినవాడు. ధర్మవ్యాధుని వృత్తి మాంసవిక్రయం. వల్లి కొరవ జాతి కన్య. ఆమె చివరికి మురుగదేవుని (సుబ్రహ్మణ్యుని) దేవేరి అయింది. ఈ వివిధ విషయాలను పరిశీలిస్తే, హిందూ సంఘంలో వివిధ వర్గాల వారికీ గౌరవస్థానం కలదనే సత్యం విశద మవుతుంది. ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ అనే భేద బుద్ధితో సంచరించడం అసమంజసం. ఈ ఉద్దేశం మనస్సులో ఉంచుకునే కాబోలు నిమ్న జాతులని భావించబడుతున్న జాతులలో పెరిగిన వారిని గరిమెళ్ళ యీ గేయంలో ప్రత్యేకంగా పేర్కొని, వా రందరూ హిందువులే అన్నాడు. వారు హిందువులు కారని సందేహించినవాడే అన్య జాతీయు డని పేర్కొనడం గమనించదగిన అంశం.

హరిజనుల్ని ఉద్దేశించి గరిమెళ్ళ పెక్కు గీతాలలో తన ఆవేదనను వ్యక్తం చేశాడు. పంచమ జాతిని మన పక్షం చేర్చుకుందా మని చెప్పిన గరిమెళ్ళ 'హరిజనుల పాటలు'లో ప్రబోధాత్మకంగా ఇలా తెలియజేశాడు:

*''హరిజనులము మనము—దుఃఖము లనుభవించ మికను*
*సరిసముగ తక్కిన జాతులతో—సంస్తుతి నందుదము*
*స్నానము లాడుదము దేహము—స్వచ్ఛము చేయుదము*
*భయమును మానుదము, దేశ—భక్తిని పూనుదము.''*

హరిజనుల్ని దృష్టిలో ఉంచుకుని గరిమెళ్ళ యీ పాట వ్రాయడం గమనించదగిన విషయం. హరిజనులము మనము-అన్నాడు. తక్కిన జాతుల వారితో సరిసమంగా మనమూ మన్ననలు పొందుదామనీ, పరిశుభ్రత నలవరుచుకునీ భయమును మానీ దేశభక్తి వహించీ జీవయాత్ర చేద్దామని ధైర్యం చెప్పాడు. భయపిశాచాన్ని పారదోలాలని ఆయన ఉద్బోధించాడు. అనగా ఆత్మ న్యూనతాభావాన్ని త్యజించాలని ప్రబోధించాడు. దేశభక్తిని పూనుమని కర్తవ్యబోధ కావించాడు.

బ్రాహ్మణా బ్రాహ్మణ, పంచమ బ్రాహ్మణ—మొదలైన భేద

భావాల్ని మంట గలపండి అనీ, అంటుదోషాన్ని పాప మంటూ చాటాలనీ ప్రబోధించిన గరిమెళ్ళ 'మాకొద్దీ తెల్లదొరతనం' గేయరాజంలో ఇలా అన్నాడు:

*''స్నానధ్యానము చేసి రామకృష్ణ యంచు దేవుడి*
*గుడిలోకి రండీ*
*అభిషేక మతనికి చేయండి*
*నిర్మలత్వ మాత్మను పొందండి*
*ధర్మ మార్గమును తగిలి, మాలలు రండి.''*

ఆత్మ నైర్మల్యం, ధర్మమార్గానుసరణం—ఈ రెండూ ఒక్క హరిజనులకే కాదు, అన్ని వర్గాల వారికీ తప్పనిసరిగా కావలసినవి.

తన గీతాలలో గరిమెళ్ళ వివరించిన మరో అంశం మత సామరస్యం. ఈ నాటికీ మన దేశంలో ఇతర సమస్యలతోపాటు ఇదీ ఒక తీవ్ర సమస్యగా పరిణమించింది. మత సామరస్యం నెలకొన్నప్పుడే విభిన్న మతాల కొలువుకూట మైన మన దేశంలో శాంతి సౌఖ్యాలు సుస్థిరంగా ఉంటాయి. మానవుని ఆత్మోన్నతికే గాని మానవైక్యతను రూపుమాపడానికి కాదు మతం—అన్నది గరిమెళ్ళ దృఢ విశ్వాసం. మతసామరస్యాన్ని వాంఛించిన గరిమెళ్ళ ''ఇస్లాము కీర్తిని ఇగురెత్తజేదాము'' అంటాడు, రాజ్య మేలుదాము రారా అనే గీతంలో.

గరిమెళ్ళ గీతాలలో ప్రస్ఫుటంగా కనిపించే మరొక ముఖ్యాంశం మనలో తిష్ఠ వేసుకున్న ఐకమత్యరాహిత్యం. ఈ విషయం తలుచుకుని ఆయన బాధపడ్డాడు.

*'........................మా*
*రోతలు పోరులుం దెగని*
*దుర్మతలం బడి కుళ్ళి కుళ్ళి ఆ*
*పాతకమే గదమ్మ పలు*
*భంగుల మమ్ముల నీడ్చి కొట్టెడిన్.'*

అనైక్యాన్ని పాతకంగా పేర్కొన్నాడు గరిమెళ్ళ. ఆ పాతకమే

మన దుస్థితికి కారణ మని ఆయన అభిప్రాయం. 'మేము ఐకమత్యము తోడ అలరారుతామయ్యా' అని భగవత్సాక్షిగా చెపుతాడు. ఐకమత్యం ఎంత అవసరమో ఈ పాదం స్పష్టం చేస్తున్నది.

ఆనాటి జాతీయోద్యమం మరుగున పడిపోయినా, ఆ రోజులలో గరిమెళ్ళ వివరించిన ఈ గాంధీజీ భావాలు, సిద్ధాంతాలూ మొదలైనవి నేటికీ శిరోధార్యాలుగా కనిపిస్తున్నాయి. మనలో ఐకమత్యం ఇంకా సుప్రతిష్ఠితం కాలేదు. కుల మత భేదాలు పూర్తిగా సమసిపోలేదు. మత సామరస్యం నెలకొనలేదు. కాగా గరిమెళ్ళ గీతాలు నేటికీ మనకు హెచ్చరికలుగా తోడ్పడుతున్నవని చెప్పవచ్చు.

ఈ వివిధ భావాలే కాక గరిమెళ్ళ గీతాలకు జీవం పోసింది ఆయన సజీవమైన తెలుగు నుడికారం. స్థూలంగా పరికించినా, ఆయన గీతాలలో కండ చక్కెరలాంటి కమ కమ్మని నుడులూ నానుడులూ, చవిగల పద బంధాలూ ఎన్నో కనిపిస్తాయి. జీవద్భాష మీద ఆయనకి గల అధికారం నిరుపమానం. సామాన్యులు తరుచుగా వాడే మాటలు ఆయనకి బాగా తెలుసు. అందుకనే గరిమెళ్ళ గీతాలు చదువుతుంటే సామాన్యులు తమ కష్టసుఖాలు తెలియజేస్తున్న అనుభూతి కలుగుతుంది. ఇక వాటిని పాడే రీతిలో పాడితే ! చెప్పనవసరం లేదు.' అది మాటలకు అందని మధురానుభూతి !

ఈ కింది పదబంధాలు, నుడులు మొదలైనవి పరికించండి :

అగ్గిగుళ్ళు, అచ్చియున్న ఋణం, అవురావురు మని, ఆడి తప్పిపోవడం, ఇల్లు గుల్ల జేయు, ఉన్నదల్లా ఊడదన్నుట, ఊళ్లమెల్లా సన్నికల్లయి పోవు, ఏమి నేరము చేసి కన్నుగానక తిరిగినామొ, ఏడాది కేడాది, కయ్యాలాడక, కత్తిబలం, కత్తి భయం, కట్టు గుడ్డలు, కంట గుడ్డను బెట్టి, దుమ్మెయు, కుంటి వాదనలు గూటిలో పెట్టు, కొంప ముంచడం, గజి బిజి కళ్ళోళ్ళలాడు, గడ బిడ, గుండు బలం, కయ్యానికి కాలు ద్రవ్వడం, చిచ్చు పెట్టు, చెలగి చెండుదారి, చచ్చు రాజ్యం, చెన్ను తరుగు, డబ్బు కాలువ, తాతగారి దేశమట్లు, తాతగారి ముల్లెదాచి పెట్టినయట్లు, ద్రవ్యంపు పేరు, ధాటీ చేయు, ద్రవ్యదాహం, దయ్యమై మ్రింగు, నోరేమి నాకు నాడదు, నోట మట్టి కొట్టు, నూటనలుబదినాల్గు నోటికి తగిలించు, నిప్పచ్చరముల

నిలయం, నోళ్ళలో గుడ్డ కుక్కి, నూటి కొకడు, పాలకడలి వంటి రాజ్యం, పశుశక్తి, పశుబలం, పిల్లజెల్ల, పచ్చని రాజ్యం బద్దలగునట్లు, పట్టెడన్నం, పొట్ట పగిలిపోవు, బలే నిక్కుటం, బ్రహ్మమూట, బుద్ధి మంటగలుపు, భారత భావిభాగ్య శేఖరుడు, భేదాలు కాల్చు, ముక్కు నోట లేదు, ముల్లెమూటలు, మనిషి రక్తం త్రాగకు, రక్తపాతములు, రాక్షస మతము, వన్నెవాడు, శషభిషలు, సైతాను ప్రభుత.

మనిషి పెరుగుదలకు మాంసకృత్తులు ఎలా అత్యవసర మవుతున్నాయో, అలాగే రుచికరములైన నుడులూ నానుడులూ మొదలైనవి గీతానికి అందచందాలు సమకూరుస్తాయి. పైగా వ్యవహారంలో ఉన్న మాటలు వాడినప్పుడే, ఆ గీతం సామాన్యులకు సైతం చక్కగా అర్థ మవుతుంది. కనుకనే గరిమెళ్ల గీతాలు జనసామాన్యాన్ని బహుధా ఆకర్షించాయి. అసలు గేయం ఎత్తుగడే ఎంతో హృదయాకర్షకంగా ఉండి శ్రోతను అనాయాసంగా ఆకట్టుకుంటుంది. 'కంట గుడ్డను బెట్టి కర్ణాన వేలెట్టి వింటావటరా, ఓరయ్యో' అని ఆరంభమవుతుంది పాంచాలము అనే గీతం. ఆ గీతంలోని విషయం ఎంత కరుణరస ప్రధానమో ఈ ఎత్తుగడ స్పష్టం చేస్తుంది. అలాగే మాకొద్దీ తెల్ల దొరతనము దేవ – అనే పాదం వినగానే తెల్ల దొరతనం వల్ల ఎన్ని అనర్థాలు కలిగాయో, ఆ విషయం శ్రోతకు వెను వెంటనే స్ఫురణకు వస్తుంది. గరిమెళ్ళ చెప్పదలచుకొన్న విషయానికి ఆ ఒక్క పాదమే అద్దం పట్టేలా ఉంది. 'కొయ్యోడ! కొయ్యోడ! యిలాగా రారా! కోటి వింతలు సెపుతానోరయ్యో'. 'రారా! పోదాము రాజ్యమేలుదాము', 'వినుడీ వినుడీ ఓ జనులారా! విని-ధన్యత నొందుడి'–అనే తొలి పాదాలు వింటేనే ఆయా గీతాలలోని ముఖ్య విషయాలు అవగతము లవుతాయి. సైతాను ప్రభుత గీతానికి 'దండాలండోయ్ మే ముండలేమండోయ్ బాబు' అనే ఎత్తుగడ జీవశక్తిని ప్రసాదించింది.

గీత రచన చెయ్యడంలో గరిమెళ్ళ సిద్ధహస్తుడు. సామాన్యుల భాషను జీర్ణించుకున్నవాడు. సామాన్యులకు నచ్చే బాణీలు ఏమిటో ఆయనకి బాగా తెలుసు. అందువల్లనే, గరిమెళ్ళ గీతాలు ఆబాలగోపాలాన్ని ఆకర్షించాయి. అలనాటి స్వాతంత్ర్య సమరయోధుల కవి అమృతోపమానాలు. వాటిని సహర్షంగా తృప్తిగా ఆలపించారు. ఇంతకూ ఆయన జాతీయ కవి సార్వభౌముడు!

గరిమెళ్ళ కొన్ని భక్తి గీతాలు కూడా వెలయించాడు. వాటిలో ఎన్ని మరుగున పడిపోయాయో చెప్పలేము. ఈ రెండు గీతాలు లభించాయి. అచ్చు మొగం చూడలేదు. ఇవి ప్రభావతిగారు చెప్పినవి.

(తారక మంత్రం వరసలో)

ప : *ఏ అపచారము ఎపు డొనరించితో ఎరుగ నైతి తల్లీ!*
*నా యెడ ఇటు కృప తప్పినావు కదా నయమె కల్పవల్లీ!*

చ : *ప్రహ్లాదాదుల కాచి బ్రోచినా పడతి నీవె కావా*
*ఆహ్లాదార్ద్ర మహనోర దృష్టుల, అమ్మ ఒసగలేవా? ॥*
*పంచేంద్రియములు నా మనంబుపై పగను బూనె వినవే*
*మించుబోణిరో వాని గర్వమును చించు టెటుల*
*చెప్పవే! ॥*

*పాపాత్ముడ నని పరిభవించుటే భవ్యశక్తి కరుదా*
*ప్రాపు నొసంగుచు ఉద్ధరించుట భవ్యశక్తి కరుదా! ॥*
*శ్రీమత్సింహాసనేశ్వరి నా చేయు మనవి వినుమా*
*రామా అన్యుడగాను సత్యానారాయణుండ గనుమా ॥*

ప : *శ్రీ గణేశ నిన్ను నమ్మితిరా సకలాగమ సన్నుత ॥*

చ : *భోగ రాగము లెల్ల మాని*
*విరాగినై నీ పాదయుగ్మ పదాంబుజంబులె మదిని*
*నమ్మితి ॥*

*సర్వ శుభములు ఈ జగంబున చక్కగా నెరవేరగా*
*గర్వ ముడిగి అఖండ జనసంఘంబు లెల్లయు గూడగా ॥*

మొదటి గీతం కంటె రెండో గీతంలో గరిమెళ్ళ వ్యక్తిత్వం బాగా కనిపిస్తున్నది. సర్వ శుభములు కలగాలని ఆశించాడు. అయితే యిందుకు రెండు ముఖ్యమైన నిబంధనలు విధించాడు. ఒకటి గర్వం నశించాలి. అభిజాత్య సంపన్నుల మనే గర్వం తొలగాలి. అలాగే శ్రీమంతుల మనే గర్వమూ తొలగాలి. ఈ గర్వద్వయమూ నశించాలని ఆయన అభిలషించి

వుండవచ్చు. రెండు: అందరూ—ఏకం కావాలి. ఈ రెండూ సిద్ధించి నప్పుడు జగతిలో సర్వశుభములూ కలగగలవని ఆయన అభిప్రాయం.

ఒక సామాజిక విషయాన్ని గరిమెళ్ళ గణేశ స్తుతిలో చొప్పించి నట్లుగా, మరో ప్రముఖ జాతీయ కవి సుబ్రహ్మణ్య భారతి ఒక రాజకీయ భావాన్ని తాను కావించిన కృష్ణ స్తుతిలో ఇలా పొందుపరిచాడు.

*ఎన్డ్రు తణియుం ఇంద సుదందిర దాగం*
*ఎన్డ్రు మడియుం ఎంగళ్ అడిమైయిల్ మోగం?*

*[ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం*
*ఎప్పుడు మడియు మా అడియరి మోహం*
*ఎప్పుడు మా తల్లి సంకెల లూడిపోవు*
*ఎప్పుడు మా యిక్కట్టు లన్ని తీరిపోవు? ]*

ఆ నాళ్ళలో గరిమెళ్ళ గీతాలకు ప్రచుర ప్రచారం ఉండేదని అభిజ్ఞులు పేర్కొంటారు. ఈ సందర్భంగా స్వాతంత్ర్య సమరయోధులు, బహు గ్రంథ కర్తలు అయిన మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు తమ కృష్ణాజిల్లా చరిత్రలో* ఇలా వ్యక్తం చేశారు. "అనేకమంది ప్రదర్శకులు తుపాకి గుండ్లకు ఆహుతులైరి. ఈ సందర్భములో ఆంధ్రలో పేర్కొన వలసినది శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారిచే రచింపబడిన పాట – ఏమయ్యో, యువరాజా! ఎందుకొచ్చావయ్యా అనునది. ఆనాడు ఈ పాట ఆంధ్రదేశ మంతటా ఆబాలగోపాలము ప్రసిద్ధమయ్యెను."

---

జ్ఞాపిక

*ఇది వ్రాత ప్రతి. ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయంలో ఇది భద్రపరుపబడి వున్నది. సంపుటం 1 పుట 97.

మన దేశంలో ద్వంద్వ ప్రభుత్వానికి ప్రారంభోత్సవం చెయ్యడానికి గాను బ్రిటిష్ ప్రభుత్వం బ్రిటిష్ రాజకుటుంబ సభ్యులైన యువరాజు కనాటు ప్రభువుని (Duke of Connaught) మన దేశానికి పంపింది. ఆయన రాకకు అసమ్మతి సూచకంగా దేశమంతటా పెద్ద ఎత్తున ప్రదర్శనలు జరిగాయి. ప్రదర్శకులను చెదరగొట్టడానికి ప్రభుత్వంవారు తుపాకి కాల్పులు జరిపారు; లాఠీ ప్రయోగం చేశారు.

# 7. మా కొద్దీ తెల్ల దొరతనము

అస్వతంత్ర భారతపు అధ్వాన్న పరిస్థితి, మహాత్ముని సిద్ధాంతాల ప్రాశస్త్యం మొదలైనవాటికి 'మాగ్నాకార్టా' వంటిది మా కొద్దీ తెల్లదొరతనం. చరిత్ర ప్రసిద్ధమైన ఆ గేయరాజం ఆనాటి జాతీయోద్యమ వీరులకు గాయత్రీ మంత్రం. ఆ ప్రబోధ గీతం ఆలపిస్తే చాలు ఆనాటి ప్రభుత్వం జైలు శిక్ష విధించేది. తెల్ల దొరల్ని పరాయి ప్రభుత్వాన్ని గడగడ లాడించిన ఆ పాటను గరిమెళ్ళ తన కంచు కంఠంతో పాడుతుంటే ప్రజలు ఉద్రేకంతో ఊగిపొయ్యేవారట! అప్పటి ఒక ఉదంతాన్ని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు క్రొవ్విడి లింగరాజుగారు చెప్పగా, దాన్ని ఇలా గ్రంథస్థం చేశారు మద్దూరి సుబ్బారెడ్డిగారు! 1

"1921 లో రాజమహేంద్రవరం కలెక్టరు G.T H Braken అనే ఆయన ఉన్నారు. ఈ అధికారి ఒక విధంగా భారతీయుల యెడ సానుభూతి కల్గినవాడే. గరిమెళ్ళవారి గేయాలవల్ల ప్రజలు ఉద్రేకపూరితులై ఉద్యమం బలపడుతుందని పోలీసు అధికారులు కలెక్టరుగారికి నివేదించారు. ఆ సమయంలో బ్రేకన్ దొర గరిమెళ్ళ వారిని పిలిపించి తన ఎదుట ఆ పాటలు పాడమన్నారు. సత్యనారాయణగారు తన కంచు కంఠంతో ఆ ప్రాంగణం మారుమ్రోగేటట్లు 'మా కొద్దీ తెల్లదొరతనము' అనే పాట పాడారు. అంతా విని బ్రేకన్ 'భాషరాని నాకే గగుర్పాటు కలిగింది. ఇక దేశీయుల్లో ఎంత ఉత్తేజం కలిగిస్తుందో అర్థమైంది' అని వెంటనే 124 ఏ సెడిషన్ చట్టం క్రింద అరెస్టు చేయించి చెఱసాలకు పంపించారట."

పాట పాడినప్పుడు భాష తెలియనివాడే గగుర్పాటు చెందగా, ఆనాటి తెలుగు దేశ భక్తులు ఎంతగా ఉత్తేజితు లయ్యేవారో మనం ఊహించుకోవచ్చు.

సహాయ నిరాకరణోద్యమం సందర్భంగా వెలుగులోకి వచ్చిన ఈ

గేయానికి 'మాకొద్దీ తెల్లదొరతనము' అనే పల్లవి చెప్పలేనంత నిండుదనం ఇచ్చింది. వచ్చిన వారు పల్లు ఇడు—అన్న మాటలలోని భావగాంభీర్యమే మాకొద్దీ తెల్లదొరతనంలోనూ ఉంది. తెల్లదొరతనం మాకొద్దు అన్నట్లయితే చప్ప చప్పగా ఉంటుంది. పైగా ఈ పల్లవి ద్వారా కవి హృదయం చక్కగా ఆవిష్కరించబడింది. ఏ ఉద్యమాన్ని పురస్కరించుకుని యీ గేయం సంతరించబడిందో, ఆ ఉద్యమ లక్ష్యాన్ని కూడా పల్లవి తేట తెల్లం చేసింది. అందుకే 'మాకొద్దీ తెల్లదొరతనా'నికి ఏదో మంత్రశక్తి అబ్బినట్లయింది. ఇది 162 చరణాల దీర్ఘ గేయం. ఇందులో ప్రస్తావించ బడని విషయమంటూ లేదు.

గరిమెళ్ళ ప్రస్తావించిన తొలి విషయం దేశంలో ఆహార సమస్య. వివిధ రాష్ట్రాలు బాగా పండుతున్నా, సామాన్యుడికి పట్టెడు మెతుకులు మాత్రం కరువయ్యాయి. ఉప్పు ముట్టుకుంటే దోషం. కుక్కలతో పోరాడి కూడు తినవలసి వస్తోంది. తిండి కోసం పోరాటం! కనుకనే ఆ విషయం మొదట పేర్కొన్నాడు. అసామాన్యుల విషయం ఏమో కాని, సామాన్యు డికి ప్రప్రథమంగా కావలసింది తిండి తీర్థాలే!

తర్వాత, వర్తకాని కంటూ వచ్చిన తెల్లవారు మొదట పట్టణాలు స్వాధీనం చేసుకుని ఆ పిదప తమ రాజ్యమునే స్థాపించుకున్న అంశం ప్రస్తావించబడింది. అంతటితో పాశ్చాత్య పాలకులు ఊరుకోలేదు. దేశీ యుల్లో స్నేహభావాన్ని చంపివేయడానికి ప్రయత్నించారు. కోర్టు లంటూ పెట్టి పార్టీలు పుట్టించారు. ద్రవ్యదాహంతోపాటు దురూహలు కూడా కల్పిం చారు. 'మూదు నెయ్యము చెడగొట్టు వాడు' అన్నాడు గరిమెళ్ళ. ఇది చాలా ముఖ్యమైన విషయం.

ఏమిటీ యీ అన్యాయం? అని నోరు తెరిచి అడగడానికి అవకాశం లేదు. నూటనలభైనాలుగు సెక్షను నోటికి తగిలించి మాట్లాడడమే శిక్షగా చేశారు. జాతీయ గీతాలాపన చెయ్యకూడదు. పాలకుల్ని విమర్శించ కూడదు. ఘోర శాసనాలు చేసి ప్రజల శక్తిని పీల్చివేయడం జరిగింది. ధనార్జనకోసం, పాలకులు కల్లు సారాయి దుకాణాలు తెరిచారు. సామా న్యుల పండంటి సంసారాలను కూల్చారు. చివరికి సతీమణుల పుస్తెలు కూడా నైవేద్య మయినాయి!

ఇక రైతుల అగచాట్లూ! చెప్పతరం కాదు. ఆ యేటికా యేడు శిస్తులు ఎక్కువ చేశారు. కట్టలేకపోతే కడుపుమంటతో చావ మన్నారు. బానిస బ్రతుకులు చేశారు. పంటలు పోయినా, పన్నుల బాధ మాత్రం తప్పదు. అవి వసూలు చేసేందుకు అధికారుల్ని యిళ్ళకు పంపుతారు. వాళ్ళు వసూలు చెయ్యలేకపోతే, వాళ్ళ ఉద్యోగాలకు సున్న చుట్టడం జరిగేది. ఇలా 'ఇంటిలోపల ఇడుమలు' పెట్టారు.

జాతీయ భావాలు కలవారిని ఆనాటి పాలకులు ఎలా హింసించారో తెలుసుకోవడం అవసరం. జాతీయ పతాకాలను పీకి వేసేవారు. మీ దేశం ఎలా అయిపోతేనేం మాకేమయ్యా అనేవారు. బండతనం చూపేవారు. జాతీయవాదుల్ని భయపెట్టడం కోసం సైన్యాన్ని వీధుల్లో తిప్పేవారు. తమ పతాకమైన జాక్ జెండాకి నమస్కరించమనే వారు. గాంధీ టోపీ ధరించి పాఠశాలలకు వెళ్ళకూడదు. రాజద్రోహ మంతా రాట్నంలో ఉందనే మిషతో దాన్ని బడులలో పెట్టవద్దనే వారు. ఇక చిత్తరంజన దాసుని హింసించిన తీరు:

*'చిత్తరంజనదాసు-చిన్నారి కొమరుని-*
*చెయి విరచి చెరబెట్టినాడు*
*అతని పెత్తసంబును బట్టినాడు*
*వారి ముత్తైదువుల పట్టినాడు*
*వాడి సొత్తుకు నిలమీద చోటు లేదన్నాడు.'*

వీరుల పోరుల్ని చూసి అయినా తెల్లవారు సిగ్గు చెందలేదట! వీరాలు మానరట! మన శక్తిసామర్థ్యాలను గ్రహించరు. పౌరుల జాతీయాభిమానాన్ని గరిమెళ్ళ ప్రశంసించాడు. అలాగే గాంధీజీ నాయకత్వానికి జోహారులు సమర్పించాడు. భారతదేశమాత గాంధీతో కలిసి తపస్సు చెయ్యగా, ధర్మదేవత ప్రత్యక్షమై కోరిన వరాలు ప్రసాదిస్తా నన్నది. తత్ఫలితంగా తెల్లదొరలకు గుండె దడ పుట్టుకు వచ్చింది.

మత విషయంలోనూ తెల్లవారు జోక్యం చేసుకున్నారని గరిమెళ్ళ బాధ పడ్డాడు. ఆవుమాంసం తెల్లవారికి ఇష్టం కనుక, పాడి పశువుల్ని కోస్తారంటూ 'మా మూడియావుల మంద సురిగి యింటికి రాదు' అని తన

ఆవేదనను తెలియజేశాడు. 'ఇతరుల నాగరికత, మన నాగరికత మన మతము, మన మతములోనున్న మేలిమి సర్వము దీనిలో (ఈ పాదంలో) మహాధ్వనిగా నున్నది' అని గరీయః ప్రతిభులు విశ్వనాథ సత్యనారాయణ గారు పేర్కొన్నారు. 2 మరి, మన దృష్టిలో ఆవు చతుష్పాద జంతువైన వట్టి ఆవు కాదు; గోమాత. గోమాతను పవిత్ర దృష్టితో చూడడం మన సంప్రదాయం.

తెల్లవాడు మన దేశంలో వాడి తాతగారి ముల్లె దాచిపెట్టినట్లు ధాటీ చేస్తాడట! పైగా మోమోటము రవ్వంతైనా లేదట. వాడి పాటు పాడై పోను, వాడి శాసనాలు మాడిపోను—అంటాడు గరిమెళ్ళ. ఈ మాటల్లో తెల్లదొరల చేతలలోని కుటిలత్వం, శాసనాలలోని క్రూరత్వం మొదలైనవి ధ్వనిస్తున్నాయి. మామూలు మాటలకు మహాశక్తి ప్రసాదించాడు గరిమెళ్ళ.

కాగా తెల్లదొరల సేవ చేస్తూ కాలం గడపడం నల్లని మచ్చగా భావించండి—అని తన దేశీయులకు హితబోధ చేశాడు. భూమి తల్లి యేడ్పులు విన వస్తున్నాయి. దైవం చూసి మెచ్చుకోదు—అని కూడా అన్నాడు. కాదు, శపించాడు. తెల్లదొరల శాసనాలు క్రూరంగా ఉన్నా, దేశీయులు కొందరు తెల్లవారి సేవలో నిమగ్నులై ఉన్నా,

*'ధర్మదేవుడె మా రక్షసుండి*
*ప్రజల ప్రేమయె మాకు దిక్కుండి.'*

అన్న గరిమెళ్ళ మాటలు విస్మరించరానివి. ఇవి సార్వకాలిక సూక్తులు.

ఏ ఉద్యమమైనా ఏ దేశమైనా ముందుకు సాగాలంటే, ప్రజాభిమానం అందుకు అత్యవసరం. అది లేకుంటే కడమవి ఎన్ని ఉండీ చిల్లిగవ్వంత కూడా లాభం లేదు. ప్రజాభిమానం, ధర్మం ఉన్నచోట విజయం తథ్యం. ఆ ధర్మదేవుణ్ణి గరిమెళ్ళ స్తుతించిన వైనం పరమ రమణీయం. మా ధర్మాన్ని మేము మరువము, ఐకమత్యంతో మేము మసులుకుంటాము అంటాడు గరిమెళ్ళ. స్వాతంత్ర్య సముపార్జనం తమ విధ్యుక్త ధర్మంగా భావించారు ఆనాటి జాతీయవాదులు. ఐకమత్యంతో మేము మసులుకుంటా

మని చెప్పడం ఒక విధంగా కర్తవ్య బోధ చెయ్యడమే. అందరూ ఐక మత్యంతో ఉండి పోరాడితేనే గాని, స్వాతంత్ర్యం కలగదనే విషయాన్ని గరిమెళ్ళ చక్కగా సూచించాడు. స్వాతంత్ర్య యోధుల ధైర్య స్థైర్యాలను కూడా కవి సూచించాడు. 'గుండు పట్టుకు మమ్ము కూల్చవచ్చిన గాని కూర్చున్న చోటుల విడము.' అది వారి భీషణ ప్రతిజ్ఞ. పాటలు పాడుతూ రాట్నాలు తిప్పుతారట. ఆ మహావీరులు శాంతిని మాత్రం తప్పరు. అనగా తెల్లవారు అహింసకు దిగినా, శాంతికాముకులైన స్వాతంత్ర్యయోధులు అశాంతికి దిగరని యిందులో చెప్పబడింది. రాట్నలక్ష్మి నవ్వుమొగంతో పాడుతోందనీ, దానిగుండా స్వేచ్ఛ తిరుగుతున్నదనీ, దాని ప్రభావాన కరవు మాడిపోతున్నదనీ గరిమెళ్ళ రాట్నపు శక్తిని గొప్పగా చెప్పాడు.

అవసరం వచ్చినప్పుడెల్ల గరిమెళ్ళ కర్తవ్యబోధ చేశాడు, ఈ పాటలో. పాలకుల దౌష్ట్యాన్ని తెలుపుతూనే, మనలో గూడు కట్టుకున్న లోపాలను కూడా ఎత్తి చూపడానికి ఆయన వెనుకాడలేదు. ఐకమత్యంతో మసులుకుంటామునకు టీకగా కాబోలు, గరిమెళ్ళ ఇలా అన్నాడు:

*'బ్రాహ్మణా బ్రాహ్మణ-పంచమ బ్రాహ్మణ -*
*భేదపు తెగలు మీకేల*
*మీ భేదాలు వడి కాల్పరేల*
*చెడ్డ బోధలకు లొంగిరేల*
*యీ మాధుకరపువృత్తి మరగినా రది యేల-'*

ఎందుకు మనలో మన కిన్ని భేదాలు—బ్రాహ్మణ అబ్రాహ్మణ, పంచమ బ్రాహ్మణ—అని. ఈ భేదభావాలను కాల్చివేయండి. మాధుకరపు వృత్తికి ఎందుకు మరగినారు? అని సూటిగా ప్రశ్నించాడు. హిందూదేశ వాసు లందరూ సహోదరులే అన్నాడు. అంటుదోషం పాప మంటూ చాటుదా మన్నాడు. హరిజనుల ఆలయ ప్రవేశాన్ని ఆయన సమర్థించాడు. స్నాన ధ్యానాలు చేసి, రామ కృష్ణ అంటూ గుడిలోకి రండి, దేవుడికి అభిషేకాలు చెయ్యండి, ధర్మమార్గాన పయనిస్తూ ఆత్మ నైర్మల్యం పొందండి—అని ప్రబోధించాడు. ఎవరు గుడికి వెళ్ళినా పొందవలసింది ఆత్మ నైర్మల్యం. ఇదే ప్రధానం. అభిషేకాదులు అప్రధానాలు.

మనలో మనకు ఐకమత్యం లేకపోవడం, మనం కులభేదాలను పాటించడం మొదలైనవి ప్రస్తుత పరిస్థితికి—పారతంత్ర్యానికి—కారణాలుగా పేర్కొన్న గరిమెళ్ళ కర్మ సిద్ధాంతంలో విశ్వాస మున్న భారతీయుడిలా అంటాడు గదా:

'ఎన్ని జన్మములందు-ఏమి నేరముచేసి -
కన్ను గానక తిరిగినామొ
ప్రజల అన్నమెల్లను క్రుమ్మినామొ
దైత్యులకన్న చెడ్డగ మెలగినామొ
నేడు దున్నలవలె నిట్లు దొరికితిమి దొరలకు.'

కర్మ సిద్ధాంతంలో నమ్మక మున్నా లేకున్నా, మహాపాపం చేసుకున్న వాళ్ళకే పారతంత్ర్యం అనే ధ్వని యిందులో ఉన్నట్లు పేర్కొనవచ్చు. కన్ను మిన్ను కానక తిరగడం, నేరాలు చెయ్యడం, ప్రజల అన్నాన్ని హరించడం, రాక్షసుల కన్న మరీ క్రూరంగా ప్రవర్తించడం—మొదలైనవి పారతంత్ర్య హేతువులుగా భావించవచ్చు.

పారతంత్ర్యంలోంచి బయట పడితే, స్వచ్ఛమైన తేజస్సుతో ప్రతిభాసించే స్వేచ్ఛావధూమణిని సందర్శించవచ్చు. ఆమె చేతిలో పూలగుచ్ఛా లున్నాయి. ఆమె ఎన్నో ముచ్చటలు తెలుపుతుంది. అయితే ఆమె దర్శనభాగ్యం అస్వతంత్ర భారతంలో కాదు; కారాగృహంలో. కనక చచ్చు రాజ్యమైన అస్వతంత్ర దేశం విడిచిపెట్టి సరాసరి జైలుకి రండి—అని స్వాతంత్ర్య యోధుల్ని గరిమెళ్ళ ఆహ్వానిస్తాడు. అస్వతంత్ర భారతమంటే ఆయన కెంత అనిష్టమో ఈ ఆహ్వానం తేటతెల్లం చేస్తుంది.

గరిమెళ్ళ జైలుని స్వర్గ మని తలచాడు. స్వేచ్ఛావధూమణి వేచివున్న కారాగృహ సౌభాగ్యాన్ని ఆయన అభివర్ణించిన తీరు హృద్యం:

'విచ్చుల విడిగాను విప్పి రెక్కలు మీరు
విహరింపవచ్చు-మీ రచట
స్వేచ్ఛ నిచ్చు నెక్కగ వచ్చు నచట
దైవం మెప్పు లందగవచ్చు నచట
తల్లి కచ్చియున్న ఋణము సర్పింపగా వచ్చు.'

స్వాతంత్ర్యం కోసం కారాగృహానికి వెళ్ళడమంటే మాతృఋణం తీర్చుకోవడమన్నమాట. అందువల్ల దేవుడు కూడా మెచ్చుకుంటాడు. గరిమెళ్ళ వంటి నిజమైన స్వాతంత్ర్య యోధులకు కారాగృహం స్వతంత్ర ధామంగా కనిపించడంలో ఆశ్చర్య మేమీ లేదు. ఈ త్యాగ ఫలితంగా, మన దేశంలో కొత్త సృష్టి జరుగుతుందని ఆయన ఆశించాడు.

గాంధీజీ అంటే గరిమెళ్ళకు ఎంత భక్తిభావమో చెప్పతరం కాదు. మహాత్ముడు రంగప్రవేశం చెయ్యడంతో భారతదేశపు చరిత్రలో వచ్చిన గొప్ప మార్పుని గరిమెళ్ళలా పసిగట్టిన వారు చాలామంది లేరు. పలువురు ఆయన్ని ఎంతగానో కీర్తించారు కాని, ఆయన తెచ్చిన మార్పుని మాత్రం స్పష్టంగా గ్రహించలేకపోయారు. గరిమెళ్ళ గాంధీజీని ప్రస్తుతించిన విధం పరికించండి :

*'ప్రపంచమున శాంతి-ప్రేమ దీపంబులు వెలిగించె*
*నీ దేశమంత*

*గాంధి తేనిగించె నీ క్రొత్త వ్రాత*
*స్వేచ్ఛ మొలిపించె మన శక్తిచేత*
*బలము దుర్బల మను బేద మెచ్చట లేదు.'*

మన దేశంలో గాంధీజీ శాంతి, ప్రేమ దీపాలు వెలిగించిన విషయం చాలామంది పేర్కొన్నదే. స్వేచ్ఛ మొలిపించె మన శక్తి చేత—అన్నదే ప్రధానమైన విషయం. గాంధీజీ మనకు చేసిన మహోపకార మిది. మన శక్తి యేమిటో మనకు తెలీదు. పశుబలంతో ప్రవర్తించే పాశ్చాత్య పాలకులంటే హడలిపోతున్న ఆ నాళ్లలో మనలో స్వాతంత్ర్య వాంఛ కలిగించడమే కాక దానిని సాధించేందుకు తగిన శక్తి యుక్తులు మనలోనే ఉన్నాయనే విషయాన్ని కూడా సర్వ ప్రపంచానికి తెలియజేసిన మహనీయుడు గాంధీజీ. స్వాతంత్ర్య వాంఛ ఆంగ్ల విద్య నేర్చిన కొంతమందికే పరిమితమై ఉండినట్లయితే, మనకు స్వాతంత్ర్యం ఇప్పట్లో లభించి వుండేది కాదు. స్వాతంత్ర్య సందేశం పల్లెయీళ్ళకు సైతం పాకడం వల్లనూ, వివిధ మతాలవారూ వివిధ వర్గాలవారూ స్వాతంత్ర్య సమరంలో భాగస్వాములు కావడం వల్లనూ మనం స్వతంత్రులం కాగలిగాము. స్వాతంత్ర్య సమర

యోధులైన బెజవాడ గోపాల రెడ్డిగారి మాటలు ఇక్కడ తప్పక పరిశీలించ దగినవి: 'అహింస, సత్య సూత్రములపై నిలిచి, పరిపాలకులకు వారి సహాయకులకు ఎట్టి హింసను తలపెట్టక, స్వరాజ్య హోమాగ్నిలో సమిథ లగుటకు ముందుకు వచ్చు స్త్రీలు, విద్యార్థులు, రైతులు, కార్మికులు ఇన్నాళ్ళుగ ఎచ్చట దాగి యుండిరి? వారి ఆవేశము, త్యాగోత్సాహము, వజ్ర సంకల్ప నినాదాలు గ్లెపియర్‌లోని శతాబ్దాలుగా పేరుకొని పోయిన మంచు దిబ్బలవలె ఎక్కడ అణగియుండెను!'[3] కర్షక కార్మిక జనావళిలో అణగి యుండిన అత్యద్భుతశక్తి బహిర్గతం కావడానికి కారణభూతుడయ్యాడు మహాత్ముడు. అందరిలో తీవ్రమైన స్వాతంత్ర్యేచ్ఛ కలిగించాడు—మొలిపించాడు. బలము, దుర్బలము అనే భేదాన్ని తొలగించాడు. భీరువుని ధీరునిగా మార్చాడు. పశుబలం పనికిరాదు పొమ్మన్నాడు.

దైవ కృపను కోరుతూ గరిమెళ్ళ ఈ అద్భుత గేయాన్ని ముగించాడు. మాన మిమ్మంటిమి—అనేది చివ్వరి మాట. అలాగే అనుపల్లవిలో 'మా ప్రాణాలపై పొంచి, మానాలు హరియించి' అన్నాడు. కాగా తెల్లవారి ప్రభుతలో భారతీయుల మానం హరించబడిందని గరిమెళ్ల స్పష్టం చేశాడు. కనుకనే, మానం ప్రసాదించుము భగవంతుడా—అని ఆ న్యాయమూర్తిని ఆ ధర్మమూర్తిని అర్థించాడు. నిజానికి మానం కంటె ముఖ్య మయింది మానవుడికి మరొకటి లేదు. అటువంటి మానాన్ని హరించిన తెల్లదొరతనం మాకు వద్దని గరిమెళ్ళ సూటిగా అన్నాడు. విశ్వనాథ వారన్నట్లు 'మా కొద్దీ తెల్లదొరతనము అన్న పాట శాకుంతలము వంటిది.'[4]

నాకు తెలిసినంతవరకూ ఆ నాళ్లలో బ్రిటిషు ప్రభుత్వాన్ని విమర్శించే యింత పెద్ద పాట తమిళం, కన్నడం, మలయాళం మొదలైన భాషలలో వెలువడలేదు. ఈ గేయ రాజం ఇంగ్లీషు చేయబడిందనీ, ఆ ఇంగ్లీషు అనువాదం ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి స్వరాజ్యలో ముద్రించబడిందనీ అభిజ్ఞులు చెపుతారు.

---

జ్ఞాపికలు

1. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, పుట 260.
2. గురుజాడ రాఘవశర్మగారి ప్రశస్త సంకలనం 'జాతీయ గీతాలు'కి విశ్వనాథ వారు వ్రాసిన ఉపోద్ఘాతము.
3. పై సంకలనానికి బెజవాడ గోపాలరెడ్డిగారు వ్రాసిన తొలి పలుకు.
4. విశ్వనాథ వారి ఉపోద్ఘాతము,

# 8. మాతృ స్తవం

జాతీయోద్యమం మనకు నవ్యదృష్టిని ప్రసాదించింది. అలాగే మన ఆలోచనా విధానంలోనూ ఒక మలుపుని ప్రవేశపెట్టింది. అంత వరకూ తెలుగుదేశం, తమిళనాడు—అని యిలా భావిస్తూ వచ్చిన ప్రజలు కన్యాకుమారి మొదలుకొని కాశ్మీరం దాకా విస్తరిల్లిన అఖండ భారతమే నా దేశం అని భావించసాగారు. మన దేశచరిత్రలో ఈ భావన అపూర్వం కాకపోయినా అతి ప్రధానమైన దనవచ్చు. తత్ఫలితంగా, కవులు రచయితలు చాలామంది భారతదేశ ప్రశస్తిని గానం చెయ్యసాగారు; భారత మాతను కీర్తించసాగారు.

అందరు కవుల వలె, గరిమెళ్ళ కూడా 'వందన మిదె గైకొనుమీ భారత జననీ' అంటూ మాతృస్తవం చేశాడు. గత వైభవం అందాలు దిద్దుకున్న ఆ గీతంలో కొన్ని నూతన భావాలు చోటు చేసుకోవడం గమనించదగిన అంశం.

గరిమెళ్ళ దృష్టిలో భారత జనని ఆనందదాయిని; ముని బృంద వందిని; సకల పురాణేతిహాస సారభరిత; ఓంకార మహిత; సాత్త్విక నిరోధమునకు జన్మశాఖ; పటు జనసమేత. ఆమె ఉదరమందు ఉపనిషత్తులు ఉద్భవించాయి. ఇలా ఆనాటి ప్రముఖులు చాలామంది భారత మాతను కీర్తించారు.

'ముప్పదికోట్ల జనమునకు మూల మాతవు
మూల మాతవు మా పాలి నేతవు'

అని గరిమెళ్ళ అన్నాడు. భారతదేశంలో నివసించే వారందరూ—ఏ మతస్థులైనా, ఏ భాషవారైనా, ఏ ప్రాంతం వారైనా—భారతీయులే అనీ, వారి కందరికీ తల్లి భారతమాత అనీ చెప్పడం మనలో ఏర్పడిన

నవ్య దృష్టికి ప్రబల నిదర్శనం. అనగా, భారతీయులందరూ సహోదరులు ఏకోదరులు. ఈ భావన ప్రగతి శీలాత్మకమైనది; కాలదోషం పట్టనిది.

ఈ భావాన్ని గరిమెళ్ళ సమకాలికుల్లో కొందరు వ్యక్తం చెయ్యక పోలేదు. కాని భారతీయులందరూ సహోదరులే అనే భావనలో గరిమెళ్ళకు అచంచల విశ్వాసం ఉన్నట్లు పేర్కొనవచ్చు. చరిత్ర ప్రసిద్ధ మైన మా కొద్దీ తెల్లదొరతనం గేయంలో కూడా ఆయన ఇలా అన్నాడు, కుండ బద్దలు కొట్టినట్లుగా.

*'ఎవరెన్ని చెప్పిన హిందూదేశవాసు లేకసోదరులె నండీ*
*అంటూ దోషము మాకు లేదండీ*
*పాప మంటూ చాటుదాము రండీ*
*ఈ కుంటి వాదనలు గూటిలో పెట్టండీ.'*

ఈ పాదాలు చదువుతుంటే, తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి గుర్తుకి వస్తాడు. ఆయన యిలా అన్నాడు :

*'ముప్ఫయికోట్ల జన సమూహం*
*సమగ్రత కిది ప్రతిరూపం...'*

*'ఎన్నో జాతులు మనలో ఉండేను*
*ఏమది న్యాయం ఇతరుల జోక్యం ?*
*ఒక తల్లి పిల్లలు కలహించుకున్నా*
*అన్నదమ్ములే వా రెన్నటికీ.'*

జాతు లెన్నో మనలో ఉన్నాయి; అయినా పరాయివారు ఇందులో జోక్యం చేసుకోవడం భావ్యం కాదు ఎందుకంటే కలహించుకున్నప్పటికీ, ఒక తల్లి పిల్లలు అన్నదమ్ములు కాకపోతారా? అని భారతి అంటే, గరి మెళ్ళ అంటాడు గదా సైతాను ప్రభుత అనే గీతంలో

*'అన్నదమ్ముల్లోన భేద మాడుం పెట్టాడండి బాబు*
*ఉన్నదల్లా ఊడదన్ని ఊరుతున్నాడండి బాబు.'*

భారతమాతను గరిమెళ్ళ యింకా యిలా కీర్తించాడు :

*'మాదు భాగ్యములకు నెల్ల మహిత కర్తవు*
*మహిత కర్తవు, మా యఘ విహర్తవు...*
*సకల సంపదలకు నీవు సంగ్రహంబవు*
*సంగ్రహంబవూ, గర్వ సంహారంబవు...*
*యుద్ధశకము మాన్పునట్టి బుద్ధిశాలివి*
*బుద్ధిశాలివీ, అనిరుద్ధ ప్రజ్ఞవీ...'*

నువ్వే మా భాగ్యాలకు కారణం, మా సంపదలకూ నిలయం అని దేశమాతను కీర్తించడం నవ్యభావం. యుద్ధశకము మాన్పునట్టి బుద్ధిశాలివి—అని గరిమెళ్ళ భారత జననిని ప్రస్తుతించడం పరమ రమణీయం. సమరానికి స్వస్తి చెప్పి శాంతినీ అహింసనూ ఆరాధించమని గాంధీజీ ఉద్బోధించాడు. తదనుగుణంగా గరిమెళ్ళ పెక్కు గీతాలలో కత్తియుద్ధాన్ని కాల్చివేయండి అంటూ, భారతమాతను శాంతిని కోరే చల్లని తల్లిగా అభివర్ణించాడు. గరిమెళ్ళ శాంతి ప్రియత్వం, యుద్ధ విముఖత్వం ఈ కింది పాదాలలో ప్రస్ఫుటంగా తెలియ వస్తాయి.

*'ప్రేమ చేతనే పగతుని గెలుతుము*
*రక్తపాతములు రాక్షసమత మగు'*
*'కత్తి బలము మాని, పశుశక్తి నూత మాని*
*ఆత్మబలము బూని...'*
*కత్తి బలము హేయంబంటు గాంధి చెప్పినాడురో'*
*'మానవజన్మం బెత్తినావు, మనిషి రక్తం త్రాగకురో*
*పొరుగువాని మాంసం తింటే పొట్ట పగిలిపోతుందో.'*

ప్రతి పాదం ఎంతో శక్తిమంతంగా కనిపిస్తుంది; ఒక సూక్తిగా కనిపిస్తుంది. కత్తిబలం హేయ మన్నాడు కవి. అది రక్తపాతానికి దారి తీస్తుంది. మరి, రక్తపాత మేమో రాక్షస మతం. సాటి మనిషి రక్తాన్ని తాగడం, పొరుగువాని మాంసం మెక్కడం మొదలైనవి మానవ జన్మ యెత్తినవాడు చెయ్యవలసిన పనులు కావు. మానవుడు జ్ఞానసంపన్నుడు. అందువల్ల, పశుబలానికి స్వస్తి చెప్పి ప్రేమ పథాన్ని అనుసరించమని

గాంధేయ కవి గరిమెళ్ళ అనడం ఎంతైనా సరసమూ, సముచితమూను. ఆత్మబలాన్ని పెంచుకోమన్నాడు. ఇలా పరిశీలించేకొద్దీ, ఈ పాదాలు ఆలోచనామృతాలుగా కనిపిస్తాయి. ఈ వివిధ భావాలకు నామాంతరంగా 'యుద్ధ శకము' అనే అర్థవంతమైన మాట వాడాడు. యుద్ధశకాన్ని మాన్పగలిగే శక్తి సమన్విత కనుకనే భారత జననిని బుద్ధిశాలి అనీ, అనిరుద ప్రజ్ఞ అనీ ప్రశంసించాడు.

యుద్ధశకం అన్నప్పుడు మరో జాతీయ కవి నామక్కల్ రామలింగం పిళ్లై (1888–1972) చెప్పిన యీ కింది తమిళ గీతం స్ఫురణకు రాకమానదు.

'కత్తి యిన్డ్రి రత్త మిన్డ్రి
యుద్ధ మొన్ఱు వరుగుదు
సత్తియత్తిన్ నిత్తియత్తై
నంబుం యారుం సేరువీర్
.... .... ....'

కత్తులు లేని నెత్తురు లేని
యుద్ధ మొకటి వస్తున్నది
సత్య మెపుడు నిలుచు నంచు
తలచు వారు చేరండి.
కన్నది లేదు విన్నది లేదు
ఖండన మీ మాదిరి
మును పెన్నడో చేసిన పున్నెము
పండెను ఈనాడు
.... .... ....'

వందన మిదె గైకొనుమీ – భారత జననీ
భారత జననీ మాపాలిటి రాణీ—

అనే పల్లవి కల యీ మాతృస్తవ గీతం గరిమెళ్ళ గీతాలలోనే కాక, భారతమాతను ప్రస్తుతిస్తూ ఆనాటి మన కవులు వెలయించిన గీతాలలోనూ ప్రశంసించదగింది.

## 9. మద్యపాన నిషేధం

హరిజనోద్ధరణలా, మద్యపాన నిషేధం కూడా గాంధీజీ బోధించిన సిద్ధాంతాలలో ఒకటి. ఆ రోజుల్లో కవులూ రచయితలూ ఆ విషయాన్ని ఆధారంగా చేసుకుని ప్రబోధాత్మక రచనలు ఎన్నో చేశారు. త్రాగుడు వల్ల కలిగే దుష్ఫలితాలను వివరిస్తూ రాజాజీ (చక్రవర్తి రాజగోపాలాచారి) తమిళంలో చక్కని కథలు వ్రాశారు.

'కల్లు సారాయి తెచ్చి యిల్లు
గుల్ల చేశాడండి బాబు
పెళ్ళాం మెళ్లో పుస్తెలు కూడా
వెళ్ళిపోయాయండి బాబు.'

అని గరిమెళ్ల 'సైతాను ప్రభుత' గేయంలో తన దుర్భరమైన ఆవేదనకు అక్షరరూపం కల్పించాడు. ఈ పాదాలు చదువుతుంటేనే కడుపులో ఏదో దేవినట్లు అనిపిస్తుంది. కరకు గుండె కూడా కరిగిపోతుంది. కల్లు దుకాణాల వల్ల ఎంత అనర్థం జరిగింది—అనే భావం ఎంత వద్దనుకున్నా కలగకమానదు. పచ్చని సంసారం ఎలా బద్దలయిందో కళ్లముందు కనిపిస్తుంది. పెళ్ళాం మెళ్ళో ఉన్న పుస్తెలు కల్లు దుకాణానికి వెళ్ళాయి అన్న తర్వాత, ఇంకేం జరిగిందో తెలుసుకోవలసిన అవసరం లేదు. ఆ విషాదాంత నాటకంలో అది ఆఖరు దృశ్యం.

గరిమెళ్ళ ఏం చెప్పినా కళ్ళకు కట్టేలా చెపుతాడు. అదీ నలుగురికీ తెలిసే శైలిలో. పుస్తెలు అన్నప్పుడే తాను చెప్పదలుచుకున్న విషయం జనసామాన్యానికి బాగా తెలుస్తుంది. ఈ విద్యలో అందె వేసిన చెయ్యి గరిమెళ్ళ. కల్లుకుండల గొట్టి, కలుష వృత్తుల గట్టి, అహింసాశక్తి చేతను బట్టి—రారా పోదాము అని మరో గీతంలో పేర్కొన్నాడు.

కల్లు పాట అనే పేరుతో 32 పాదాల పెద్ద పాటే వ్రాశాడు గరిమెళ్ల. అది ఆయన 'జాతీయ గీతములు' పుస్తకంలో చోటు చేసుకుంది. ఆ

పాటలోంచి కొన్ని చరణాలు యథాతథంగా ఉదాహరిస్తున్నాను. అవి చదివినా చాలు, త్రాగుడు పిశాచానికి బలియై పోయిన వారి బాధలు మొదలైనవి కళ్ళముందు బొమ్మ కట్టినట్టు ఉంటుంది.

'కల్లు తాగి నీ యిల్లునెల్ల గుల్ల చేయకు
నీవళ్లు రోగాల కెల్ల వడ్డి కీయకు
పిల్లజెల్లలను తెచ్చి వీధి పెట్టకు - ముసలి
తల్లితండ్రులను బట్టి తన్నికొట్టకు
త్రుళ్లి త్రోవలను నీవు తూలి పొడకు - బుద్ధి
వల్లకాట కలిపి యవమాన మొందకు.
నీ దారిద్ర్య మెల్ల యు నద్దాన ఉన్నది
సంసార మది మానుకుంటె చక్కగుంటాది.
పాపాల కెల్ల పుట్టపాచు వంటిదిరా
నీవు బాపుకోవేరా, నీకు శాప మదంట్రా
పైకి రాను సిగ్గు, నీపైక మెల్ల బొగ్గు
నీ మహిమ యెల్ల తగ్గు, నీ మాత కగును సిగ్గు
స్వారాజ్యకేతన మది సామి వంటిది
నీచపుకల్లు తాగువార్ని నేను కలయనంటాది.
స్నానమాడి నేడు మన సామి ముందర
కల్లుమానుతానంటంచును ప్రమాణము చెయ్యరా.

కల్లు తాగి ఇల్లూ ఒళ్లూ గుల్ల చేసుకోవద్దనీ, పిల్లా జెల్లను నడివీధిని ఉంచవద్దనీ, తల్లి తండ్రుల్ని తన్న వద్దనీ, తుళ్లుతూ తూలుతూ దారి వెంబడి నడవ వద్దనీ, నవ్వుల పాలు కావద్దనీ—మద్యపాన నిషేధాన్ని సమర్థిస్తూ వ్రాసిన వారందరూ చెప్పిన మాటలే. గరిమెళ్ళ కూడా ఇవి చెప్పారు. అయితే దారిద్ర్య మంతా కల్లు తాగడంలో ఉన్న దంటూ ఆయన చెప్పడం ఎంతైనా పేర్కొనదగింది. మద్యపానం దారిద్ర్యమూలం అని మద్యపానపు దుష్ఫలితాలను సూత్రంలా తెలియజేశాడు. దారిద్ర్య హేతువే కాక అవమాన కారణ మని కూడా

అన్నాడు. పైకి రావడానికి సిగ్గు, పైక మంతా బొగ్గు—సర్వనాశనం, గొప్పతన మంతా తగ్గు. తల్లికేమో సిగ్గు—అని చెప్పినతీరు హృద్యం. ఇవి చాలా శక్తిమంతమైన మాటలు. స్వరాజ్య పతాకం దైవ సమానం; ఆ దైవం మద్యపానరక్తుల చెలిమి చెయ్యదు; ఆ స్వామి ముందు కల్లు మాను తానని ప్రమాణం చెయ్యి అని గరిమెళ్ళ తన గీతాన్ని ప్రబోధాత్మకంగా ముగించాడు.

గుణము, ధనము, మానము అన్నిటినీ కూల్చే మద్యపానం ఆర్థికంగా అణగారిన బడుగు జీవుల పాలిటి శాపం. ఆ శాపంలోంచి బయటపడితే నీ సంసారం బాగుపడడమే కాక 'నీ తల్లి ముక్తి కలుగు'—అంటాడు గరి మెళ్ల. స్వాతంత్ర్య సముపార్జనకు మద్యపాన నిషేధం అవసర మన్న విషయాన్ని ఆయన స్పష్టంగా తెలియజేశాడు.

మాటలతో బొమ్మ కట్టడం గరిమెళ్లకు ఉగ్గుతో అలవడిన మహిత విద్య. ఆయనది నిశిత దృష్టి. అల్ప విషయాలను సైతం సూక్ష్మంగా పరి శీలించడం ఆయన స్వభావ మని భావించవచ్చు. ఈ కింది అముద్రిత గేయ భాగాన్ని చదివితే, ఒక మద్యపాన నిరతుడు మన కళ్ళ ముందు తూలుతూ పేలుతూ ఉన్నట్లే కనిపిస్తుంది.

*కల్లు తాగి ఒళ్లు మరచి తుళ్లి పేలకు*
*పిల్లా జెల్లలను పట్టి తిట్టి కొట్టకు*
*ముసలి తల్లీ తంద్రులను పట్టి తన్ని కొట్టకు.*

## 10. సైతాను ప్రభుత

తాను చెప్పదలచుకున్న విషయానికి తగిన శీర్షిక పెట్టడం లోనే కవి ప్రతిభ వ్యక్త మవుతుంది. ఆ శీర్షిక చదవగానే కవి హృద యాన్ని తెలుసుకోవచ్చు. అంతేకాదు. అది మనస్సులో అలాగే శిలా క్షరంలా నిలిచిపోతుంది; మరిచిపోదామన్నా మరిచిపోలేము. అలాంటి శీర్షికే సైతాను ప్రభుత. దుష్ట పిశాచాన్ని లేక దయ్యాన్ని సైతాను అని వ్యవహరిస్తున్నాము. దయ్యంలా పట్టుకున్నాడు, దయ్యంలా పీడిస్తున్నాడు అనే అర్థాలు స్ఫురించేందుకు సైతాను శబ్దం బాగా ఉపకరిస్తోంది. భరించ రాని పీడనకు పర్యాయపదంగా వాడబడుతున్నది.

తెల్లవారి కుటిల రాజనీతికి పాల్పడిన అస్వతంత్ర భారతదేశంలోని ఆనాటి పరిపాలనను ఒక్కమాటలో వ్యక్తం చేసేందుకు సైతాను ప్రభుతను మించిన మాట మరొకటి లేదనడం సత్య సన్నిహితం.

పాల కడలి వంటి రాజ్యం బద్ద లయిందండి బాబు—అని ఘోషిం చాడు గరిమెళ్ళ. మరో గీతంలో (కొయ్యోడ గీతం) పచ్చ నైన హిందూ రాజ్యం బద్ద లయిందిరో అని తన ఆవేదనను తెలియజేశాడు. ఆయన భావిం చిన ఆ పాల కడలి వంటి రాజ్యం—ప్రాచీన భారతం—దేవతలు, గంధ ర్వులు మొదలైన వారికి విహార భూమి. ఆ పచ్చనైన రాజ్యాన్ని ఆయన మాటలలోనే దర్శిద్దాము.

*'దేవతలొచ్చి సీటికి మాటికి తిరుగుచుండే రాజ్యమురో*
*కిన్నరలొచ్చి పాటలు పాడే కీర్తివంత రాజ్యమురో*
*విద్యాధరులు వీణలు పాడే వీనులవిందు రాజ్యమురో*
*గంధర్వులకు సుందరమైన కన్నుల పండుగ రాజ్యమురో*
*వెండికొండ పసిడికొండ వెలసినట్టి రాజ్యమురో*
*ముమ్మూర్తులకు ముఖ్యమైన మూలస్థానం రాజ్యమురో*
*కమ్మని గాలి వీచే మంచి గంధపుకొండ రాజ్యమురో.'*

అటువంటి రాజ్యం వన్నె కరిగి, చెన్ను తరిగి ఉండడం వల్ల, గరి మెళ్ళ పచ్చనైన రాజ్యం—పాలకడలి వంటి రాజ్యం—బద్ద లయిందని వాపోయాడు.

దేవతలు స్వైర విహారం చేసిన రాజ్యంలో వర్తకానికంటూ పరాయి వాడు పాదం పెట్టాడు. 'పాదం పెట్టి దొంగతనం ప్రారంభించాడు.' నెయ్యం చెడగొట్టాడు. ఉప్పు పన్ను, పప్పు పన్ను—అలా పన్ను మీద పన్ను వేసుకుంటూ పోయాడు. కల్లు సారాయిలు తెచ్చి యిల్లు గుల్ల చేశాడు. పంచాయతీలు మాన్పించి, వాటి స్థానంలో కోర్టులు పెట్టి, కోర్టుల ద్వారా రైతుల్ని కడగండ్లపాలు చేశాడు. కూలి చేసుకున్నా పొట్టకు కూడు కరవయింది. ఒకప్పుడు ఛప్పన్న శాస్త్రాలు ఘోషించిన భూమిలో చదువు ముక్క నల్లపూస అయింది. ఘోరమైన శాసనాలు చేసి నోళ్లలో గుడ్డలు కుక్కాడు. తమ తాతగారి దేశ మనుకుని ధాటీ చేస్తాడు. జీతా లిచ్చి పాలి

తులలో చిచ్చు పెట్టాడు. దేశ భక్తి కలిగి సంచరించే వారిని రాజద్రోహు లని రచ్చ కెక్కించాడు. ఆడి తప్పడం, ప్రజల కొంపలు ముంచడం అల వాటయింది. అయినా తాను నీతిశాలినంటూ మహా నిక్కుతాడు.

- సైతాను ప్రభుతలో గరిమెళ్ళ పేర్కొన్న విషయా లివి. అందువల్ల ఆ ప్రభుతలో మేము ఉండలేము, ఆ ప్రభుతను సాగనీయము అని ఖచ్చి తంగా చెపుతాడు.

సైతాను ప్రభుతలో భావగర్భితంగా చెప్పబడిన అంశం మరొకటి ఉంది.

*'చెన్నపట్నం నుండి అడి సీమ కెళ్లేదాక బాబు*
*డబ్బు కాలువ గట్టినాడు దాన్కి కాపు పెట్టినాడు'*

భారతదేశపు ధనం ప్రవాహంలా ఎంతగా బ్రిటనుకి వెళ్లేదో, పై పాదాలు నొక్కి చెపుతున్నాయి. అలా ఆర్థికంగా భారతీయుల్ని పీల్చి పిప్పి చేసిన ప్రభుత సైతాను ప్రభుత కాక మరే మవుతుంది?

బ్రిటిషు వారి కుటిల రాజనీతికి ప్రబల తార్కాణంగా గరిమెళ్ళ చెప్పిన యీ పాదాలను గ్రహించవచ్చు.

*'పంజాబు హత్యాలకు బదులు న్యాయ మిమ్మంటే*
*మరచి పొమ్మటంచు దొంగ-మాయ మాటలాడుతాడు.'*

మనదేశ చరిత్రలో పంజాబు హత్యగా ప్రసిద్ధి కెక్కిన జలియన్ వాలాబాగ్ దురంతాన్ని విస్మరించలేము. మూర్తీభవించిన సహనమైన గాంధీజీ అంతటివాడు రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం సాగించమని ఆదేశించాడు. ఆ రౌలట్ సత్యాగ్రహం సందర్భంగా పంజాబు గవర్నరు క్రూరంగా వ్యవహరించాడు. నిస్సహాయులూ నిరాయుధులూ అయిన ప్రజా సమూహం మీద డయ్యరు సేనాని ఎటువంటి హెచ్చరిక చెయ్యకుండానే కాల్పులు జరిపి ప్రపంచ చరిత్రలో తన కొక విశిష్ట స్థానం సంపాదించుకున్నాడు. ఆ దురంతాన్ని ఆ నాటి పాలకులు హర్షించారు. న్యాయం ఇమ్మని మన నాయకులు అడిగితే, మరిచిపొండని మాయమాటలు పలికారు. జలియన్ వాలాబాగ్ దురంతం తర్వాత బ్రిటిష్ పాలకులతో ఇక రాజీ కుదుర్చుకునే అవకాశం లేదని మహాత్ముడు భావించాడు.

ఈ దురంతాన్ని మన జాతీయ కవులు గర్హించారు. 'కంట గుడ్డను బెట్టి, కర్ణాన వేలెట్టి వింటూ చటర, ఓరయ్యా' అంటూ గరిమెళ్ల పాంచాలము అనే 33 పాదాల గేయం ఆలపించాడు. జాత్యహంకారం తల కెక్కిన బ్రిటిషువారి పాశవిక ప్రవర్తనకు శిలాక్షరాల వంటి అక్షరాలలో రూప మిచ్చాడు గరిమెళ్ళ:

*'కట్టు గుడ్డల విప్పి కచబంధముల రొప్పి -*
*యిట్టట్టులుగ జేసినారు*

.... .. ....

*వారు చేసిన యట్టి వరుసల వర్ణింప*
*నోరేమి నాకు నాడదుర*
*మన గౌరవంబే కూల్చి రొర*
*పారిషదుల నోళ్లబట్టి యుచ్చలు పోసి*
*నీరజ ముఖుల వన్నెల బయ్యటలు దీసి*
*దారిపోయెడి వారినెల్లను నోరగిలి కడుపులను బ్రాకగ*
*ధీరులను తమ కేతనమ్ము దెసకు దండము పెట్టజేసిరి.'*

ఈ రాక్షస కృత్యాలు చేసిన 'వారలతోడ మనకు ముందెట్టి సంబంధ మెందులకు?' అని ప్రశ్నించాడు కవి. అంతటితో ఆగలేదు. ఆంగ్ల బిరుదు మాని, ఆంగ్ల కోర్టు మాని, ఆంగ్ల సేవ మాని, ఆంగ్ల ప్రభుత మాని, ఆంగ్ల విద్యమాని, ఆంగ్ల దుస్తుమాని, ఆంగ్ల కల్లు మాని, ఆంగ్లేయత మాని స్వరాజ్య సంపాదనకై కృషి చేద్దామంటూ గరిమెళ్ళ ఉద్బోధించాడు. బ్రిటిషువారి కుటిల రాజనీతి వల్ల ఆంగ్లేయత అంటేనే అసహ్యం పుట్టింది అలనాటి జాతీయవాదులకు. ఇది సమంజసమే. అయినా వారు శాంతం వహించారు. గాంధీపథం అనుసరించారు. 'కొట్టవద్దు మరి గొణగ సణగవద్దు, పట్టుదలను బూనుడు'. ఇది మాతృముక్తికి మార్గ మను కున్నారు. ఆత్మబలం వహించి ముందుకి నడవాలన్నాడు గరిమెళ్ళ.

ఇంతకూ పర ప్రభుతను - సైతాను ప్రభుతను - కూలదోయడ మెందుకు? 'బాధ్యత సుధ గ్రోల' అంటాడు గరిమెళ్ళ. పరాయి వారి పరిపాలన అంత మైనప్పుడు స్వరాజ్యం లభిస్తుంది; స్వపరిపాలన ఏర్పడు

తుంది. ఈ పాలనా బాధ్యతను అమృత మన్నాడు కవి. బాధ్యత ఎప్పుడూ కష్ట సుఖాల కలయిక. అయినా ఉదాత్తమైన ఆశయ సిద్ధికోసం కష్టపడేటప్పుడు, ఆ కష్టం కష్టంగా తోచదు. సుధాప్రాయంగా గోచరిస్తుంది. బాధ్యతను అమృతప్రాయంగా భావించినప్పుడే, లభించనున్న స్వాతంత్ర్యం స్వర్గతుల్య మవుతుందని ఆయన భావించి వుండవచ్చు. అందుకే ఆయన మాటిమాటికి–

*దండాలండోయ్ మేముండ లేమండోయ్ బాబు*

*ఈ సైతాను ప్రభుత నింక సాగనీమండోయ్–*

అన్నాడు.

## 11. మహాత్ముని సందేశం

వివిధ భాషా కవులు – ప్రసిద్ధులు, అప్రసిద్ధులూ – గాంధీజీని ప్రస్తుతించారు. మలయాళ మహాకవి వళ్ళత్తోళ్ నారాయణ మీనన్ ఎన్టె గురునాథన్ (నా గురునాథుడు) అని జాతిపితను ప్రస్తుతించగా, సుబ్రహ్మణ్య భారతి 'వాళ్గనీ ఎమ్మాన్' అని గాంధి పంచకం సంతరించాడు. తండ్రీ, ప్రభువు అని ఎమ్మాన్ అనే మాటకు అర్థాలు. గాంధి అంజలి వ్రాశాడు మరో తమిళ కవి నామక్కల్ రామలింగం పిళ్లై. గాంధీజీని ప్రస్తుతిస్తూ పాటో పద్యమో చెప్పని తెలుగు కవి లేడనడం అత్యుక్తి కాదు. ఆయన్ని మహాత్ముడనీ, బాపుజీ అనీ, విశ్వయోగీశ్వరుడనీ, ఋషి అనీ, సర్వలోకప్రియుడనీ, జగద్రక్షకుడనీ తెలుగు కవులు సంబోధించారు, ప్రేమపూర్వకంగా భక్తి పురస్సరంగా. అంతా గాంధిమయం అని ఒకరంటే శ్రీ గాంధి నామం మరువాం మరువాం అని మరొకరు అన్నారు. దేవుడన్నారు కొందరు. ఆయన బోసినోర్విప్పితే ముత్యాల తొలకరే, చిరునవ్వు నవ్వితే వరహాల వర్షమే–ఇది ఒక కవి చేసిన సంస్తుతి. అలా మన కవులు ఆ రోజుల్లో జాతిపితను ప్రస్తుతించి చేసిన రచనల్ని అలవోకగా చదివినా మేను పులకరిస్తుంది.

ఇతర జాతీయ కవులవలె, గరిమెళ్ళ కూడా మహాత్మాగాంధీ, మహాత్ముని సందేశము మొదలైన గీతాలు వెలయించాడు. ఇతర గీతాలలో కూడా మహాత్ముని సందేశాన్ని యథాశక్తిని వివరించాడు. మహాత్ముని

సందేశాన్ని జన సామాన్యానికి తెలియజెయ్యాలనే నిర్దిష్ట ప్రయోజనంతో చేసిన రచనలలో ప్రచారాంశం ఉండక మానదు. అది ఒక్కొక్కసారి కొద్దిగానూ ఉండవచ్చు; గొప్పగానూ ఉండవచ్చు. ఈ దృష్టితో ఈ కోవకు చెందిన రచనల్ని పరిశీలించడం సమంజసం. అయినా వాటిలో కొన్నిట కవిత్వాంశం నెలకొని వుండడంవల్ల, అవి నేటికీ నిలిచివున్నాయి.

*'వినుడీ! వినుడీ! ఓ జనులార! విని*
*ధన్యత నొందుడి-జనులార!*
*పతితపావనుడు పురుషోత్తము డగు*
*గాంధిమహాత్ముని ఘన సందేశము—'*

అని ప్రారంభమయ్యే మహాత్ముని సందేశం గీతంలో మహాత్ముని ఆశయాలు చక్కగా వివరించబడ్డాయి. అసలు ఎత్తుగడే సొగసుగా ఉంది. గాంధీజీ సామాన్యుడు కాడనే విషయం నలుగురికీ తెలిస్తేనే, ఆయన మాటల్లో వాళ్ళకి నమ్మకం కలుగుతుంది. ఈ నమ్మకం కలిగిన తర్వాత, ఏ విషయం చెప్పినా అది తల కెక్కుతుంది. అందువల్లనే గరిమెళ్ళ పతిత పావనుడు, పురుషోత్తముడు—అని గాంధీజీ గొప్పతనాన్ని తెలియజేశాడు. మహాత్మాగాంధీ గీతంలో అయితే, ఆయన సామాన్య డనుకుంటావేమో, ఆయన జన్మ యెత్తడం దైవ సంకల్పం అన్నాడు కవి. అనగా గాంధీజీ కారణ జన్ముడని కవి అభిప్రాయం. ఖద్దరు కట్టండి, అది మన కలిమి బలములు—అని మామూలు ధోరణిలో చెప్పిన గరిమెళ్ళ ఆ తరువాతి పాదాలలో కవిగా దర్శన మిస్తాడు.

*'రాటము గొని, యూరాట ముడిగి, పో*
*రాటము లేకను పొంది సుఖాంతము.'*

అని రాట్నం ప్రాశస్త్యాన్ని రెండు పాదాలలో మనసుకి హత్తుకునేలా చెప్పాడు.

కదు రాడితే కరువుండదు—అని జనవాక్యం. ఇది తరతరాల విశ్వాసం. సీమ గుడ్డ మీది వ్యామోహం ఎక్కువయ్యేకొద్దీ రాట్నం మూల పడింది. గ్రామ ప్రజలకూ నేతగాండ్రకూ జీవితం గడవడం దుర్భర మనిపించింది. అనగా జాతీయ పరిశ్రమకు దెబ్బ తగిలింది. రాట్నం మళ్ళీ

వెలుగులోకి వస్తే గ్రామ ప్రజల—ముఖ్యంగా చేనేత పారిశ్రామికుల—బాధలు తగ్గుతాయి. జీవన సమరం తగ్గుముఖం పడుతుంది. దరిద్రుల కష్టసుఖాలు బాగా తెలిసిన మహనీయుడు కనుకనే, మూలబడిన రాట్నం వెలుగులోకి రావాలని గాంధీజీ ఉద్బోధించాడు. దేశ సంపదకు ప్రతీక రాట్నం; స్వాతంత్ర్యానికి ప్రతీక అది. ఈ విషయాన్ని నరనరాల జీర్ణించు కున్నవాడు గరిమెళ్ళ. అందువల్ల రాట్నం సహాయంతో మనం మన బాధలూ కష్టాలూ తొలగించుకుందాం; పోరాటపు బ్రతుకుని మాని సుఖంగా మనుగడ సాగిద్దాం—అని సహేతుకంగా పేర్కొన్నాడు.

ఈ విషయాన్ని ధ్వన్యాత్మకంగా తెలియజేశాడు గరిమెళ్ళ, సైతాను ప్రభుత గీతంలో. సైతాను ప్రభుత అనే పదబంధం చాలా గొప్పది. అది గంభీరార్థ సమన్వితం. 'We don't tolerate this Satanic Government' అని గాంధీజీ అన్నాడు, బ్రిటిషు ప్రభుత నుద్దేశించి. ఇక గరిమెళ్ళ చెప్పిన గేయం పరికిద్దాము :

*'నూలు పోగు మీద రాజ్య మూగుతున్నదండి బాబు*
*సీమ నూలు తెంచితేను సితికిపోవునండి బాబు.'*

తెల్లవారి రాజ్యం నూలు పోగుమీద ఊగుతున్నదట! ఆ సీమ నూలుని కనక తెంచితే, ఆ ప్రభుత తునాతునకలై పోతుంది!

మన దేశానికి వ్యాపారార్థం వచ్చిన ఇంగ్లీషువారు మొదలైన పాశ్చాత్యులందరూ మన దేశంలోని సుగంధ ద్రవ్యాలు, మస్లిన్ యితర మేలి రకం నూలు వస్త్రాలు మొదలైన వాటిని తక్కువ ధరలకు కొని, తమ తమ దేశాలలో ఎక్కువ ధరలకు అమ్మి బాగా లాభాలు గడించారు. బ్రిటిషు వారు మన దేశంలో తక్కువ ధరలకు ముడిసరుకులు కొని ఇంగ్లండుకి పంపే వారు. వారి కర్మాగారాలలో తయారైన వస్తువులు తెచ్చి మనదేశంలో ఎక్కువ ధరలకు విక్రయించేవారు. ఈ చారిత్రకాంశాలను స్ఫురణకు తెచ్చుకుంటే, విదేశ వస్త్రాల ఎర చూపి బ్రిటీషువారు మన దేశం నుంచి ఎన్ని కోట్లు తరలించుకు పోయారో మనం ఊహించుకోవచ్చు. అప్పుడు సీమ నూలు తెంచితేను సితికిపోవునండి బాబూ అన్న చరణంలోని గంభీరార్థం విదిత మవుతుంది. విదేశవస్త్ర బహిష్కరణాన్ని గాంధీజీ ఆదేశించడం

లోని అంతర్యం కూడా అప్పుడు వ్యక్త మవుతుంది. ఈ దృక్పథంతో చూసినప్పుడు, దేశ సంపదకే కాక స్వరాజ్య ప్రాప్తికి సైతం రాట్నం ఒక సోపానం అనే అంశం తెలియకపోదు.

రాట్నాన్ని పునరుద్ధరించడం వల్ల కలిగే సత్ఫలితాలను గరిమెళ్ల 'రాజ్య మేలుదాము రారా' అనే గేయంలో సూత్రప్రాయంగా తెలియ జేశాడు:

*'దేశ కళల నెల్ల తేజరిల చేదాము*
*పాటక జనమునకు పనులు కల్పిద్దాము.'*

ఈ రెండూ ఉదాత్తమైన ఆశయా లనడంలో విప్రతిపత్తి లేదు. ఈ విషయం గురించే ఆయన మహాత్ముని సందేశంలో ఇంకా యిలా పేర్కొన్నాడు:

*'గ్రామోద్ధరణకు జనులారా, ఇక*
*గడగుదమండీ జనులారా.*
*నిప్పచ్చరముల నిలయము లాయెను*
*పడిన వృత్తులను పైకి తీయుదము.*
*చేతి పను లుడుగ జనులారా*
*మన ఖ్యాతి నశించెను జనులారా*
*హస్తనిపుణతను ధ్వంసము చేసిన*
*పరుల చేతలకు బానిస లగుదుము.'*

ఇతర దేశాల సంగతి ఎలా ఉన్నా, నేటికీ మన దేశానికి గ్రామం వెన్నెముక. అది దేశపు గుండెకాయ అన్నా సాహసం కాదు. మనదేశంలో ఏడు లక్షల గ్రామాలు ఉన్నట్లు చెపుతారు. కాగా, మన దేశ ప్రజలలో చాలామంది గ్రామాలలో నివసిస్తున్నా రనడం నిస్సందేహం. అటువంటి గ్రామం కనక కళకాంతులు లేకుండా ఈసురోమని ఉంటే, దేశం ఎలా ముందుకి పయనిస్తుంది ? మన దేశంలో గ్రామం చాలా ముఖ్యమయిందనీ, దాన్ని అభివృద్ధి పరచవలసిన అవసరం ఎంతైనా ఉన్నదనీ నిర్ద్వంద్వంగా చెప్పినవాడు మహాత్ముడే. కనుకనే ఆయన గ్రామోద్ధరణకు నిర్మాణ కార్య

క్రమంలో అధిక ప్రాముఖ్యం ఇచ్చాడు. అనగా గ్రామ వృత్తుల్ని ప్రోత్స హించాలి. కుటీర పరిశ్రమలు కొత్తవి నెలకొల్పి, గ్రామస్థులకు జీవనోపాధి సౌకర్యాలు కల్పించాలి. పాటక జనానికి పనులు కల్పించాలి.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమానికి అద్దం పడుతున్నాయి పై గీత పాదాలు. పేదరికానికి అటపట్టుగా ఉన్న గ్రామాలను ఉద్ధరించాలని కవి పేర్కొన్నాడు. అందుకు తొలిమెట్టుగా మూలవడిన వృత్తుల్ని పునరుద్ధరించాలి. చేతి పనులకు ఆదరణ తగ్గడం వల్ల, మన పేరు ప్రఖ్యాతులు నశించాయని తెలియజేశాడు. హస్త నిపుణత నశించడం వల్ల, ఇతరులకు బానిస లయ్యే ప్రమాదం ఉందని సూచించాడు. విదేశ వస్త్రాలపై మనం ఆధార పడకూడదని పరోక్షంగా హెచ్చరించాడు.

ఈ విషయాదికాన్ని తెలుసుకుంటే, రాట్నానికీ గ్రామ సౌభాగ్యానికీ తద్వారా దేశ సౌభాగ్యానికీ సన్నిహిత సంబంధం ఉన్నదనవచ్చు. దీన్ని గుర్తించారు కాబట్టి, మన జాతీయ కవులు రాట్నలక్ష్మిని బహువిధాలుగా ప్రశంసించారు.

*'రాట్నమే దివ్య సుదర్శన చక్రము రమ్యముగా తిరుగన్*
*కాటకముల పోద్రోలి స్వారాజ్యము క్రమ్మర*
*మన కందించున్.'*

(కొమాండూరి పార్థసారథి అయ్యంగారు)

*'అన్నవస్త్రము లిచ్చి ఆరోగ్య మిచ్చి*
*ఆత్మగౌరవ మిచ్చి అభిమాన మిచ్చి*
*సౌఖ్య శాంతము లిచ్చి స్వాతంత్ర్య మిచ్చి*
*రక్షించు మా తల్లి రాట్నమా నీవు.'*

(చెరుకువాడ వేంకట నరసింహం)

*'వడుకు వడుకు కదుర వడుకవే కదురా*
*వడికి మా దారిద్ర్య మెడఁపవే కదురా.'*

(నెల్లూరు వెంకటరామా నాయుడు)

*'సుందరమ్మైన రాటమే - పసదుం బాంబురా*
*సందేహ మేల వానిలోన స్వారాజ్య మున్నదిరా.'*

(కొండపల్లి జగన్నాథ దాసు)

మహాత్ముని సందేశంలో గరిమెళ్ళ పేర్కొన్న మరో ప్రముఖ విషయం. 'పంచమ జాతిని జనులారా మన పక్షము గొందము జనులారా !'

గరిమెళ్ళ చాలా చోట్ల జాతి భేదాలను నిరసించాడు. ఆ భేదాలను కాల్చ రెందుకు? చెడ్డ బోధలకు ఎందుకు లొంగిపోయారు? అని సూటిగా ప్రశ్నించాడు. భేద భావాన్ని ప్రోత్సహించేది చెడ్డ బోధ. అస్పృశ్యతను పాటించడం పాప మని ప్రకటిద్దామన్నాడు. హరిజనుల ఆలయ ప్రవేశాన్ని అభిలపించాడు. చివరికి ఘాటుగా హెచ్చరిక కూడా చేశాడు.

*'నిమ్నజాతుల నెత్తుమోయి-వారు*
*నిరసించిన యెడల నిక నీకు గోయి.'*

(మహాత్మాగాంధీ నుంచి)

నిమ్న జాతుల వారిని కనక పైకి తీసుకురాకపోతే, అది యితరులకే హానికరమని గరిమెళ్ళ పేర్కొన్నాడు.

ఆత్మోన్నతికి తోడ్పడేది మత మన్నాడు. మానవైక్యతను అది పోగొట్టలేదు. భేదాలు కల్పించి ఐక్యతకు భంగకర మయింది మతం కాదనీ, ఆత్మోన్నతికి ఏదయితే ఉపకరిస్తుందో అదే మత మవుతుందనీ ఆయన భావించినట్లు పేర్కొనవచ్చు.

శాంతము సదా శ్రేయోదాయక మనీ, ప్రేమ చేతనే పగవారిని గెలి చెదమనీ, సత్యాహింసలు మన శస్త్రాస్త్రములనీ గరిమెళ్ళ గాంధీజీ సందేశాన్ని వివరించాడు.

గాంధీ అన్నా, గాంధీ పథమన్నా గరిమెళ్ళకు ప్రగాఢ విశ్వాసం. గాంధీజీ చెప్పిన దోవలో కనక నడిస్తే స్వపరిపాలన ఒక్క గడియలో ఏర్పడుతుందని ఆయన నమ్మకం. అప్పుడు స్వరాజ్యం సులభంగా సిద్ధిస్తుంది. గాంధి మాట బ్రహ్మ మాట అన్నాడు (కొయ్యెడ గీతం). కనుక

అది మీరరానిది. గాంధీజీ పాదకమలములను ముట్టి వందేమాతర మంత్ర రాజాన్ని ఉచ్చరిస్తూ రారా, రాజ్యమేలుదాం—అన్నాడు గరిమెళ్ళ మరో గీతంలో. కాగా మహాత్ముని ఆజ్ఞలు ఆయనకి కమలాక్షుని ఆజ్ఞలుగా కనిపించడంలో వింత యేముంటుంది? గాంధీవంటి నాయకరత్నం లభించడం ఎంత అదృష్టమో, నాయకుని మాటల్ని మనసా వాచా నమ్మిన గరిమెళ్ళ వంటి అనుచరులూ లభించడం అంత అదృష్టం! అది ఆ రోజుల విశిష్టత అనవచ్చు!

మహాత్ముడికి ముందే రాట్నం ప్రాశస్త్యాన్ని గ్రహించిన మహనీయుడు బ్రహ్మంగారుగా ప్రసిద్ధులైన పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారు. ఆయన కాలజ్ఞానాలు వినని వారుండరు. గాంధీజీని గురించి ఆయన ఇలా పేర్కొన్నారు.

*'ఉత్తర దేశమున వైశ్యకుల మందు*
*ఉత్తమ గాంధొకడు పుట్టేనిమా*
*హత్తుగాను అన్ని దేశముల వారంతా*
*సత్తుగా పూజలు జేసేరుమా.'*
*'లోక మంతయు ఏకంబుగా జేసె*
*ఏకు పట్టెడు వాడు వచ్చేనిమా*
*ప్రాకటంబుగాను లోకంబులో తాను*
*మేకై నిలిచి జనుల మేలెంచీనిమా.''*

గాంధీజీ పట్టిన ఏకు చివరికి బ్రిటిషు సామ్రాజ్యం పాలిట మేకయింది! రాట్నం వెన్నుని సుదర్శన సదృశమని భావించబడుతున్నది.*

---

* ఇంకా వివరాలకు శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్, అనందాశ్రమం వారి ప్రచురణలను పరిశీలించవచ్చు.

## 12. విప్లవ గీతాలు

'మాన్యాలు భోగాలు మనుజు లందరి కబ్బు
మార్గాలు వెతకాలి రండి'
'పొగలలో మరలలో పొగిలి పొగిలి సరకు
పుట్టించి యిచ్చేది మన మంతా'
'కర్షకులు కార్మికులు కలవండి వేగ
వార్షికోత్సవములు జరుపండి వేగ.'

పై పాదాలు చదవగానే, ఏ విప్లవ కవో వీటిని వ్రాసివుండవచ్చుననే భావం కలగడంలో ఆశ్చర్యం లేదు. కాని నిజానికి వీటిని వ్రాసింది గరిమెళ్ల సత్యనారాయణ. అన్యాయకాలము, జన్మభూమిని అనే గేయాలలోనివే పై పాదాలు. అన్యాయ కాలము మొట్టమొదట చిత్రగుప్తలో అచ్చయింది. జన్మభూమిని యేమో వాహినిలో వెలువడింది. ఆ తర్వాత అవి రాజమండ్రి బుక్ సెల్లర్సు వారు 1938 లో ప్రకటించిన జాతీయ గీతములు పుస్తకంలో చోటు చేసుకున్నాయి. *

గరిమెళ్ళ నూటికి నూరుపాళ్లు జాతీయకవి అనడంలో ఏమీ సందేహం లేదు. జాతీయోద్యమం వేడి తగ్గిపోయిన తర్వాత ఏర్పడిన కొత్త పరిస్థితిని చూసి ఆయన నిరాశ చెందివుండవచ్చు. స్వాతంత్ర్యానంతరం కష్టాలన్నీ తొలగిపోయి సుఖశాంతులు నెలకొంటాయనీ, నలుగురికీ న్యాయం కలుగుతుందనీ ఆశించిన గరిమెళ్ళను నిస్పృహ ఆవరించి వుండవచ్చు. సహజంగా ఆవేశపరుడూ అభిమానధనుడూ కావడం వల్ల కొత్త పరిస్థితిని చూడగానే ఆయన హృదయం రంపపుకోతకు గురియై ఉండవచ్చు. అన్యాయకాలం దాపురించిందే అనే బాధ ఆయనలో మిగిలివుంటుంది. మనస్సులోని బాధను యథాతథంగా గేయంలోకి వెలార్చి వుండవచ్చు,

---

* ఈ విషయాలను తెలపడమే కాక ఆ గేయాల ప్రతులను కూడా నాకు అందజేసిన సహృదయులు మల్లెల శ్రీ రామమూర్తిగారు. ఆయనకి కృతజ్ఞుణ్ణి.

బ్రతికినన్నాళ్ళూ జీవితంతో పోరాడిన గరిమెళ్ళ. ఆర్థికంగా అదృష్టహీనుడైన ఆ కవి తాను చూసిన అన్యాయకాలాన్ని యిలా వర్ణించాడు:

*'అన్యాయకాలంబు దాపురించిం దిపుడు*
*అందరము మేలుకోవాలండి*
*మాన్యాలు భోగాలు మనుజు లందరి కబ్బు*
*మార్గాలు వెతకాలి రండి-*
*ఏటి పొడుగున దున్ని యెరువేసి నీరెట్టి నూర్చి*
*పండించేది మన మంతా*
*గోటు సేయుచు బూతుకూతలను కూసి*
*కల కొట్టికొని పోవు టింకొక రొంతా ?*
*పొగలలో మరలలో పొగిలి పొగిలి సరుకు*
*పుట్టించి యిచ్చేది మన మంతా*
*తొగరు వాతెరసొగసు తొయ్యలులతో కలిసి*
*విరగబడుచుండు టింకొక రొంతా*
*కూలి చాలక కడుపు మాడుతూ గుహలలో*
*కుందుతూ కుళ్ళడము మన మంతా*
*గాలి మేడలలోను కమ్మతావులలోను*
*గర్వముగ భోగ మింకొక రొంతా —'*

సామాజిక జీవనంలో పేరుకున్న అసమానతలు ఈ గీతంలో పేర్కొనబడ్డాయి. అందుకనే అన్యాయకాలం దాపురించిందంటూ కవి మొదట్లోనే పేర్కొన్నాడు. ఎంత పండించినా కష్టమే మిగులుతోంది కర్షకునికి; ఆ పంట ఫలం మరొకరికి చెందుతోంది. పొగలు గక్కే కర్మాగారాలలో కష్టపడి వస్తూత్పత్తి చేసేది కొందరు. ఆ ఫలం అనుభవిస్తూ కొందరు విలాసమయ జీవితం గడుపుతున్నారు. కొందరేమో గుహలలో (గనులల్లో) కూలి చాలక కడుపు మాడి అలమటిస్తున్నారు. మరి కొందరేమో గాలి వీచే మేడమిద్దెలలో భోగా లనుభవిస్తున్నారు. కర్షకులూ కార్మికులూ ఇలా రెక్కలు ముక్కలు చేసుకుంటూ కన్నీటి జీవితాలు గడుపుతూవుంటే,

కొందరు చీకుచింతలు లేకుండా భోగభాగ్యాలు అనుభవిస్తున్నారు. ఏమిటీ దిక్కుమాలిన అసమానత? ఏమిటీ అన్యాయం? అది చూసి, భరించలేక పోయిన కవి 'అందరము మేలుకోవాలండి' అన్నాడు. ఈ సమష్టిభావం చాలా అవసరం, ఏదైనా సాధించాలంటే. ఇంతకూ సాధించవలసింది ఏమిటి? మాన్యాలు భోగాలు మనుజు లందరి కబ్బు మార్గాలు వెతకడమే అని కవి స్పష్టంగా చెప్పాడు. ఏ వర్గానికో ఏ ఒక జాతికో అని కాకుండా మనుజు లందరికీ మాన్యాలు భోగాలు కలగాలన్నది కవి ఉద్దేశం. అలా కలిగిననాడు, అన్యాయ కాలం పోయి న్యాయకాలం వస్తుంది. అయితే ఆ సుదినం ఎన్నడో మరి! గరిమెళ్ళ వంటి కవుల ఆశలు ఆకాశ కుసుమాలు గానే ఉన్నాయి!

జన్మభూమిని అనే గీతంలో కూడా అసమానతలు గురించి గరిమెళ్ళ ప్రస్తావించాడు. కొంచెం ఘాటుగానే చెప్పాడు. ఉన్నది ఉన్నట్లుగా చెప్పాడన్న మాట! కఠోర 'సత్యం వజ్రం కన్న కఠిన మయింది; కటిక చీకటి కన్న భయంకర మయింది! కర్షక కార్మికులు—అందరూ—కాల హరణం చెయ్యకుండా కలవాలన్నాడు. వాళ్ళే జన్మభూమిని అలరించే వారట! ఎంత సత్యం! ఇక గీతాన్ని పరిశీలించండి.

*'జను లెల్లరికి నేను జన్మభూమినిరా*
*ఛేదించవయ్యా అసమాన భేదముల*
*ఆనందమున నన్ను అలరించువారు*
*మీరలే మీరలే మేలుకొను డింక.*
*ఆసపోతుల కంత అధికార మేలా*
*మోస కృత్యములందు మోహంబులేలా*
*పెద్దలకు లాభాలు బొంకుల్ల నిండా*
*పేదలకు దుఃఖాలు హృదయాల నిండా*
*నీది నాదనెడి అన్యాయంబు వీడు*
*మనము మన దనెడి సద్భావంబు పాడు*
*మీ యిల్లు మీ సుఖము మీ ధనముతోనె*
*మేదినీతలమెల్ల మెరయుచుండాలి.*

*సైన్యాలు వారెన్నపుడు రక్షించవలెనా?*
*కర్షకుల కార్మికుల శిక్షించవలెనా !'*
*భాగ్యవంతుల వైభవము లంటె నాకు*
*బాధించు వ్రణ మని బాగా తెలియండి.*
*కర్షకులు కార్మికులు కలవండి వేగ*
*వార్షికోత్సవములు జరుపండి వేగ*
*ఆనందమున నన్ను అలరించువారు*
*మీరలే మీరలే మేలుకొను డింక.*

మీరలే మీరలే మేలుకొనుడు—అంటూ సామాన్యుల్ని ఉద్దేశించి గరిమెళ్ళ తన ఆవేదనను అభివ్యక్తం చేశాడు. వర్గ అసమాన భేదాలను ఛేదించి నన్ను సంతోష పెట్టండి అని జన్మభూమి ఆదేశించినట్లుగా కవి తెలియజేశాడు. పెరిగిపోతున్న అసమానతలు, అసపోతుల కేమో అధికారం, పెద్దలకు లాభాలు, పేదలకు దుఃఖాలు మొదలైనవి చూసి కంట తడి పెట్టాడు. ముఖ్యంగా—

*పెద్దలకు లాభాలు బొంకుల్ల నిండా*
*పేదలకు దుఃఖాలు హృదయాల నిండా*

అనే సాంఘిక దురన్యాయాన్ని చూసి ఆ బాధను జీర్ణించుకోలేక పోయాడు గరిమెళ్ల. అయినా సహన శీలాన్ని విడవలేదు. తిట్టు, కొట్టు అంటూ విరుచుకు పడలేదు, సంఘం మీద.

*'నాది నాదనెడి అన్యాయంబు వీడు*
*మనము మన దనెడి సద్ధానంబు పాడు—'*

అని హితబోధ చేశాడు; కర్తవ్యాన్ని సూచించాడు. సంఘంలో అసమానతకు దారి తీసే స్వార్థచింతనకు—నాది నాది అనే అన్యాయం—స్వస్తి చెప్పి సమష్టి భావాన్ని—మనది మనది అనే భావం—అలవరుచు కోమన్నాడు. మనది మనది అనే భావం (సహనౌ భునక్తు—మన మందరం కలిసి భోజనం చేద్దాము; సహవీర్యం కరవావహై—మన మందరం కలిసి పని చేద్దాము) ఉపనిషద్వాణి అన్నా సరే, విప్లవవాణి

అన్నా సరే—ఇది సద్గానం. నాడూ నేడూ ఎన్నటికీ మనం అభిలపించ వలసింది ఈ సద్గానాన్నే. ఈ విశాల దృక్పథం నాది నాది అనే స్వార్థ చింతనకు గొడ్డలిపెట్టు; సామాజిక శ్రేయస్సుకి ఆటపట్టు.

సామాన్యుడికి సంబంధించిన భావన అందరికీ కలగాలి. భాగ్య వంతుల వైభవాలు బాధించే వ్రణాలు. సామాన్యుడి సుఖదుఃఖాలకు అధిక ప్రాధాన్య మివ్వాలనే ధోరణికి పట్టం కట్టాడు గరిమెళ్ల. కనుకనే కర్షకు లారా కార్మికులారా మీ రంతా యిక నైనా జాగు చెయ్యకుండా కలవండి— అని కవి ప్రబోధించాడు. సాంఘిక న్యాయం సాధించాలన్నది ఆయన ఆశయం.

గరిమెళ్ళలోని విప్లవవాణికి ఈ గీతాలు నిదర్శనం. ఆ రోజుల్లో ఇలా కర్షక కార్మిక ప్రశంస చేసిన జాతీయ కవులు లేరన్నా అతిశయోక్తి కాదు. గరిమెళ్ళ కర్షక కార్మిక సమైక్యాన్ని అభిలపించాడు. వర్గ అసమాన తను నిరసించాడు. నా దృష్టిలో గరిమెళ్ళ మనం గుర్తించని విప్లవ కవి. అయితే తాను అలాంటి కవి నని ఆయన చెప్పుకోలేదు. అదీ ఆయన విశిష్టత !

పేదల శ్రమను దోపిడీ చెయ్యడం జరుగుతున్నదని గరిమెళ్ళ బాధ పడ్డాడు. అందువల్లనే ఆయనకి భాగ్యవంతుల వైభవాలు బాధించే వ్రణా లుగా గోచరించాయి. వర్గ అసమానతలు, శ్రమ దోపిడీ, కర్షక, కార్మిక సమైక్యభావం—ఈ మూడూ ప్రధానంగా గరిమెళ్ళ విప్లవ గీతాలలో కని పిస్తాయి. ఈ భావాలు అత్యాధునిక విప్లవ కవులలో ప్రముఖంగా కని పించడం గమనించదగిన విషయం. అనగా ఈనాటి విప్లవ కవుల భావా లను ఆనాడే గరిమెళ్ళ తన గేయాల ద్వారా తెలియజేశాడని చెప్పవచ్చు. పేదరికం, కష్టాలు స్వయంగా అనుభవించిన వాడు కనుకనే గరిమెళ్ళ వీటిని డొంకతిరుగుడు, పులుముడు మొదలైనవి లేకుండా స్పష్టంగా, సూటిగా చెప్పగలిగాడు. ఈ భావాలు ఆయన హృదంతరాలలోంచి వెలు వడినవి కనుక సహజంగా కనిపిస్తున్నాయి.

గరిమెళ్ళలో మరో విశిష్టత కూడా కనిపిస్తుంది. ఆయన సహన శీలుడు. వర్గ అసమానత, శ్రమ దోపిడీ మొదలైనవాటిని తొలగించేందుకు పరిష్కార మార్గం కనుగొనాలని ఆయన ఉద్బోధించాడు.

అన్యాయకాలం దాపురించింది కనక మన మందరం మేలుకోవాలని ప్రబోధించాడు. ఆయన పుచ్చమూర్తులా గాంధేయవాది కనుకను, కత్తి బలాన్ని మనస్ఫూర్తిగా నిరసించినవాడు కనుకను, హింసా మార్గాన్ని సూచించలేదు. మన మందరం మేలుకొని ఒక పరిష్కార మార్గాన్ని వెద కాలని హితవు చెప్పాడు.

ఇలా సమస్యల్ని ఎత్తి చూపడమేకాక వాటికి పరిష్కార మార్గం అన్వేషించాలని తపన చెందినవాడు గరిమెళ్ళ సత్యనారాయణ.

గరిమెళ్ళలోని విప్లవ భావాలను కె. వి. రమణారెడ్డిగారు గుర్తించారు.* 'తెలుగు దేశంలో కొత్తతరం పైకి రాసాగిన కాలం గరిమెళ్ళ అభిమానాలను వామపక్షం వైపు మళ్ళించక తప్పలేదు' అని ఆయన పేర్కొనడం మాత్రం సమంజస మనిపించదు. తాను తట్టుముట్టాడే పేదరికం అనుభవించాడే కాని, తాను నమ్మిన సిద్ధాంతాలను మాత్రం ఆయన విడిచిపెట్టలేదు. వర్గ అసమానతలు ఆయనకి స్పష్టంగా గోచరించాయి. అంతేకాని వామపక్షం వైపు మళ్ళలేదు. చివరిదాకా ఆ మహనీయుడు గాంధేయ కవిగానే ఉన్నాడు. మా కొద్దీ నల్లదొరతనం గేయం వ్రాయమని కొందరు ప్రోత్సహించినా, ఆయన అలాంటి గేయం వ్రాయక పోవడానికి కారణం ఆయన జాతీయాభిమానమే. గరిమెళ్ళ విప్లవ కవిగా గోచరించవచ్చు. కాని ఆయన జాతీయ కవి.

## 13. ఇతర గేయాలు

గరిమెళ్ళ వారి గేయాలను ద్వివిధంగా విభజించవచ్చు. గాంధేయ వాది కనుక, మహాత్ముని సిద్ధాంతాలకు ఆయన అక్షర రూపం కల్పించి సఫలీకృతు డయ్యాడు. మద్యపాన నిషేధం, హరిజనోద్యమం మొదలైన వాటికి సంబంధించిన గేయాలు వ్రాశాడు. వాటిలో గాంధీజీ నిర్మాణ కార్యక్రమాంశాలను ఉద్బోధించాడు. కొన్ని గేయాలలో ఆ నాటి రాజకీయ విషయాలను విమర్శించాడు. కనుక గరిమెళ్ళ గేయాలను ప్రబోధ గేయాలనీ, రాజకీయ గేయాలనీ స్థూలంగా విభజించవచ్చు.

---

* జముకు (శ్రీకాకుళం సాహితి బులెటిన్ నెం. 2) పుటలు 3-4.

కాంగ్రెసులో గలభా అనే రచన అసలు సిసలైన రాజకీయ గేయం. ఇది 1926, సెప్టెంబరు 25న వెలువడిన కృష్ణా పత్రికలో చోటు చేసుకుంది; 156 పాదాల దీర్ఘ గేయం. ఇందులో లాలాజీ (లాలా లజపతి రాయి), మాలవ్యా, మోతీలాల్ నెహ్రూ ప్రభృతులతోపాటు స్వరాజ్య, సముచిత సహకార పక్షాలు కూడా ప్రధాన పాత్రలు. ఈ నాడు చదివినా ఇది ఆసక్తిదాయకంగా ఉన్నప్పుడు, ఆ రోజుల్లో ఇది పాఠకులకు ఎంతో ఆసక్తికరంగా కనిపించి వుండవచ్చునని నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని ఈ గేయాన్ని చక్కగా అర్థం చేసుకోడానికి, ఆనాటి రాజకీయ పరిస్థితుల్ని సంగ్రహంగా నైనా తెలుసుకోవడం చాలా అవసరం.

కాంగ్రెసు వాదులలో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. శాసన సభలను బహిష్కరించాలని ఒక పక్షంవారూ, బహిష్కరించ కూడదని మరోపక్షం వారు భావించారు. గాంధేయవాదులైన వల్లభాయిపటేలు ప్రభృతులు శాసన సభా బహిష్కరణను కోరగా, చిత్తరంజన్‌దాసు, మోతీలాల్ నెహ్రూ ప్రభృతులు శాసనసభా ప్రవేశాన్ని సమర్థించారు. అందువల్ల కాంగ్రెసు వాదుల్లో రెండు చీలికలు ఏర్పడ్డాయి. చివరికి చిత్తరంజన్‌దాసు అధ్యక్షుడుగా స్వరాజ్య పక్షం ఏర్పడింది. ఇలా చీలికలు ఏర్పడ్డా, ఉభయపక్షాల వారూ కాంగ్రెసుకీ, గాంధీజీకి విధేయులే! స్వరాజ్య పక్షంవారు కాంగ్రెసు సంస్థను విడిచిపెట్టలేదు. అనగా, వారిలో వారికి సిద్ధాంత విషయంలో అభిప్రాయభేదాలు వచ్చినట్లు గుర్తించాలి. అందుకనే గరిమెళ్ళ కాంగ్రెసులో గలభా అని సహేతుకంగా పేర్కొన్నాడు. ఆనాడు చెలరేగిన వాదోపవాదాల తీరును హృద్గతం చేసుకోడానికి ఈ కింది పాదాలను యథాతథంగా ఉదాహరిస్తున్నాను.

సముచిత సహకారపక్షం స్వరాజ్య పక్షాన్ని ఈ విధంగా చీవాట్లు పెడుతుంది.

*'ప్రతిఘటనము చేసినావులే-నీకు*
*ప్రభువు లింక లొంగినారులే*
*మతిపోయిన ముసలి కూనవే-కాల*
*మానము గనలేని హీనవే.'*

అందుకు నోరు కొట్టుకుంటూ స్వరాజ్య పక్షం ఇచ్చిన జవాబు.

*'సముచిత సహకార మేమిటో! జ్ఞాన*
*సంస్కారములు బాపుకోమటో? కూర*
*కరణీయముల నిట్లు చూచెదే! వాని*
*కౌగిటిలో కుల్కు మీరదే!'*

పాత విధానాలు పనికిరావనీ, ఘూర్త స్వరాజ్యుల్ని గెంటివేయండనీ లాలాజీ సలహా యిస్తాడు. ఈర్ష్యలు మానమనీ, అన్య పతాకాన్ని తాక వద్దనీ శ్రీనివాసయ్యంగారు హితవు చెపుతాడు. స్వీయధర్మమును విస్మరించవద్దని గాంధీజీ ప్రబోధిస్తాడు. అప్పుడు జస్టిసుపార్టీ చెప్పిన మాటల్ని ఆలకించండి: 'కాంగ్రెసు గతి యిలా పట్టింది. గాంధేయుల్ని విడిచిపెట్టి కాదనకుండా వోట్లు మాకే యివ్వండి.' ఇదంతా చూస్తున్న పార్లమెంటు నృత్యం చేస్తూ వాళ్ళలో వారు తన్నుకుంటారు, కలిసిరారు, ఒకవేళ కలిసినా ఒక చిన్నవరం అడుగుతారని చెబుతుంది. ఇలా ఈ దీర్ఘ గేయం ఆ నాటి రాజకీయ పరిస్థితులకు దర్పణ ప్రాయంగా ఉన్నది.

1926, అక్టోబరు 9 నాటి కృష్ణా పత్రికలో రసమంజరి శీర్షిక కింద గరిమెళ్ళ లాలాజీకి! అనే కవిత సంతరించాడు (23 తేట గీతులు).

*'ప్రభుతపై నెదుర్తిరిగెడి పక్షమునకె*
*సతతముం జెందుచుంటె నీజాతి యనుచు*
*పేరు మ్రోగెను గద పృథివీతలాన*
*ఏమి మాయయొ ని న్నావహించె నేడు?'*

అని మొదలవుతుంది యీ కవిత. లాలాజీ స్వరాజ్య పక్షాన్ని ఈసడించడం గరిమెళ్లకు నచ్చలేదు. ఆయన దొరల పక్షాన నిలవడం, అదృష్టమంటే వారిదే అన్నాడు కవి. అయినా లాలాజీ అంటే గరిమెళ్ళకు గల గౌరవభావాన్ని యీ పద్యంలో మనం చూడవచ్చు.

*'ఏదియో దుష్టగ్రహ మొక్క టేగుదెంచి*
*ఒక్క చెడువేళ నిన్నట్టు లొంచెగాని*

*నీ వనగ నేమి మమ్ము గణింపవేమి !*
*భారత శివాజి ! లాలాజి ! సుగుణరాజి.'*

'సకల కర్తయె గలఁ డెల్ల చక్కఁజేయ' అనే ఆశాభావంతో ఈ కవిత పరిసమాప్త మవుతుంది.

రసమంజరి శీర్షికలోనే ఆయన పాటలు కొన్ని వెలువడ్డాయి. అలాంటి వాటిలో ఒకటి నెమలి పాట (1927, జనవరి 8). పాటకి ఆనంద భైరవి రాగం నిర్దేశించాడు. 'ఆడు నెమలీ-తెలుగు నాడు నెమలీ-మది, కానందం కలుగంగ-పాడు నెమలీ' అని ఆరంభ మవుతుంది. ఇది కూడా దీర్ఘ రచనే; 106 పాదాల రచన. రాట్నం తిరుగుతున్నది, స్వేచ్ఛారావం వినిపిస్తున్నది, పామరస్త్రీలు పెద్దపండగ చేసుకుంటున్నారు, పూర్వం నిన్ను అంతఃపుర కన్యలు అరచేతిమీద పెంచారు, ప్రస్తుతం ఒక్క సఖి కూడా నీకు లేదు-అని నేటి పరిస్థితిని నెమలిని సాకుగా చేసుకుని గరిమెళ్ళ తెలియజేశాడు, ఈ పాటలో. ఆయన పద్యం వెలయించినా, పాట సంతరించినా అందులో దేశ దౌర్భాగ్యాన్ని కళ్ళకి కట్టేలా తెలియజేస్తాడు. భారతీయతలో అభిమానం తగ్గుముఖం పడుతున్న విషయాన్ని ఆయన యిలా వ్యక్తం చేశాడు.

*'హిందూదేశంబు యొక్క కీర్తి నెమలి ! వార*
*లెలుగెత్తి పాడంగ లేరె నెమలి*
*ఇంగ్లీషు పద్ధతుల యందె నెమలి - హెచ్చు*
*కాంక్ష చెలంగు చుండు నెమలీ.'*

స్త్రీలలో కనిపించే పాశ్చాత్య నాగరికతాభిమానాన్ని ఈ పాటలో గరిమెళ్ళ దుయ్యబట్టినట్లు చెప్పవచ్చు. దేశాభిమానం సత్యదేవతను చూప గల దివ్వె అని గరిమెళ్ళ పేర్కొన్నాడు. ఆ దేవతకు హారతి పట్టమని నెమలిని ప్రబోధించాడు. పాట చివరలో ఆయన నెమలి కిలా ధైర్యం చెప్పాడు :

*'వడకొండ మొదలు సేతువు వరకు నెమలీ - నీవు*
*వయ్యారి నడకలతో తిరుగు నెమలీ.*

.... ... .... ....

*ఈరేడు లోకంబులందు నెమలీ - నీకు*
*ఈ డెవ్వరో చెప్పుమమ్మ నెమలీ.'*

ఆసేతు హిమాచలం అనడానికి, ఆయన పడకొండ (ఉత్తరాన ఉన్న కొండ) మొదలు సేతువు వరకు—అనడం బాగుంది.

'స్వరాజ్యమున కొక బాట' అనే 76 పాదాల గేయం 1927, ఏప్రిలు 2 కృష్ణా పత్రికలో వెలువడింది. నా దృష్టిలో ఇది వ్యంగ్య రచన. కాంగ్రెసు పేరుతో కపటనాటకం ఆడే వాళ్ళని ఉద్దేశించి గరిమెళ్ళ యీ గేయం వ్రాసి వుండవచ్చు. ఒక చరణంలో ఆయన యిలా అంటాడు :

*'కాంగిరేసనే తెరను వేసుకొని*
*కపట నాటకము సలుపయ్యా*
*కంగారుగ అది అడ్డము వస్తే*
*జ్ఞానం బనుకొని చింపయ్యా.'*

గ్రామ పునర్నిర్మాణ మని కమ్మని పాటలు పాడుతూ, నువ్వు మాత్రం పట్టణాలనీ సభలనీ విడిచి పెట్టవద్దు, ఇతరుల తప్పులతో పాటు నీ తప్పుల్ని కూడా వారి తలల మీద రుద్దు, నిరాకరణ మనే నీడను చేరి సహాయసాధం ఎక్కు—అని యిలా కపట కాంగ్రెసు నాయకుల్ని గరిమెళ్ళ తూర్పార పట్టాడు. జాతీయకవి సుబ్రహ్మణ్య భారతి కూడా కపట దేశభక్తుల్ని ఉద్దేశించి ఘాటైన గేయం సంతరించాడు.

1926, అక్టోబరు 2 కృష్ణా పత్రికలో 'రాజభక్తి గీతము' అనే వ్యంగ్య రచన వెలువడింది. తెల్లదొరల కొలువ రండోయి—అనేది పల్లవి. దాదాపు 80 పాదాల దీర్ఘ గేయం. మితవాదులు, జస్టిసు పార్టీవారు మొదలైన వారిని గురించి యిందులో చెప్పబడింది. ఈ గేయంలో ప్రయుక్తమైన భాష చాలా సరళం; ఇతర గేయాలలోని భాషకు భిన్న మయింది. కాంగ్రెసు రెండు ముక్కలు కావడం గురించి కూడా యిందులో చెప్పాడు

*'కాంగ్రేసునె రెండు కండలుగా సేసి*
*పెద్ద లందరు యిడిపోలేదా? - వేరే*

*గద్ద లందులో టూరలేదా? - మన*
*మద్దెల వాయించలేదా?...'*

గాంధీజీ సిద్ధాంతాలను ఆ నాటి కొందరు పెద్దలు ఎలా పరిహసించేవారో, యీ చరణాలు చదివితే తెలుస్తుంది :

*'రాట్నము వొడికితె - రమ్యామైన బట్ట*
*లెప్పుడైనా నేయగలమా?-కూడు*
*సిప్పుడైనా తాగగలమా?-సేయి*
*నెప్పి వెడితే బతకగలమా?-గాంది*
*సెప్పేదంటే మికు-సిగ్గేనా లేదయ్యా.'*

అలాగే ఇంగ్లీషుని ఎలా కొందరు మెచ్చుకునేవారో, అ విషయమూ తెలియజేశాడు గరిమెళ్ళ. ఆయన చేతిలో గేయం ఎంత సారళ్యం, సహజత్వం సంతరించుకున్నాయో కూడా తెలియవస్తుంది, యీ పాదాలు చదివితే.

*'ఇంగ్లీషు లేకుంటే-యిహలోకములోను*
*యెవ్వడైనా బతకగలడా!-సొగసు*
*గువ్వలాగ తిరగగలడా?-మంచి*
*బువ్వ సంపాదించగలడా?-దొరల*
*జవ్వనులతో షేకుహేండు సల్పగలడా.'*

దొరల జవ్వనులతో షేకుహేండు—అన్నప్పుడు గరిమెళ్ళలోని పరిహాస కుశలత తొంగి చూస్తున్నది.

'మోహనరంగడి పదములు' (కృష్ణా పత్రిక, 1927, ఏప్రిలు 16) పాడినా, రాజకీయ విషయాలు గరిమెళ్ళని విడిచిపెట్టలేదు. ఈ పదాలలో వోట్లు గురించి ముచ్చటించాడు.

*'షూటూ లెచ్చర్లు నిచ్చి-మాలా నమ్మకము గొల్పి*
*వోటులు మూటకట్టుకు తేరా-ఈ తెరలో లలిత*
*నాటక మాడుకొందము రారా-చల్ మోహనరంగా.'*
*'ఫస్టూ మితవాదిగాళ్ళు, నెక్టూ జస్టిసువాళ్ళు*

*కష్టము లేక నను పట్టేరు-నా కెక్కడ లేని*
*రష్టా రవ్వాయును చేకూర్చేరు—....'*

గరిమెళ్ళకు ప్రజల మాటల తీరు కరతలామలకం. కనుకనే ఆయన ఏ విషయం గురించి వ్రాసినా, అందులో తెలుగుదనం చక్కగా కని పిస్తుంది.

1926, సెప్టెంబరు 11 నాటి కృష్ణా పత్రికలోని ఆంధ్ర యూని వర్సిటీ అనే శీర్షికతో గరిమెళ్ళ వ్రాసిన తలుపు దగ్గర పాట చక్కని రచన. మన పాత పాటల వరసలు ఆయనకి తెలిసినంతగా ఆ నాటి గేయ కవులకు తెలియవన్నా సాహసం కాదు. తగుపాటి హాస్యంతో రంగరించిన పాట యిది.

విశ్వవిద్యాలయం తెచ్చాను, కలల్ని నిజం చేశాను చూడు-అంటూ ప్రియుడు తలుపు తట్టడంతో పాట మొదలవుతుంది. అతని ప్రియురాలికి స్వభాషాభిమానం, జాతీయాభిమానం కొంచెం ఎక్కువే. ఆమె అడుగు తుంది, ఆదుర్దాగా.

*'తెలుగు భాషను నాకుఁ జూపుమా-అందు*
*వెలుగు రుచులను నాకుఁ ద్రాపుమా!*
*కళల బెళుకులను చూపెట్టుమా-దాని*
*కమ్మదనమును నాకు పట్టుమా!'*

అందుకు ప్రియుడు అంటాడు గదా:

*'మిల్లను నీ యింటి బంటుమా-అల్ల*
*మెకాలె వాకిట్లో కుంటుమా.*
*వెల్టుడు (Well-to-do) జనులకు వీరలే-చాలా*
*వేడుకలను నించువారలే.'*

ప్రియుని యీ మాటలు వినగానే 'గిల్టుబొమ్మ లిదేటి గోమురా' అని ప్రియురాలు కోపం తెచ్చుకుంటుంది. బహుశః గరిమెళ్ళ వారికి కూడా కోపం వచ్చివుండవచ్చు. విశ్వవిద్యాలయం చదువు సంధ్యలు 'వెల్టుడు' వారికి (సంపన్నులకు) ఉద్దిష్టమైనవిగా కనిపించివుండవచ్చు. మన కళల

సంగతి యేమిటి? అని ప్రశ్నిస్తుంది ప్రియురాలు. 'అనకూడ దిపు డట్టి మాటలు.' ఇది ప్రియుని సమాధానం. గరిమెళ్ళ ఆశాభంగం చెందివుండ వచ్చు. అయినా కొత్త కళాశాలలు కట్టండని ప్రేయసీ ప్రియులు పాట చివరలో అంటారు.

ఇలా వివిధ విషయాలు గురించి గరిమెళ్ల గీతాలు వెలయించాడు. మనసులో మెదిలే భావాలను వాటిలో చొప్పించాడు. కొన్నిచోట్ల హాస్యాన్ని ఆశ్రయిస్తే, మరి కొన్నిచోట్ల వ్యంగ్యాన్ని ఆధారం చేసు కున్నాడు. కాని పరుషంగా మాత్రం చెప్పలేదు. గణబద్ధ కవితలోనో, మాత్రా ఛందస్సులోనో, గరిమెళ్ళ కథా కావ్యం ఒకటి వెలయించివుంటే, కవిగా ఆయన ప్రతిభను మరింతగా గ్రహించేందుకు వీలుండేది. కాని అలాంటి కావ్య రచనావకాశం ఆయనకి కలగలేదు కాబోలు !

## 14. వ్యాసాలు

జాతీయ కవిగా చిరయశస్సు గడించిన గరిమెళ్ళ సత్యనారాయణ వ్యాస రచయితగా కూడా ప్రసిద్ధుడే. ఆయన లేఖిని నుంచి ఎన్నో వ్యాసాలు వెలువడ్డాయి. భారతి, ఆనందవాణి, కృష్ణా పత్రిక, త్రిలిఙ్గ, ఢంకా మొదలైన పత్రికలు వాటిని ప్రచురించాయి. రాజకీయ వ్యాసాలే కాక సాంఘిక, సాహిత్య వ్యాసాలు కూడా ఎన్నో వ్రాశాడు.

1932, ఆగస్టు భారతిలో గరిమెళ్ళ సాంఘిక నవలను గురించి ప్రశస్త వ్యాసం వ్రాశాడు. తెలుగులో నవలలు ఎన్నో వెలువడినా, వాటిలో సాంఘిక నవల లని పేర్కొనదగినవి చాలా లేవని ఆయన బాధ పడ్డాడు. సాంఘిక నవలకు ఉండవలసిన లక్షణా లేమిటో విమర్శకులు నిర్ణయించకపోతే "ప్రతి లేఖకుఁడును ఏ వివాహమునకో వ్యవహారమునకో లేక వింతకో సంబంధించిన యొక కథ నల్లి దానికి సాంఘిక నవల యని పేరు పెట్టుట తటస్థింపవచ్చును. అట్లు జరుగుచున్నది కూడను" అని ఆయన స్పష్టంగా పేర్కొన్నాడు.

సాంఘిక నవల అంటే కథ చెప్పడం కాదనీ, కడాచిత్రణమే సాంఘిక నవల అవుతుందనీ గరిమెళ్ళ నిశ్చితాభిప్రాయం. సంఘ జీవిత చిత్రణమే సాంఘిక నవలకు ఆయువుపట్టు. ఆ చిత్రణ అతిశయోక్తులకు

ఆలవాలం కాకూడదు. సత్యసమ్మతమై ఉండాలి. సత్య మనగా బ్రహ్మ పదార్థానికి సంబంధించింది కాదు. "ఈ సత్యము దేశకాల పరిస్థితుల మార్పు వలన బాధింపబడు సామాన్య సత్యము." అని ఆయన స్పష్టం చేశాడు.

సాంఘిక నవలా రచనకు పూనుకునే రచయిత తన కాలానికి చెందినవీ తనకు తెలిసినవీ తాను చూసినవీ అయిన జీవితాంశాలనే గ్రహించాలని గరిమెళ్ళ అభిలషించాడు. అప్పుడే రచయిత ఉద్దేశం నెర వేరుతుంది. అంతేకాని అనగనగా ఒక రాజు—అని కథను ఆరంభించ కూడదు. అనగా తాను వ్రాసే కథ నిజంగా జరుగుతున్నట్లు కనిపించాలి. లేకపోతే రచయిత పరిహాసపాత్రు డవుతాడు. కథ సహజంగా కని పించాలి. కాగా కృత్రిమ నామాలు ఉండరాదు. అనగా వాడుకలో లేని ఊళ్ళ పేర్లు, వ్యక్తినామాలు ఉండరాదని ఆయన అభిప్రాయం. ఆయా కులాల ఆచారవ్యవహారాలను చిత్రించాలి. ప్రతి జాతికీ సొంత మనదగిన ఆచార వ్యవహారాలు కొన్ని ఉంటాయి. కనుక వాటిని శిల్ప దృష్టితో వర్ణించాలని ఆయన అభిప్రాయం.

శిల్పదృష్టిలేని రచయిత ఎంత ప్రముఖుడైనా పాఠకుల్ని ఆకర్షించ లేడు. శిల్పదృష్టి గల రచయిత ఆయా వ్యక్తుల ఆచార వ్యవహారాలు, లక్షణాలు, ఆశలు, విలాసములు, కష్టసుఖాలు మొదలైన వాటిని వర్ణించ గలిగితే, అలాంటి సాంఘిక నవల మనోజ్ఞంగా ఉంటుంది. సాంఘిక నవలా రచయిత శైలిని గురించి కూడా తగు శ్రద్ధ వహించాలని గరిమెళ్ళ ఆశించాడు. అది గ్రాంథికమైనా సరే, వ్యావహారికమైనా సరే అది సహజ సుందరంగా ఉండాలి. అంతేకాని 'శ్రమపడి పుస్తకములు వెదకి కష్టమైన ప్రయోగముల నేర్చి గ్రంథములో గాంభీర్యము కొరకు జరుపబడినదిగా నుండకూడదు.' రచయిత సృష్టించే పాత్రలు ఔచిత్య భరితములై వుండాలి. ఆ పాత్రల సంభాషణలు మనం మాటలాడుకునే భాషలోనే ఉండాలని ఆయన అభిలషించాడు. లేకపోతే ఆ పాత్రలు వింత గాలి పేవిగా వుంటాయి. అనగా, రచయిత తన ప్రతిభను, పాండిత్యమును కల్పనా ప్రాగల్భ్యమును ప్రదర్శించకుండా, ఆ పాత్రల్ని సహజ సుంద రంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించాలి.

సాంఘిక నవలలో ఒక మొదలు, ఒక తుది అని ఉండవలసిన అవసరం లేదు. మనుషుల చర్యలకే ఆ నవలలో అధిక ప్రాధాన్యం ఉండాలి. మానవుల సుఖ దుఃఖాలు, వారి ఆచార వ్యవహారాలను చిత్రించాలి. అప్పుడే ఆ సాంఘిక నవల ఒక చిత్రంలా ఉండగలదనీ గరిమెళ్ళ భావించాడు.

గరిమెళ్ళకు గల తెలుగు భాషాభిమానం నిరుపమానం. తెలుగులో నవ్య సాహిత్యం వెలుగు చూడాలని ఆయన ఆశించాడు. కృష్ణా పత్రికలో ఈ విషయమై ఆలోచనాత్మకములైన వ్యాసాలు కొన్ని వెలయించాడు. 1926, అక్టోబరు 2 న వెలువడిన కృష్ణా పత్రికలో నూతన సాహిత్య విజృంభణము అనే దీర్ఘ వ్యాసం చోటు చేసుకుంది. పత్రిక సైజులో తొమ్మిది పుటల వ్యాస మిది. రసమంజరి అనే శీర్షిక కింద ఈ వ్యాసం ప్రచురితం.

గరిమెళ్ల ఈ వ్యాసంలో నవ్య సాహిత్య సమీక్ష చేశాడు. శతావధాన కవులు, భావకవిత్వ ప్రారంభము, గీత కవిత్వము, మిశ్ర కావ్యములు ఈ కవిత్వములో వాడుక భాషకు గల స్థానము, ప్రబంధ వచనములు, గద్య కావ్యముల శైలి, వచనము యొక్క కర్తవ్యములు, నవలలు, ఆఖ్యాయికలు, ఆంధ్ర నాటకములు, వార్తా పత్రికలు, గ్రంథ విమర్శలు, వాడుక భాష నెట్లు చంపిరి. వాడుక భాషయొక్క భవిష్య ద్భాగ్యము మొదలైన ఉప శీర్షికల ద్వారా ఆయన తన భావాలను వ్యక్తం చేశాడు.

'ఆంగ్లేయ నాగరికత, ఆంగ్లసాహిత్యము తోడి పరిచయము, ఆంగ్ల పాఠశాలలలో ప్రవేశము మొద లైనవి యేర్పాటు కాబడినప్పటి నుండి తెలుగు సాహిత్యములో కొన్ని మార్పు లుదయము లైనవి.' అని వ్యాసం ప్రారంభ మవుతుంది. ఆ మార్పుల వల్ల నూతన యుగోదయ మైనట్లు గరి మెళ్ళ పేర్కొనడం సత్య సన్నిహితం. ప్రబంధ సృష్టి తగ్గడం, ఖండ కావ్యాలు ఎక్కువ కావడం, గద్యం ఎక్కువగా ప్రయుక్తం కావడం మొద లైనవి నూతన యుగ లక్షణాలని ఆయన సహేతుకంగా పేర్కొన్నాడు. అంతేకాదు. పూర్వం వెలువడిన ప్రబంధాలకూ, ఆయన కాలంలో వెలువడే ప్రబంధాలకూ చాలా భేదం ఉన్నట్లుగా కూడా గుర్తించాడు.

ఈ నూతన యుగం తిరుపతి వేంకటేశ్వరుల కావ్యాలతోనూ, వీరేశలింగం పంతులుగారి వచన రచనలతోనూ, ధర్మవరం రామకృష్ణమా చార్యులు గారి నాటకాలతోనూ ప్రారంభ మవుతున్న దని వ్యాసకర్త పేర్కొన్నాడు. గరిమెళ్ళలో డొంకతిరుగుడు కనిపించదు. అభిప్రాయా లను సూటిగా చెప్పడమే ఆయన ధ్యేయ మనవచ్చు. ఆయనకు గల నవ్య సాహిత్యాభిమానం, నిశిత దృష్టి మొదలైనవి యీ వ్యాసంలో అంతర్లీనము లయినాయి.

తిరుపతి వేంకట కవుల పాణిగృహీత, శ్రవణానందం మొదలైనవి పేరుకి ప్రబంధాలే గాని అవి "సమకాలిక నాగరికత యొక్క పటములు" అని ఆయన అభిప్రాయం. పాండవ జననాది నాటకాలలో ఆ కవులు అవ లంబించిన భావస్వాతంత్ర్యం, దేవీ భాగవతంలో వారు ప్రకటించిన రచనా స్వాతంత్ర్యం ఆ రచనలకు నవ్యత్వం సమకూరుస్తున్నదనీ, తిరుపతి కవు లలో "ప్రాచీన నవీనపు తళుక్కు"లు మూర్తీభవించి ఉన్నవనీ ఆయన పేర్కొన్నాడు.

భావకవితా విర్భావం గురించి ప్రస్తావిస్తూ, వ్యాసకర్త పేర్కొన్న కారణాలు పరిశీలింప దగినవి. ఆంగ్లం అభ్యసించిన తెలుగు విద్యార్థు లలో ఆంగ్ల పద్యాల వంటివి తమ భాషలో వెలువడాలనే అభిలాష కలగడం, సంస్కృత కావ్యాలను గాని తెలుగు కావ్యాలను గాని శ్రద్ధగా చదివేందుకు తమకు తగినంత తీరిక కలగకపోవడం, ఆనాటి చాదస్తపు పండితులు తమ రచనలలో పద విడంబనమే కాని కవితా మాధుర్యం ప్రదర్శించక పోవడం, నూతన కావ్యాలు తెలుగు వాణికి నవ్యాలంకారము లని భావించడం, వార్తా పత్రికలు మొదలైనవి వెలువడే కాలంలో పూర్వకాలపు దీర్ఘ కావ్యాలు వ్రాయడానికి వీలు కలగక పోవడం, కావ్యం ముక్తిప్రద మనే భావం తొలగడం—మొదలైనవి ఆయన పేర్కొన్న కారణాలు. పత్రికలు ఎక్కువయ్యే కొద్దీ వాటికి అనుగుణంగా కావ్య రచన చెయ్యాలనే అభిలాష రచయితలలో కలగడం సహజంగానే కనిపిస్తుంది. పత్రికల ప్రాధాన్యాన్ని ఆయన బాగా గుర్తించాడు. ఆ

విధంగా ఖండ కావ్యాల యుగం మొదలయిందని సహేతుకంగా భావించాడు.

భావకవిత్వం కంటె గీత కవిత్వం ఆధునిక యుగంలో అభివృద్ధి చెందిందని గరిమెళ్ళ గుర్తించడం ఆయన నిశిత దృష్టికి ఒక నిదర్శనం. గీత కవిత్వం పద్య కవిత్వం కన్న హృదయరంజక మైనదనీ, రమణీయ మైనదనీ చెప్పడంతోపాటు గీత కవితారంగంలో ఆచార్య పీఠం ఆదిభట్ల నారాయణదాసు గారిదనీ ఆయన నిష్కర్షగా పేర్కొన్నాడు. ఈ కారణం వల్ల పద్యరచన కంటె గీత రచననే గరిమెళ్ళ ఎక్కువగా అభిమానించినట్లు భావించవచ్చు. ఆయనే చెప్పినట్లుగా, గాంధీజీ రాజకీయాందోళన గీతానికి ఒక కొత్త ధర్మం, ఒక కొత్త రంగం, ఒక కొత్త భాష ప్రసాదించింది. మన పూర్వపు ఫక్కీలు, మెట్టులు, హిందూస్థానీ తళుకుల బ్యాండు స్వరాల అడుగున పడిపోయి అదృశ్యము లవుతున్నాయని ఆ గేయకవి సార్వభౌముడు బాధపడ్డాడు. ఈ కొత్త పద్ధతులు చివరికి యానాదుల వీధి భాగవతాలను, కూచిపూడి భాగవతుల సంప్రదాయాన్ని కూడా ఆక్రమిస్తున్నాయని గుర్తించాడు.

ఈ విషయాన్ని గరిమెళ్ళ తులనాత్మకంగా పరిశీలించిన తీరు ప్రశంసార్హం. కర్ణాటకపు కత్తులలో ఆరితేరి తమిళులు త్యాగయ్యగారి కృతుల్ని పాడుతూనే హిందూస్థానీ కత్తులలో కూడా గీత రచన చేస్తూనే, తమ పాత మెట్టులైన కావడి చిందు, తెమ్మాంగు, తేవారం, నొండి, లావణి మొదలైన వాటిని పరిరక్షించుకొంటున్నారనే అంశాన్ని ఆయన తెలుగు వారికి గుర్తు చేశాడు. సుబ్రహ్మణ్య భారతి, గోపాలకృష్ణ భారతి ప్రభృతుల గీతాలు ప్రచుర ప్రచారం పొందడానికి కారణం, వారు జానపదుల బాణీలను సమాదరించడమే అనవచ్చు. తెలుగువారు తమ పాత బాణీలను అశ్రద్ధ చేస్తున్నందుకు కాదు గరిమెళ్ళ బాధపడింది, వాటిని చూసి ఆధునికులు హేళన చెయ్యడం గొప్పగా భావిస్తున్నందుకు! గరిమెళ్ళకు తెలుగుదేశపు పడవవాళ్ళు, ఊడుపులవాళ్ళు, పంపువాళ్లు, చెంచులు మొదలైనవారు ఉపయోగించే మెట్టులు బాగా తెలుసునని భావించవచ్చు. జానపదుల అలౌకిక గాన మాధుర్యాన్ని అవగతం చేసుకోవాలని ఆయన ఆశించాడు.

గేయ ప్రధానమైన రచనలో వ్యావహారిక గ్రాంథిక భాషా మిశ్రమం వాంఛనీయమని గరిమెళ్ళ భావించాడు. కేవల గ్రాంథికత్వం ఆశించి రచనను అసహజం చెయ్యకూడదు; అలాగే సౌలభ్యం ఆశించి రచనను వికారం చెయ్యకూడదు. రచన వీలయినంతవరకు సహజంగా ఉండాలని ఆయన ఆశయం. ప్రచారంలో ఉన్న వాడుక భాషారూపాలను గ్రంథస్థం చెయ్యడం శ్రేయస్కర మని పేర్కొన్నాడు. ఈ సందర్భంలో గురజాడ వారి ముత్యాల సరములను ప్రస్తావించి 'అవి పద్యములనుట కంటె పాటలనవలెను' అని ఆయన తన అభిప్రాయం విశదం చేశాడు. తెలుగు మిశ్రమ భాష కనుక (సంస్కృత ద్రావిడ సంప్రదాయ సమ్మిశ్రితం), వ్యావహారిక గ్రాందికభాషా రూపాలను వాడడం మంచిదని ఆయన వాదం. ఈ దృష్టితో చూసినప్పుడు గరిమెళ్ళ గీతాలలో కనిపించే కొన్ని గ్రాంథిక రూపాలను ఆయన బుద్ధి పూర్వకంగానే వాడినట్లు మనం భావించవచ్చు. వ్యావహారిక భాషావాది అయినా, గురజాడ రచనలోనూ గ్రాంధిక రూపాలు కొన్ని చోటు చేసుకున్న అంశం విజ్ఞులకు తెలిసిందే.

'ఇది గద్యయుగము, వ్యవహారయుగము, విద్యా పాండిత్యముల యుగము కాదు' అని గరిమెళ్ళ చెప్పడం ఆయనలోని నవ్య దృష్టికి తార్కాణం. పూర్వం గద్యం కథల వరకే పరిమితం. కాని ప్రస్తుతం పిన్నలకూ పెద్దలకూ అందరికీ వృక్షశాస్త్రాది విషయములను తెలియజెప్ప వలసిన ఆగత్యం ఏర్పడింది. అందువల్ల గద్యం చెయ్యవలసిన పనులు ఎక్కువైనాయి. ఈ నూతన విధులు నిర్వర్తించేటప్పుడు, భావకవులవలె సౌందర్య దిదృక్షువులై నగిషీలు చెక్కడంవల్ల లాభం లేదనీ, కొత్త శైలిని అవలంబించాలనీ 'ఇట్టి శైలికి పితామహులుగా వీరేశలింగముగారు వెలసినారు ..ఆ మహనీయు డొనర్చిన యుపకారమునకై చేతులెత్తి' తెలుగుజాతి కృతజ్ఞతను చూపక మానదని గరిమెళ్ళ భావించడం పరిశీలించదగింది.

నవల, ఆఖ్యాయిక, దేశచరిత్ర మొదలైన వాటిని గురించి ఆయన తన అభిప్రాయాలను స్పష్టం చేశాడు. నవలలో ఎంత బిగువైన కథ ఉన్నా, అది సమకాలిక సాంఘిక జీవనాన్ని చిత్రించాలని ఆయన అభిప్రాయం. అలాంటి నవలలు ఒకటి రెండే కనిపిస్తున్నవనీ పేర్కొన్నాడు. నవలలు, చిన్నకథలు మొదలైనవి ఎక్కువగా భాషాంతరీకరణాలుగా

ఉండగా, నాటకాలు స్వతంత్ర రచనలుగా భాసించడం ఆయనకి ఒక ప్రముఖ విషయంగా తోచింది. అనువాద రచనకంటె స్వతంత్ర రచననే గరిమెళ్ళ అభిమానించాడనడం స్పష్టం. అలాగే ఆయన వార్తాపత్రికల్ని కూడా ఎంతగానో అభిమానించాడు. ముఖ్యంగా సంపాదకీయాల ప్రాధాన్యాన్ని గుర్తించాడు. ఏమైనా పత్రికలు కేవలం వార్తావాహకాలుగా ఉండకూడదు. సమహిత శీలం, దేశాభిమానం, నిర్భీరుత్వం మొదలైన గుణాలు గల సంపాదకుల పత్రికలు ఆచార్య పీఠం వహించగలవని అయన అభిప్రాయం. నిజంగా గరిమెళ్ళ నిర్భయుడనీ సమదృష్టి గలవాడనీ భావించవచ్చు. ఆనాటి కొన్ని పత్రికలు గురించి ఆయనకు గల అభిప్రాయాలు తెలుసుకుంటే ఈ అంశం బాగా తెలుస్తుంది. ఆంధ్రపత్రిక సంపాదకీయాలు కొంచెం పొట్టివైతే బాగుంటుందట! బ్రాహ్మణులు దానవులు కారని భావిస్తే సమదర్శినికి బాగా ఆదరణ కలుగుతుందట! బ్రాహ్మణేతరోద్యమాన్ని డీ కొనడమే తన పరమాశయం కాదనుకుంటే తెలుగు స్వరాజ్యం ఇంకా విజ్ఞానం వెదజల్లగలదట! దురుసుతనం, బాల్య చాపల్యం విసర్జిస్తే కాంగ్రెసు పత్రిక నలుగురి మన్ననకు పాత్ర మవుతుందట! ఆనాటి పత్రికలు గురించి గరిమెళ్ళకు నిర్దిష్టములైన అభిప్రాయాలు ఎలా ఉన్నాయో, గ్రంథ విమర్శకుని పట్ల కూడా ఆయనకి అలాంటి అభిప్రాయాలే ఉన్నదనవచ్చు. విమర్శకుడు దోషైక దృక్కు కాడు. విమర్శ ఒక కళ. విమర్శకుడు కేవలం వ్యాఖ్యాత కాదు. 'కవి హృదయ గ్రహణ విద్యాధురీణుడు'.

ఇక వాడుక భాష గురించి ఆయన కొంచెం దీర్ఘంగానే వ్రాశాడు. గ్రాంథిక వాదిగా పైకి కనిపించినా, నా దృష్టిలో గరిమెళ్ళ వ్యావహారిక భాషావాది. వాడుక భాషను, వివిధ మాండలికాలను ప్రోత్సహించాలని ఆయన అభిప్రాయం. మాండలికాలను ప్రోత్సహించకపోతే, బొంబాయి తెలుగు, ఆంధ్ర తెలుగులు, తంజావూరు తెలుగులు వేర్వేరై క్రమక్రమంగా తెలుగు రూపు మాసి చెంతనున్న బలవద్భాషలో కలసిపోగల ప్రమాదం ఉన్నది. కనుక విభిన్న మాండలికాలను గ్రంథస్థం చెయ్యాలని ఆయన ఉద్బోధించాడు.

వాడుకభాషను గురించి చర్చిస్తూ గరిమెళ్ళ కొన్ని విషయాలు పేర్కొన్నాడు. గిడుగు వారి వ్యావహారిక భాషావాదం గద్యరచన కోసం

ప్రారంభించ బడింది. శాస్త్ర గ్రంథాలలోకి వ్యావహారిక భాషా ప్రయోగాలు ఎక్కువగా ప్రవేశించే అవకాశం ఉన్నది. గ్రాంథికంలో కథలు వ్రాసినందువల్ల వాటి వన్నె తగ్గదు. భాషా పరిశ్రమ చేసిన వారు ఏ పుస్తకము నైనా చదివి అర్థం చేసుకోవచ్చు. గరిమెళ్ళ దృష్టిలో గ్రాంథిక వ్యావహారిక శైలులు ముఖ్యం కాదనీ, భాషమీద అధికారం సంపాదించాలనీ అప్పుడు ఏ రచన యైనా సుబోధక మవుతుందనీ చెప్పవచ్చు.

వాడుక భాషను విసర్జించి చిన్నయసూరి కృతక భాషను ప్రవేశ పెట్టినట్లు గిడుగు వారి ఆరోపణ. ఈ విషయమై వ్రాస్తూ గరిమెళ్ళ యిలా అన్నాడు: 'ఆంధ్ర విద్యాధికులకు కూడ ఈ పోత పాలలవాటయి చంటి పాలు అంటూ ఒకటి ఉంటాయనే జ్ఞానమే లేకుండా చేసినారు (సూరి)'. అయినా ఆ కృతకభాషపై తిరుగుబాటు చేయనవసరం లేదని ఆయన అభిప్రాయం. మన భాషకు ఆ 'కృత్రిమ మాధుర్యం' ఉన్నదనే ఆనందం మిగులుతుంది. ఒక్కసారిగా గ్రాంథికం లోంచి వ్యావహారికంలోకి రాలేక పోతున్నట్లుగా ఆయన అసలు విషయాన్ని పేర్కొన్నాడు. అయినా వాడుక భాష, తత్ప్రయోగాలు వాటంతట అవే రచయితల కలాలలో చొచ్చుకు పోతున్నవనే సత్యాన్ని కూడా ఆయన స్పష్టం చేశాడు. కనుక గరిమెళ్ళ వ్యావహారిక వాదాన్ని సహర్షంగా సమర్థించాడనీ, అభ్యాస వశాన గ్రాంథికాన్ని వీడలేక పోయాడనీ భావించడం సముచితం. వ్యాసాంతంలో ఆయన పేర్కొన్న మాటలు ఆయన నిజాయితీకి, వ్యావహారిక భాషాభిమానానికి మచ్చుతునకలు. గిడుగు వారి వాదంలోని సామంజస్యాన్ని చర్చించాడే కాని, ఆయనంటే గరిమెళ్ళకు అపార గౌరవం. "శ్రీ పంతులుగారు చూపించిన మార్గం రామ సహాయమై వారివేపు కృతజ్ఞతా దృష్టితో తిలకించేటట్లు చేయకమానదు. కొందరు ముందర వెళతారు, కొందరు తాపీ పడతారు, కొందరు తొందర పడతారు. కొందరు నిక్కి వెనక్కి నక్కుతారు. కొందరు సంతోషిస్తూ వెళుతారు ..."

వ్యావహారిక భాషావాదం, వచనానికి (గద్యం) గల ఆవశ్యకత మొదలైన విషయాలను గరిమెళ్ళ నిశితంగా పరిశీలించినట్లు చెప్పవచ్చు. కృష్ణా పత్రికలోనే 1927 ఏప్రిలు 30 న ఆయన వ్రాసిన 'క్రొత్త అనుశాసనము' అనే వ్యాసం వెలువడింది. ఈ వ్యాసంలో వచనానికి వేరే

వ్యాకరణం కావాలా ? అనే అంశం గురించి ఆసక్తికరములైన విషయాలు ఆయన పేర్కొన్నాడు. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తాము వెల యించిన అనుశాసనం కంటె విపులమైన మరొక అనుశాసనం రచించి అందరి కృతజ్ఞతకు పాత్రులు కావలెనని కూడా ఆయన సూచించాడు.

పూర్వ వ్యాకరణాలు పద్య కవిత్వానికి పరిమితములనీ, భాషా శాస్త్రం గురించి కాని మామూలు గద్యమును గురించి కాని అవి చెప్పవని గరిమెళ్ళ గుర్తించాడు. కనుక గద్యమునకు ప్రత్యేకంగా ఒక వ్యాకరణం వెలువడాలని ఆయన అభిమతం. ఆ గద్యం ఎంతవరకు వాడుక భాషగా ఉండాలి ? అనే సమస్యను కూడా చర్చించాడు.

ఆ నాళ్ళలో గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలు గురించి తర్జన భర్జనలు జరిగాయి; వాటిలో ఉభయ పక్షాలకు చెందిన పండితులు పాల్గొన్నారు. ఎవరి అభిప్రాయాలు వారు వెలిబుచ్చారు. గరిమెళ్ళ రెండు పక్షాలను ఆదరించినట్లుగా కనిపిస్తుంది. కాని వ్యావహారిక భాషావాదం వైపే ఆయన మొగ్గు చూపాడు. గ్రాంథికం మీద తిరుగుబాటు చెయ్యనవసరం లేదనీ, గ్రాంధికవాదులు కూడా సందర్భానుసారంగా తెలిసో తెలియకో ఆ నియమాలు విడిచిపెడుతున్నారనీ, వ్యావహారిక భాషా వాదానికి వారు సన్నిహితు లవుతున్నారనీ, గ్రాంథిక ప్రయోగాలు చెయ్యరాదని వ్యావహారిక భాషావాదులు పట్టుపట్టడం మంచిది కాదనీ గరిమెళ్ళ వాదన. ఈ అంశాలను పరిశీలిస్తే బలవంతంగా కాక సహజంగా వాడుక భాషను ఆదరించాలని ఆయన ఆశించినట్లు చెప్పవచ్చు. వాడుక భాషలో కూడా రెండు రకాల భాష లున్నాయనీ, మనం వ్యవహరించే భాష ఒకటీ, ఉత్తర ప్రత్యుత్తరాలలో వాడే బాష మరొకటీ అని ఆయన పేర్కొన్నాడు. కాగా సుబోధకమూ సుందరమూ అయిన వ్యావహారిక శైలి వాంఛనీయమని ఆయన ఆశించినట్లు చెప్పవచ్చు.

ఈ సందర్భంగా గరిమెళ్ళ తాను అవలంబించిన శైలిని కూడా స్పష్టం చేశాడు. గ్రాంథిక వ్యావహారిక శైలులు రెండింటిని సందర్భానుసారంగా సమ్మేళనం చెయ్యడం భాషాభివృద్ధికి దోహదం చేస్తుంది. ఉభయుల సిద్ధాంతాలను మనస్సుకి పట్టించుకుని సమ్యగ్దృష్టితో ఒక శైలిని ఏర్పాటు చేసుకుని తాను వ్రాస్తున్నట్లు, అందువల్ల ఉభయ శైలుల మధ్య

సాన్నిహిత్యం ఏర్పడగలదనీ ఆయన స్పష్టం చేశాడు. ఇందుకు తగిన అను శాసనం ఒకటి కావాలి.

జాతీయవాది అయినా, వ్యావహారిక భాషా ప్రియుడైనా భాషలో విప్లవ ధోరణిని గరిమెళ్ళ నిరసించడం శోచనీయం. ఉద్యమం అన్న తర్వాత ఆవేశపూరితములైన వాదోపవాదాలు ఉండడం సహజం. కాని ఎందుకో ఈ ధోరణి ఆయనకి అంతగా నచ్చినట్లు కనిపించదు. వీరేశలింగం, చెళ్ళపిళ్ళ ప్రభృతులు తమ 'శుద్ధ శ్రోత్రియాభిప్రాయము లను' కొంచెం మార్చుకోడానికి కారణం గిడుగు వంటి 'ఆందోళకుల ధణ ధణలును, ఆవేశములును' కారణం కాదనీ, 'సవిమర్శక ప్రాచీనార్వాచీన ప్రసిద్ధ గ్రంథ పఠనము మాత్రమే' కారణ మని ఆయన అభిప్రాయం. ప్రాచీన అర్వాచీన గ్రంథ పఠనం ఒక కారణమేగాని అదే ప్రధాన మని చెప్పడం అసమంజసం. గిడుగువారి వాదన ఆనాటి పండిత లోకంలో మార్పు తెచ్చిన దనడం సముచితం. ఈ సత్యాన్ని గరిమెళ్ల గుర్తించలేదు. అదీకాక వాడుక భాషకు గ్రాంథికం మూల మని ఆయన అనడం కూడా సరికాదు. కాని కాల లక్షణమునూ, భాషాతత్త్వమును గుర్తించాలని ఆయన పేర్కొనడం గమనించదగింది. అది ఆయన అభ్యుదయ చింతనను తెలియ జేస్తున్నది.

గరిమెళ్ళ సాంఘిక, రాజకీయవ్యాసాలు కూడా వ్రాశాడని మొదటనే పేర్కొన్నాను. ఆ వ్యాసాలను కూడా స్థూలారుంధతీ న్యాయంగా పరిశీ లిద్దాము.

జపాను వారి శీలసంపద గరిమెళ్ళను బహుధా ఆకర్షించింది. వారినీ గురించి జపాను ఋజువర్తనము అనే చక్కని వ్యాసం ఆయన వ్రాశాడు. [1934, నవంబరు, భారతి], భౌతిక సంపదకంటె శీలసంపదే చాలా అవ సరమనీ, అది జపానుదేశపు స్త్రీ పురుషులలో ప్రముఖంగా కానవస్తున్న దనీ, అందువల్లనే వారు ఇతరుల్ని మించిపోతున్నారనీ ఆయన అభిప్రాయ పడ్డారు: వారిలో కనిపించే ఋజువర్తనం, సత్యశీలం ప్రపంచంలో చాలా కొద్దిమందిలో ఉన్నాయనీ, వారి భూతదయ కూడా వారి సత్యశీలం వంటి దనీ ఆయన పేర్కొన్నాడు. జపానువారు నాటకాలకుగాని, సినిమాలకుగాని కేవలం వినోదం కోసం కాక విజ్ఞానం కోసం వెడతారనీ కూడా ఆయన

పేర్కొన్నాడు. ఇది గమనించదగిన విషయం. ఈ సందర్భంలో గరిమెళ్ళ చెప్పిన యీ మాటలు పరిశీలించదగినవి. 'మన దేశంలో అయితే అసలు నాటకం కంటె పిల్లల యేడుపులు, తల్లులు సమాధానపరచడమే పెద్ద నాటకమై ప్రేక్షకుల దృష్టి అంతా ఆడవాళ్ళ గ్యాలరీ మీదకే వెడుతుంది. కాని జపాను స్త్రీలు నవ్వరు, జపాను పిల్లలు ఏడవరు – అని చెప్పింది ఒక ఆవిడ.'

## 15. రాజకీయ వ్యాసాలు

గరిమెళ్ళ పెక్కు రాజకీయ వ్యాసాలు వ్రాశాడు. అవి త్రిలిఙ్గ, కృష్ణా పత్రిక మొదలైన పత్రికలలో వెలువడ్డాయి. ఆనాటి రాజకీయ సమస్యలు ఆ వ్యాసాలలో చర్చించబడినట్లు చెప్ప నవసరం లేదు. కాంగ్రెసు పక్ష దృష్టితో ఆయన ఆ వ్యాసాలు వ్రాశాడనీ పేర్కొనవచ్చు. 'దేశములో నెక్కువమంది ప్రజాభీష్టమును బడసి యెక్కువ ప్రజా ప్రతినిధి యుక్తమగు కాంగ్రెసు దృష్టి. ' అని ఆయనే ఒకచోట పేర్కొన్నాడు (సమాధానములు, కృష్ణా పత్రిక, సెప్టెంబరు 18, 1926).

ఆనాడు దేశంలో కొన్ని రాజకీయ పక్షాలు ప్రబలమై ఉన్నా, వాటిలో జస్టిసు పక్షమూ (పార్టి), స్వరాజ్యపక్షమూ ప్రధానమైన వనీ, వాటిలో స్వరాజ్య పక్షం ఉత్తమ పక్షమనీ దేశంలోని అత్యధిక భాగం ఆమోదించే పక్షమనీ గరిమెళ్ళ అభిప్రాయం. అయినా తాను ఏ పక్షానికి చెందినవాడను కానని ఆయన పేర్కొనడం గమనించదగిన అంశం. 'నా మట్టుకు నేను పై పక్షములలో నెందులోనివాడను గాను.'' గరిమెళ్ళ వ్యక్తిత్వాన్ని గ్రహించడానికి ఈ రాజకీయ వ్యాసాలు కూడా తోడ్పడుతున్న వని నా అభిప్రాయం. ఏమి వ్రాసినా, అందులో ఆయన నిజాయితీ, నిర్భీకతా కనిపిస్తాయి.

శాసన సభలకూ కలెక్టరు కచేరీలకు భేదం లేదని ఆయన భావించాడు. 'శాసన సభికత్వము జీతము లేని సేవకావృత్తి' అని కూడా ఆయన భావించాడు. ప్రజాస్వామ్యంలో శాసన సభలకుగల ప్రాముఖ్యం నిరుపమానం. ఆ ప్రాముఖ్యాన్ని ఆయన సరిగా గుర్తించనట్లు కనిపిస్తుంది. కాని ప్రజాశక్తి మీద ఆయనకి గల అపార విశ్వాసం ప్రశంసార్హం. శాసన

సభలవల్ల జరిగే ఉపకారం కంటె 'నిజమైన ఉపకారము ప్రజలు వారిలో వారే చేసుకొనవలెను.' స్వర్గంలో ఉన్న దేవునిలా శాసన సభలలో ఉన్న ప్రభుత్వం వైపు చెయ్యి చాచినట్లయితే, 'ఊడిపడునది కాదు' ఆ ఉపకారం. ప్రజాశక్తి చల్లగా, బలిష్ఠంగా ఉన్నంతకాలమూ ఎలాంటి అపకారం జరగదని ఆయన విశ్వసించాడు.

గరిమెళ్ళ నూటికి నూరుపాళ్ళు కాంగ్రెసు వాదియే అయినా, ఆయనలో స్వతంత్ర ధోరణి ఉన్నట్లు వ్యక్తమవుతుంది. ప్రజాదృష్టికి ఆయన ప్రాధాన్యమిచ్చారు. అప్పటి రాజకీయ పరిస్థితులవల్ల శాసనసభల పట్ల ఆయన అంత సుముఖత్వం ప్రదర్శించలేదేమో! ఆయన 'సమాధానములు' చదివితే ఈ అంశం చక్కగా తెలియవస్తుంది.

ప్రభుత్వ దృష్టితో కాక ప్రజా దృష్టితో శాసన సభలు పని చెయ్యాలని ఆయన ఆశయ మనవచ్చు. ప్రభుత్వ దృష్టితో పనిచేస్తూ సాధించే విజయం నిజమైన విజయం కాదని ఆయన అభిప్రాయం. అది 'జయము వంటి అపజయం'. ఈ సందర్భంగా ఆయన లేఖిని నుంచి వెలువడిన మాటలనే ఉదాహరించడం సముచితం... 'కేవల ప్రజాదృష్టితో ప్రజలలో ఆందోళనము సాగించుచు కర్మవశమున జయము పొందలేక పోయినను నెక్కువ లాభకరమే యనియు ఎక్కువ జయతుల్యమనియు బహు కొద్దిమంది విద్యాధికులు అసంఖ్యాకులగు పామరులలోని వాడను నేనై యున్నాను. అయినను మా సిద్ధాంత దృష్టితో మేము ప్రస్తుత పరిస్థితులను చూచుటకు వీలు లేదు.'

వివిధ రాజకీయ పక్షములవారూ ప్రజల్ని భ్రమ పెడుతున్నట్లు గరిమెళ్ళ అభిప్రాయం. స్వపక్షభూషణ, ప్రతిపక్ష దూషణ, వోట్లను కాకుల్లా తన్నుకుపొయ్యే ప్రచారధోరణి దేశీయుల 'శాంత పరిశుద్ధ జీవన'మును కుచ్ఛిత రణరంగంగా మార్చివేశాయని ఆయన బాధపడ్డాడు. అయినా జాతీయనాయకులు శాసన సభల్ని ముట్టడించి, ఏదో ఒకటి సాధించాలని కోరుతున్నారు కనుక, కాంగ్రెసు అభ్యర్థుల్ని గెలిపించడం మంచిదని ఆయన తన అభిప్రాయం స్పష్టం చేశాడు.

ఆనాటి రాజకీయాలను పురస్కరించుకుని, గరిమెళ్ళ వెలయించిన రాజకీయ వ్యాసాలను పరిశీలించడం సమంజసమూ సముచితమూను.

శయోక్తులు కావు. అనువదించేందుకు ముందు కురళుని ఆయన క్షుణ్ణంగా చదివివుంటాడని చెప్పడం చర్విత చర్వణం.

కురళునే కాక దానికి పరిమేలళగర్ (11 వ శతాబ్ది) అనే ప్రసిద్ధ విద్వాంసుడు వెలయించిన వ్యాఖ్యానాన్ని కూడా గరిమెళ్ళ శ్రద్ధానక్తులతో చదివాడు. కురళుకి ఎన్నో వ్యాఖ్యానాలు వెలిసినా, వాటిలో పరిమేలళగర్ వెలయించిందే ప్రశస్తమైన దని చాలామంది తమిళ విద్వాంసుల అభిప్రాయం. అంత గొప్ప పండితుడు కూడా కొన్ని కురళులకు సరి అయిన వ్యాఖ్యానం వెలయించలేదని అభిప్రాయపడే ఆధునిక విమర్శకులు కొందరు లేకపోలేదు. మొత్తం మీద, గరిమెళ్ళ ఒక ప్రశస్త వ్యాఖ్యానం ద్వారా కురళు వంటి గ్రంథాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం గమనించదగిన అంశం.

తిరుక్కురళు వంటి గ్రంథ రాజాన్ని తెనిగించే శక్తిసామర్థ్యాలు తనకు ఎలా కలిగాయో ఆ విషయాన్ని గరిమెళ్ళ స్పష్టం చేశాడు, ఈ కింది వాక్యాలలో. 'శ్రీమంతులగు ఆంగ్లేయాధికారి వర్గమువారు నాకు దీర్ఘకారాగార కఠిన శిక్ష విధించియు చివరి సంవత్సర భాగములో విడి ఖైదీని చేసి పుస్తకములను వ్రాత పరికరములను తెప్పించుకొననిచ్చి నాకీ సనాతన భాషను మాత్రమే కాక మఱికొన్ని భాషలను గూడ నేర్చుకొనగల మహాభాగ్యమును కల్పించినారు. హాలాస్యమయ్యరుగారును, ఎ. ఎస్. కృష్ణస్వామి అయ్యంగారును నాకు తమిళ భాషను నేర్పి వారి యుత్కృష్ట గ్రంథములను గ్రహించి భాషను గ్రహించి తెలుగులోనికి భాషాంతరీకరణము చేయగల సామర్థ్యము నొసంగినారు.'

తిరుక్కురళులో 1,330 కురళులు ఉన్నాయి. రెండు పాదాల చిన్న పద్యం కురళు; ద్విపద వంటిది. మొదటి పాదంలో నాలుగు గణాలూ, రెండవ పాదంలో మూడు గణాలూ ఉంటాయి. సూత్రప్రాయమైన చిన్న పద్యంలో, కొండంత భావాన్ని ఇమిడ్చిన గరీయః ప్రతిభుడు తిరువళ్లువర్. నీటి చుక్కలో కనిపించే వృక్షంలా రెండు పాదాలలో గొప్ప భావం కుదించాడని ఆ మహాకవిని ఒక సహృదయుడు ప్రశంసించాడు. మరొక సహృదయుని ప్రశంసను చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఇలా తెలియజేశారు.

*త్రవ్వినకొలంది చెలమ నేర్పడిన నీర*
*మట్లు, చదివిన కొలది భావైకరాశి*
*నలరు భవదీయ సత్కవితామృతాప్తిఁ*
*బారమే లేదు రసిక ప్రపంచమునకు.'*

ఇటువంటి నీత్యుద్బోధక గ్రంథాన్ని తెలుగు చేసిన గరిమెళ్ళను కొనియాడక తప్పదు.

కురళులో అఱత్తుప్పాల్ (ధర్మభాగం), పొరుట్పాల్ (అర్థ భాగం) కామత్తుప్పాల్ (కామభాగం) అనే మూడు ప్రధాన భాగా లున్నాయి. భాగంలో దైవస్తుతితోపాటు గృహస్థాశ్రమం, సన్న్యా స్రాశ్రమం గురించి వివరించబడింది. 24 అధ్యాయాలలో (240 కురళులు) గృహస్థ ధర్మాలూ, 13 అధ్యాయాలలో సన్న్యాసాశ్రమ విధులూ చెప్పబడి నాయి. గరిమెళ్ళ అనువదించి ప్రకటించిన అర్థత్రయ సర్వస్వములో దైవస్తుతి (4 అధ్యాయాలు, 40 కురళులు), గార్హస్థ్యభాగానికి చెందిన 240 కురళులూ ఉన్నాయి. తమిళ మూలానికి అతి సన్నిహితంగా ఉండా లనే ఉద్దేశంతో గరిమెళ్ళ అనువాదం సాగించాడు. మరీ మూల విధే యంగా ఉండే అనువాదాలలో సాధారణంగా పఠన యోగ్యత లోపిస్తుంది. ఈ దోషం ఆయన తెలుగు సేతలో లేకపోవడం ఎంతైనా మెచ్చుకోదగిన అంశం.

తిరుక్కురళ్‌ని పూర్తిగా అనువదించాలనే ఆశయంతో గరిమెళ్ళ ఒక పథకం వేసుకున్నాడు. దాని వివరాలను ఆయనే ఇలా తెలియ జేశాడు : 'తిరువల్లువరు నాయనారు జీవ చరిత్రమును, వారు గ్రంథమును రచించి తమిళ సంఘము లేక తమిళ పరిషత్తు దగ్గర పఠించుటకు పోయిన ప్రకారము, ఆకాశవాణియు తమిళ సంఘమును వారిని సన్మానించిన రీతియు, యుగయుగముల సంఘ పండితులును కవీంద్రులున్ను వారిని ప్రశంసించుచు వ్రాసిన పద్యములు మొదలగున వెల్లయును వాటంతట నవియే యొక సంపుటము కాఁగలవు. ఈ తిరుక్కుఱళు అరు సంపుటము లును ముద్రించిన తరువాత నేడవ సంపుటముగా దానిని ముద్రించి ఆంధ్రుల కర పద్మములకు దానిని గూడ అర్పించఁగల వాడను,' కాని నేను మొదటి భాగాన్ని మాత్రమే చూడగలిగాను.

తిరువళ్ళువరు మహాకవిని గురించి గరిమెళ్ళ చాలా వ్రాయాలను కున్నాడు. పుక్కిటి పురాణా లనండి, కథలు గాథలు అనండి – తమిళ సాహిత్యలోకంలో ప్రచారంలో ఉన్న తిరువళ్లువర్ జీవిత చరిత్రను తెలుగు వారికి తెలియజేద్దామనుకున్నాడు. ఒకటవ భాగానికి వ్రాసిన మున్నుడిలో కురళ్ గ్రంథ ప్రాశస్త్యం వివరించబడింది.

మొట్టమొదట గరిమెళ్ల తిరుక్కురళ్ మూలాన్ని మాత్రమే తెనిగించాలనుకున్నాడు. కాని అది తెలుగువారికి దుర్గ్రాహ్యంగా ఉండవచ్చునేమో ననుకుని, పరిమేలళగర్ వ్యాఖ్యానాన్ని కూడా ఆ తర్వాత తెనిగించాడు. అందువల్ల గరిమెళ్ళ తెలుగు సేతను చదివేవారికి పరిమేలళగర్ వ్యాఖ్యానపు సొగసుల్ని కూడా అవగతం చేసుకునే సదవకాశం లభిస్తుంది. ఆ వ్యాఖ్యాత అంటే గరిమెళ్ళకి ఎనలేని ఆదరభావం ఏర్పడింది. ఆయన ప్రతిభను ఎంతగానో ప్రశంసించాడు. ఈ వాక్యాలు పరిశీలిస్తే, గరిమెళ్ల హృదయాన్ని అనాయాసంగా తెలుసుకోవచ్చు. 'వ్యాఖ్యానము చెప్పవలసిన సంగతులు వేనిని గాని విడువక, విడచిపెట్టవలసినవి చాదస్తముగ విస్తరించి చెప్పక, సమగ్రముగను సూక్ష్మముగను మహిమాబోధకమునై యలరారుచున్నది. నేను పఠించినంతవరకు ఆంగ్లేయులలో నెచ్చటను నిట్టి వ్యాఖ్యాత (పరిమేలళగర్) లేడు. సమస్త భాషలలోని వ్యాఖ్యాతలకును నిది యాదర్శప్రాయమని రూఢిగ చెప్పవచ్చును.'

పరిమేలళగరు వ్యాఖ్యానమునే కాక సుప్రసిద్ధ దేశభక్తులూ, తమిళం ఆంగ్లం మొదలైన భాషలలో పండితులూ రచయితలూ అయిన వి. వి. యస్. అయ్యరు గారి తిరుక్కురళ్ ఆంగ్లానువాదాన్ని కూడా గరిమెళ్ళ అక్కడక్కడ సంప్రతించినట్లు పేర్కొనవచ్చు.

ఇక గరిమెళ్ళ అనువాద విధానమును పరిశీలిద్దాము.

భగవంతుడు అష్టగుణుడని (ఎణ్ గుణత్తాన్) తిరువళ్లువర్ పేర్కొన్నాడు. అష్టగుణుడైన ఈశ్వరుని పాదపద్మములకు మొక్కని శిరము వ్యర్థ మని తమిళ వేదకర్త స్పష్టం చేశాడు, దైవ స్తుతిలో. ఈ అష్టగుణ విషయంలో శైవాగమములు, జైన గ్రంథములు భిన్నంగా పేర్కొన్నాయి. ఈ విషయాధికాన్ని పరిమేలళగర్ తెలియజేశాడు. ఆ వివిధ గుణాల్లా

తెలుసుకోడానికి వ్యాఖ్య అవసర మవుతుంది. కురళునీ, వ్యాఖ్యనూ గరిమెళ్ళ యిలా తెలుగు చేశాడు :

'ఎనిమిది గుణము లతని కెఱఁగని శిరము పస చె
డిన యింద్రియము లట్టుల వృథా'.

ఎనిమిది గుణములచేత నలరారెడి యీశ్వరుని యొక్క పాదముల మీద వంగని శిరము, తమ తమకు విధింపఁబడిన పనులను చేయఁజాల నట్లు చెడిపోయిన యింద్రియములవలె వృథా.

ఎనిమిది గుణములు: శైవ వేదములో స్వతంత్రత్వము, విశుద్ధ దేహము, నిరామయాత్మ, సర్వజ్ఞత్వము, అనాది బోధము, అలుప్తశక్తి, అనంతశక్తి, తృప్తి ఇవి అష్టగుణములని వర్ణింపఁబడినవి.

అణిమాద్యష్ట సిద్ధులని కొందర౦దురు. అవి అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశత్వము.

జైను వేదములో వచింపబడిన అనంతజ్ఞానము, అనంత దృష్టి, అనంత వీర్యము, అనంత ప్రేమ, అనామత్వము, అగోత్రత్వము, అనాయుస్సు, అనాశము అని కొందరందురు. అట్టి ఈశ్వరునికి వంగని తల యెట్లు వృథాయో చూడని కన్నులు, పొగడని నాలుక, అతని నామమును వినని చెవి యట్లే వృథా యని గ్రహించునది.'

శబ్దాలంకార సమన్వితములైన కొన్ని కురళులు అనువాదకుణ్ణి ముప్పు తిప్పలు పెడతాయి.

తుప్పార్క్కు త్తుప్పాయ తుప్పాక్కి త్తుప్పార్క్కు
త్తుప్పాయ తూఉం మళై.

ప్రసిద్ధ మైన యీ కురళులో తుప్పు (ఆహారం) అనే మాట చాలా సార్లు వాడబడినట్లు స్థూల దృష్టికి కూడా తెలియవస్తుంది. ఆహారపదార్థాల ఉత్పత్తికి వాన కారణ మవుతున్నది. ఆ వాననే (నీటిని) తాగుతున్నారు. కాగా, వాన తినేవారికి (తుప్పార్క్కు) ఆహారపదార్థాలు సమకూర్చి, వాటిని తినేవారికి తానూ ఆహార మవుతున్నది (తుప్పార్క్కుత్తుప్పు అయతూ). ఇదీ ఈ కురళులోని అర్థం. శబ్దగతమైన యీ మాదుర్యాన్ని అనువదించడం కష్టం. ఈ కురళుకి గరిమెళ్ళ తెలుగుసేత,

*'తినువారి కింపు భోజన మిచ్చుగద వాన*
*తినువారి తిండియును దానే.'*

ఈ కురళుకి వ్యాఖ్య యిలా సాగింది. 'వాన భోజనమునకు కావలసిన పదార్థము లెల్లయుత్పత్తి యగుటకు హేతువు మాత్రమే కాక, ఆ వాననే అనగా ఆ నీటినే జీవు లెల్లరు, ద్రావుచున్నారు. ఇట్లు వాన జీవుల యొక్క ఆహార వాంఛయు పానవాంఛయుఁ గూడ తీర్చుచు వాటిని వర్ధిల్లఁ జేయుచున్నది.'

గరిమెళ్ళ అనువాదం మూల విధేయంగానూ ఉంది; పఠన యోగ్యంగానూ ఉంది. అంతేకాక కురళు ఛందస్సుకి సన్నిహితంగా ఉండాలనే ఆశయంతో తత్తుల్యమైన ఛందస్సునే ఉపయోగించాడు. ఈ ప్రయత్నం ప్రశంసార్హం. మొదటి పాదంలో అయిదేసి మాత్రల చొప్పున నాలుగు గణాలూ (20 మాత్రలు), రెండవ పాదంలో మూడు గణాలూ (14 మాత్రలు) ఉన్నాయి. మొదటి పాదంలో (మూడవ గణంలోని మొదటి అక్షరం) యతిని పాటించాడు.

| | | |
|---|---|---|
| మొదటి పాదం : | తినువారి | — I I U I |
| | కింపుభో | — U I U |
| | జనమిచ్చు | — I I U I |
| | గదవాన | — I I U I |
| రెండవ పాదం : | తినువారి | — I I U I |
| | తిండియును | — U I I I |
| | దానే | — UU |

గరిమెళ్ళ సరళమైన గ్రాంథికం ఉపయోగించాడు. 'బహు జనులకు సుబోధకమగు సామాన్య భాషలో రచింపబడినది' అని ఆయనే చెప్పుకున్నాడు. కనుక సామాన్య పాఠకుడిని కూడా మనస్సులో ఉంచుకుని ఈ అనువాదం చేయబడిందని పేర్కొనడం అసమంజసం కాదు. తాను మహాపండితుడు కాకపోవడం సామాన్యజనులకు ఒక విధమైన ఉపకారమే అంటూ ఆయన ఇలా అన్నాడు: 'ఇది చదువుకొనుటకు గూడ. తగినంత

భాషా జ్ఞాన మాంధ్ర సామాన్య పాఠకునకు లేదన్నచో ఆంధ్ర జాతికే యది కళంక మనక తీరదు.'

గరిమెళ్ళ చేసిన యీ తెలుగు సేతను ప్రశంసించిన వారిలో సర్వశ్రీ విక్రమదేవవర్మ, ప్రభల లక్ష్మీనరసింహం పంతులు, మారేపల్లి రామచంద్రశాస్త్రి కవి, రావుబహాదూరు తాడేపల్లి వెంకటకృష్ణయ్య ప్రభృతులు కొందరు. సూత్రప్రాయంగా ఉన్న ఒక్కొక్క కురళను ఒక్కొక్క ఉత్పలమాలగా వ్రాయవలసిన అవసరం ఉన్నట్లు 'ఆంధ్ర దేశమున నవీన కవిత్వపు పోకడలలో మున్ముందు త్రోవలు తీసిన' రాయప్రోలు సుబ్బారావుగారు పేర్కొన్నారట! భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు మొదలైన మచిలీపట్టణ వాస్తవ్యులు ఈ మొదటి భాగం ముద్రణకు ఆర్థిక సహాయం చేశారు.

తిరుక్కురళ్ తెలుగు సేత ద్వారా గరిమెళ్ళ 'భాషకు చేసిన క్రొత్త సేవ' ఎంతైనా కొనియాడదగింది. ఇతర భాషలలోని ఆణిముత్యాల వంటి రచనల్ని అనువదించడం భాషకు చేసే సేవ అవుతుంది. అందులోనూ తెలుగు తోబుట్టు భాష అయిన తమిళం నుంచి ఒక అనర్ఘ రత్నాన్ని అనువదించీ, ఆ అనువాదాన్ని ప్రచురించీ గరిమెళ్ళ నిజంగానే భాషా సేవ చేసిన వాడయ్యాడు. ఇతర భాగాలు కూడా వెలుగు చూసివున్నట్లయితే, ఆయన తెలుగుసేత భాషామతల్లికి! అమూల్య భూషణమై ప్రతిభాసించేది!

## జ్ఞాపికలు

1. ఈ గ్రంథాన్ని నేను రాజపాళయంలోని తెలుగు గ్రంథాలయంలో చూడగలిగాను. మిత్రులూ బహుభాషా పండితులూ అయిన శ్రీ ముదునూరి జగన్నాథరాజుగారు ఈ అవకాశం కల్పించారు. ఆయనకి కృతజ్ఞుణ్ణి.

2. అయ్యరుగారు తమ మున్నుడిలో జ్ఞాపికలో ఇలా పేర్కొన్నారు. "The above preface is, but for some slight alterations, substantially the same that appeared in the first edition in 1916. Since then I understand that Pandit Kshemanand Rohat has rendered this English translation into Hindi, and that Shrimans Gopal Rao of Ellore and Garimalla Satyanarayana have translated some portions of the same into Telugu. All three works, I understand, are still in manuscript, The addresses of these gentlemen are unknown to me."

The Kural or the Maxims of Tiruvalluvar, Fourth edition, **1961**. (అముద నిలయం ప్రైవేట్ లిమిటెడ్, మదరాసు).

# 17. గరిమెళ్ళ, భారతి: కొన్ని సామ్యాలు

జాతీయ కవి గరిమెళ్ళ సత్యనారాయణ తెలుగు దేశపు సుబ్రహ్మణ్య భారతి. వారిద్దరూ ప్రముఖ దేశ భక్తులు. ప్రసిద్ధ గేయ కవులు. నూటికి నూరుపాళ్ళు జాతీయవాదులు. వారిద్దరి జీవిత చరిత్రలను, రచనలను తుల నాత్మకంగా పరిశీలిస్తే, మరికొన్ని సాదృశ్యాలు కనిపిస్తాయి.

1882 లో జన్మించిన భారతి కంటె గరిమెళ్ళ పదకొండేళ్లు చిన్న వాడు. భారతి 39 వ యేట మరణించగా, గరిమెళ్ళ 1952 లో, అంటే 59 వ యేట కాలధర్మం చెందాడు. అయితే, ఇద్దరు మద్రాసులోనే మరణించారు. .

ఆ జాతీయ కవులు మధ్య తరగతి కుటుంబాలలో జన్మించారు. పేదరికపు బాధలను చవి చూశారు. బ్రతికినన్నాళ్ళూ ఎప్పుడూ ధనా భావమే.

పరాశక్తిని బహు విధాలుగా ప్రస్తుతించిన భారతి ఒకసారి ఇలా అన్నాడు :

"పరాశక్తీ! విరామ రహితంగా కవిత లల్లేటట్టు నన్నను గ్రహించవా ? తల్లీ ! ఋణదాతలు నన్ను పీడించుకు తింటుంటేనూ, బియ్యాని కనీ, పప్పుకనీ నేను ఆలోచిస్తూ కూర్చుంటేనూ నిన్ను నేను ఎలా కీర్తించ గలను ? నా కుటుంబ భారం నీకు సంబంధించింది. నిన్ను కీర్తించే భారం నాకు సంబంధించింది. నాకు ఒక కాణీ నేల (ఒక ఎకరం ముప్పయి సెంట్ల భూమి) అనుగ్రహించవా?" అని ఒక కవితలో తన మనసులోని కోరికను వ్యక్తం చేశాడు.

"చేతిలో డబ్బు లేకపోవడం వల్ల లోకంలో తుచ్ఛ సుఖాలనే కాదు, ఉత్కృష్టమైన వాటిని కూడా పొందడానికి విఘ్నం కలుగుతున్నది" అని మరో రచనలో ఆయన పేర్కొన్నాడు.

ఇక గరిమెళ్ళ విషయం తలచుకుంటేనే కడుపు తరుక్కుపోతుంది. జీవితాంతం ఆయన కటికి పేదరికం అనుభవించాడన్నా అత్యుక్తి కాదు. కొన్నాళ్లు హోటలు నడిపాడు. అయినా పేదరికం రంపపు కోత తప్ప లేదు. వయస్సు పైబడేకొద్దీ దృష్టి లోపం కూడా ఏర్పడింది. పేదరికం

ముసలి తనం, దృష్టి లోపం—ఈ బాధలు పగవారికైనా వద్దు. అయినా కుటుంబం గడవాలి. కాని ఆత్మాభిమానం అడ్డు తగిలేది.

అందువల్ల, ఆయన 'తెలిసిన మొహాలు ఎదురవకుండా ప్రశ్నించకుండా' రాత్రులు ప్రయాణం చేసేవాడు. మైలాపూరు వీధులలో తల వంచుకొని బిచ్చ మడిగేవాడు. ఈ నగరంలో (మదరాసులో) వుంటూ ఎందుకండీ ఈ అవస్థ? అని ఒక మిత్రుడు అడిగితే, ఆయన ఇచ్చిన సమాధానం: 'మరెక్కడా లేని లాభం వుంది. ఈ మూల అడుక్కొని తిన్నట్టు ఆ మూల వాడికి తెలియదు'. గరిమెళ్ళ ఆత్మాభిమానానికి, పడిన అవస్థకు ఈ విషయాదికం ప్రబల నిదర్శనం.

ఇద్దరూ కొన్నాళ్లు ఉపాధ్యాయులుగా పని చేశారు. భారతి మధురలో సేతుపతి ఉన్నత పాఠశాలలో తమిళ పండితుడుగా పని చేశాడు. విజయనగరం ఉన్నత పాఠశాలలో గరిమెళ్ల అధ్యాపకుడుగా కొంత కాలం గడిపాడు. కాని, స్వేచ్ఛా ప్రియులు కావడంవల్ల ఆ వృత్తిలో వాళ్లు చాలా కాలం ఉండలేకపోయారు. భారతి పత్రికా రంగంలో ప్రవేశించాడు. మదరాసులో "స్వదేశమిత్రన్" పత్రికా కార్యాలయంలో చేరాడు. ఆ తర్వాత ఆయనే స్వయంగా కొన్ని పత్రికలు నిర్వహించాడు. ఒకరి ఇష్టానిష్టాలకు లోబడకుండా తనకు నచ్చిన విధంగా భావ ప్రకటన చెయ్యాలన్నదే ఆయన అభిమతం.

గరిమెళ్ళ కూడా కొంతకాలం పత్రికా రంగంలో పని చేశాడు. "గృహలక్ష్మి", "ఆంధ్రప్రభ" పత్రికలలో ఉప సంపాదకుడుగా వ్యవహరించినా, ఆయన కెందుకో ఆ వృత్తి కూడా అంతగా నచ్చినట్టు కనిపించదు. కొంతకాలం "త్రిలింగ" మొదలైన పత్రికలకు రాజకీయ వ్యాసాలు వ్రాశాడు. ఏ వృత్తిలోనూ ఆయన పట్టుమని పది రోజులపాటు ఉండినట్టు తెలియడం లేదు. శారదా గ్రంథమాల పెట్టి, పుస్తక ప్రచురణ చేశాడు. అదీ లాభించలేదు. ఆయన భ్రష్టయోగి!

మాతృదేశాన్ని గాఢంగా ప్రేమించినట్టుగానే, వాళ్ళిద్దరూ ఇతర భాషలను కూడా ఆదరించారు. తెలుగు భాష అన్నా, తెలుగువారన్నా భారతికి ఎనలేని అభిమానం. పోతన, వీరేశలింగం ప్రభృతుల్ని ఆయన ప్రశంసించాడు. తెలుగు సుందరమైన భాష అనిఅన్నాడు.

జైలులో ఉన్న రోజులలో గరిమెళ్ళ తమిళ భాష నేర్చుకున్నాడు. ప్రాచీన తమిళ కావ్యాలపట్ల అభిమానం పెంచుకున్నాడు. పరిమేలళగర్ అనే ప్రసిద్ధ పండితుడు వెలయించిన వ్యాఖ్యానాన్ని ఆధారంగా చేసుకొని ఆయన తమిళ వేదమైన 'తిరుక్కురళు'ను తెలుగు చేశాడు. అలాగే సుభాషితాలకు నెలవైన 'నాలడియారు'ను (చతుష్పది) అనువదించాడు. ఆయన కన్నడం కూడా అభ్యసించాడు. తమ మాతృ భాషలలో మౌలిక రచనలు, అనువాదాలు వెలయించడంతోపాటు, వాళ్ళిద్దరూ ఆంగ్లంలో కూడా కవితా రచన చేశారు.

అయితే, భారతి వలె వివిధ ప్రక్రియలలోను గరిమెళ్ళ రచనలు చేసినట్టు తెలియరావడం లేదు. ఆయన సంతరించిన ఖండ కావ్యాలు కాల గర్భంలో కలిసిపోయినట్టు భావించబడుతున్నది.

ఆ యిద్దరు గేయ కవులు సంగీత జ్ఞానం కలవారు. వారి గేయాలే ఇందుకు సాక్ష్యం. పైగా, జానపద బాణీలు వారికి బాగా తెలుసు. భారతి తన గేయాలు కొన్నిటికి స్వరకల్పన చేశాడు. ఇద్దరూ గేయ రచనలో సిద్ధహస్తులు. భారతి గేయాలు తమిళ జాతీయవాదులను ఆ రోజులలో ఎంతో ఉత్సాహపరచినట్టుగా గరిమెళ్ళ గీతాలు తెలుగువారిని స్వాతంత్ర్యానురక్తులను చేశాయి.

గరిమెళ్ల ఆలపించిన 'మా కొద్దీ తెల్ల దొరతనం' చాలా ప్రసిద్ధ మైనది. అది పాడిన వారికే కారాగార ప్రాప్తి లభించినప్పుడు, తద్రచయితకు కఠిన కారాగార వాస శిక్ష లభించడంలో ఆశ్చర్యం లేదు. ఆ తర్వాత కూడా ఆయన కారాగారంలో ఉన్నాడు. మొత్తం మూడున్నర సంవత్సరాలు శిక్ష అనుభవించాడు. కాని, భారతి 34 రోజులు మాత్రమే కారాగృహంలో ఉన్నా, చాలాకాలం పాండిచ్చేరిలో ఉండి అవస్థలు పడ్డాడు. ఆ యిద్దరూ భారతీయత మూర్తీభవించిన వ్యక్తులు.

భారతి గేయ రచనలో వైవిధ్యం కనిపిస్తుంది. ఆయన జాతీయగీతాలు స్తోత్ర గీతాలు, తాత్త్విక గీతాలు, కన్నయ్య పాటలు, కోయిల పాటలు మొదలైనవి వ్రాశాడు. వచన కవితలు కూడా వెలయించాడు. గరిమెళ్ళ హరిజన పాటలు. స్వరాజ్యం పాటలు, మద్యపాన నిషేధపు పాటలు, సహాయ నిరాకరణోద్యమపు పాటలు, భక్తి కీర్తనలు మొదలైనవి వ్రాశాడు.

అవి బాగా ప్రచారంలోకి వచ్చాయి. ప్రజలను ఆకర్షించాయి. కనుకనే ఆయనను 'ప్రజా పాటల త్యాగయ్య'గా పేర్కొన్నారు ఆచార్య రంగా.

ఆ జాతీయ కవులు తమ దేశాన్ని అఖండ భారతంగా భావించారు. వారి దృష్టిలో సమైక్య భారతమే భారతం. అలాగే భారతదేశీయు లందరు ఏకోదరులని సంభావించారు. మనలో మనకు తగవు లెన్ని ఉన్నా, మన మందరం ఒకటే అని, ఇతరుల జోక్యం అవాంఛనీయమని వారిద్దరూ ఒకేవిధంగా పేర్కొనడం గమనించదగిన అంశం.

*''ఎవరెన్ని చెప్పిన హిందూ దేశవాసు*
*లేక సోదరులై సుండీ*
*అంటూ దోషము మాకు లేదండీ*
*పాప మంటూ చాటుదాము రండీ'' అనీ*
*''అన్నదమ్ముల్లోన బేధ*
*మాడు పెట్టాడండి బాబూ*
*ఉన్నదల్లా ఊడదన్ని*
*ఊరుతున్నాడండి బాబూ'' అనీ*

గరిమెళ్ళ చెప్పగా, భారతి ఇలా పేర్కొన్నాడు.

*''ఎన్నో జాతులు మనలో ఉండేను*
*ఏమది న్యాయం ఇతరుల జోక్యం*
*ఒక తల్లి పిల్లలు కలహించుకున్నా*
*అన్నదమ్ములే వారెన్నటికీ.''*

కాగా, ఆనాటి జాతీయవాదుల భావాలకు భారతి, గరిమెళ్ళ కవుల గీతాలు మణి దర్పణాలనడం చర్విత చరణం.

మరణానంతరం భారతి ప్రతిభను పండితులు, అపండితులు అందరు గుర్తించారు. ఆయనకు నేడు బ్రహ్మరథం పడుతున్నారు. ఇది నిజంగా హర్షించదగిన విషయం. ఆయన పేరుతో ఒక విశ్వవిద్యాలయం వెలిసింది.

మరి, గరిమెళ్ళ సంగతి. మరీ హృదయ విదారకం. ఆయన విస్మృత జాతీయ కవి అయ్యాడు. ఆయన పేరు ఈ తరం వారిలో చాలామందికి తెలియదని చెప్పవచ్చు.

మాతృదేశం కోసం పాటుపడిన భారతి, గరిమెళ్ళ కవులు ప్రభాత స్మరణీయులు. భాష, ప్రాంతం మొదలైన భేదాలు విస్మరించి ఆ జాతీయ కవులను అందరు గౌరవించాలి. అదే మన కర్తవ్యం!

# 18. గరిమెళ్ల ఘనత

నన్నయ, వేమన, గురజాడ, గరిమెళ్ళ, శ్రీశ్రీ ప్రభృతులు తెలుగు సాహిత్యాకాశంలో ధ్రువతారలుగా ప్రతిభాసిస్తున్నారని పేర్కొనవచ్చు. గరిమెళ్ళ అంత ప్రముఖుడా? అని కొందరు ప్రశ్నించవచ్చు. అవునని నా అభిప్రాయం.

ఆదికవి నన్నయ పైకి కనిపించని విప్లవవాది. విష్ణుసన్నిభుడైన వ్యాస మునీంద్రుని భారతాన్ని తెలుగు చెయ్యడానికి పూనుకున్న నన్నయ ప్రయత్నాన్ని ఆనాటి విద్వల్లోకం హర్షించి వుండదు. పైపెచ్చు నిరసించి వుంటుంది. అయినా స్వస్థాన వేషభాషా ప్రియుడైన నన్నయ ద్రావిడ భాషలకు సొంత మనదగిన యతిప్రాసలకు పద్య రచనలో పెద్ద పీట వేశాడు. తమిళ కవులు కూడా యతిప్రాసలు పాటించారు. సంస్కృతంలో వలె, తెలుగు యతి విరామస్థానం కాదు. కాని కన్నడ యతి విశ్రమస్థానం. నన్నయ భాషలో చవి చక్కన గల దేశ్యాలెన్నెన్నో అందాలు దిద్దుకున్నాయి. సంస్కృత పండితుడైనా, నిరంతర జపహోమ తత్పరుడైనా నన్నయ ప్రదర్శించిన తెలుగు భాషాభిమానం ప్రశంసార్హం. ముఖ్యంగా పంచమ వేదాన్ని తెనిగించిన ఆయన తెగువ మాటల కందనిది!

వేమన పైకి కనిపించే విప్లవవాది. పైగా మానవతా దృక్పథం ఆ ప్రజాకవిది. అందువల్ల వేమన భావాలు విప్లవాత్మకములుగా కనిపించడంలో వింత లేదు. వేమన యోగిగా తోచవచ్చు. అయినా ఆయనది ప్రధానంగా విప్లవ వాణి.

ఇక గురజాడ. ఆయన ప్రముఖ మానవతావాది. ఆయన రచనలను అలవోకగా పరిశీలించినా, ఈ అంశం ద్యోతక మవుతుంది. నిజానికి ఈ మానవతా దృక్పథమే ఆయన రచనలకు చిరంజీవిత్వం ప్రసాదించింది. గురజాడ చర్చించిన సాంఘిక సమస్యలు ఈనాడు సజీవంగా లేవు. ఆ నాడు కూడా అవి అన్ని వర్ణాల వారిలోనూ లేవు. అయినా, నేటికీ ఆయన రచనలు ప్రచారంలో ఉండడానికి ముఖ్య కారణం, వాటిలో అంతర్లీనమైన మానవతాదృష్టి. ఒకనాడు ప్రబలంగా ఉన్న సమస్యలు కొంతకాలానికి సమసిపోవచ్చు. కాలగమనంతో పాటు కొత్త సమస్యలు తలెత్తవచ్చు.

నిజమే మరి. స్వేచ్ఛాయుతంగా ఓటు వేసినప్పుడే ప్రజాస్వామ్య విధానం బలపడుతుంది; అది విజయశంఖం పూరించినట్లవుతుంది. ఈ గేయం సమగ్రంగా లభించివున్నట్లయితే, గరిమెళ్ళ భావాలు మరింత స్పష్టంగా మనకు అవగతమై ఉండేవి. ఏమైనప్పటికీ, ఆయనకి ప్రజాస్వామ్యం పట్ల ప్రగాఢమైన విశ్వాసం ఉండేదనీ, డబ్బు ఎర చూపి సామాన్యుల స్వేచ్ఛాభావాన్ని హరించకూడదని ఆయన అభిలషించినట్లూ చెప్పడం సత్యసన్నిహితం. ఓటు చేసే స్వేచ్ఛను ఎవ్వరూ హరించకూడదు. ఇలాంటి ప్రగతిశీలాత్మక భావాలే నవ్య భావాలు. నవ్యభావ విలసితములైన రచనలు చెయ్యాలని ఆయన ఆశించాడు.

దేశభక్తి కవితలు వెలయించినవారిలో కూడా గరిమెళ్ళకు విశిష్ట స్థానం ఉన్నది. రమణారెడ్డిగారు చెప్పినట్లుగా 'దేశభక్తి కవిత మూలాన జైలు శిక్ష ననుభవించిన వారిలో గరిమెళ్ళ సత్యనారాయణ చుట్టిందే శ్రీకారం.' మా కొద్దీ తెల్ల దొరతనం పాట పాడిన వారికే జైలు శిక్ష పడినప్పుడు, తద్రచయితకు శిక్ష పడడంలో వింత లేదు. అనగా అధికారులకు గుండె దడ కలిగించిన పాటలు వ్రాసినవారిలో గరిమెళ్ళ ఆద్యుడే కాక అఖండుడు కూడా.

ఇక గరిమెళ్ళకు గల తెలుగు భాషాభిమానం నిరుపమాన మనక తప్పదు. ఆంధ్ర సరస్వతిని నవ్యాభరణాలతో అలంకరించాలని ముచ్చటపడ్డాడు. అభినవాంధ్ర భారతి కొత్త పుంతలలో నడవాలని ఆశించాడు. ఈ లక్ష్యాలను సాధించాలనే సదుద్దేశంతో ఒక గ్రంథమాల స్థాపించాడు. కొన్ని రచనలు వెలుగులోకి తెచ్చాడు. కష్టాలు, అవమానాలు, దెబ్బపోటులు భరించాడు. తెలుగు మీది అభిమానం కొద్దీ ఆ కష్టాలు మొదలైనవి సహర్షంగా భరించాడు. లబ్ధిగల వృత్తుల కంటె కష్టాలు సహిస్తూ ఉత్తమ గ్రంథ ప్రచురణనే ఆయన అభిలషించాడు. కాని గ్రంథ ప్రచురణ వల్ల ఆయన ఆర్థికంగా ఏమీ సాధించలేకపోయాడు. ఆయన పుస్తకాలు కొన్ని ప్రభుత్వ నిషేధానికి పాల్పడ్డాయి. అవి సంచలనం కలిగించాయి కాని, రచయితకు ఆర్థికంగా లాభదాయకం కాలేదు. ఉదాహరణానికి స్వరాజ్య గీతములు ప్రభుత్వ నిషేధానికి లోనయింది. అంతేకాదు; దానివల్ల రెండేళ్ల

కఠిన శిక్ష కూడా లభించింది. ఈ సందర్భంగా 'జన్మభూమి' వ్రాతను (8-8-1922) పరిశీలించడం అవసరం.

'ఈ ఘోర శిక్షను ఆంధ్రదేశ మెట్లు ఆదరించును? పసిబాలురకు, ప్రచారకులకు, కడకు భిక్షుకులకు కూడ సత్యనారాయణగారి గీతములు కంఠపాఠములుగా వచ్చును. వీధులలో భిక్షుగాండ్రు, గృహములలో బాలికలు, పొలములలో పశువుల కాపరులు ఉత్సాహముతో ఈ పాటలనే పాడుచున్నారు.'

గరిమెళ్ళ వారి గీతాలు వివిధ వర్గాలలో ప్రచుర ప్రచారం గడించి నట్లు నిస్సంశయింగా పేర్కొనవచ్చు. ఆయన ప్రజాకవి. ప్రజా పాటల త్యాగయ్యగా ఆయన్ని అభివర్ణించారు ఆచార్య రంగాగారు. ఈ ప్రశం సకు గరిమెళ్ళ ఎంతైనా అర్హుడు! కాని మన దురదృష్టం. ఆయన రచ నలు కొన్ని తప్ప కడమవి ప్రచారంలో లేవు. ఎన్ని గీతాలు కాల గర్భంలో కలిసిపోయినవో! కాగా లభ్య మవుతున్న గరిమెళ్ళ గీతాలు, వ్యాసాలు మొదలైన వాటిని పుస్తకరూపంగా ప్రచురించి, ప్రచారంలోకి తీసుకురావడం మన విధ్యుక్త ధర్మం. గృహలక్ష్మి, వాహిని, ఆనందవాణి, గ్రామ స్వరాజ్యం మొదలైన పెక్కు పత్రికలలో ఆయన పని చేశాడు. ఆ పత్రికలలోనే కాక భారతి, త్రిలిఙ్గ, కృష్ణా పత్రిక మొదలైన పత్రికలలో కూడా అయన రచనలు ఎన్నో వెలువడ్డాయి. ఈ వివిధ రచనలను అధ్య యనం చేసినప్పుడు గరిమెళ్ళ వారి ఆత్మీయత ఇంకా స్పష్టంగా తెలియ వస్తుంది. విశ్వనాథవా రన్నట్లు భారతీయత ఆంధ్రత్వం తెలుగు నుడికారం మూర్తీభవించిన మహనీయు డాయన!

వివంగుణ విశిష్టుడైన గరిమెళ్ళ పైకి కనిపించని విప్లవవాది. అభ్యుదయవాది. జాతీయవాది. సాహిత్యంలో నవ్యతను ఆకాంక్షించిన వాడు. అసమానతలు నిరసించినవాడు. సత్యాహింసలలో పరిపూర్ణ విశ్వాసం గల దేశభక్తుడు. ముమ్మూర్తులా గాంధీజీ శిష్యుడు. కనుకనే గరిమెళ్ళ తెలుగు సాహిత్యాకాశంలో ప్రతిభాసిస్తున్న ధ్రువతార!

ఇక గరిమెళ్ళ ఘనతను రచయితలు కొనియాడిన తీరుని పరిశీ లిద్దాము.

తెలుగు దేశంలో సుబ్రహ్మణ్యభారతి అని చెప్పదగినవాడు సత్యనారాయణగారు.

—వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులు.

(గరిమెళ్ళ) ఆంధ్రుల హృదయ క్షేత్రాలలో శాశ్వతస్థానం, ఆంధ్ర సారస్వతంలో మృతి రహితమైన పేరు సంపాదించుకున్నారు ...ధన్యజీవి! సమస్త ఆంధ్రుల జిహ్వాగ్రాలలో వున్న గీతానికి నిర్మాత! భావి ఆంధ్రులు గీతగోవింద కర్తనువలె నిరంతరం గానం చేస్తూ వుంటారు.

—కురుగంటి సీతారామయ్య.

నిజానికి ఈ సర్వ కవిత్వమునకు ప్రధానమైనవాడు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారని చెప్పవలయును. ఆయన యొక్కడే యీ మహాంధ్ర స్వాతంత్ర్యోద్యమము కవితారూపమున వెడలినదన్నచో, నా సరస్వతికి రూప మిచ్చినవాడు. ఆయన పండితుడు. సంగీత సాహిత్యములందు గొప్ప సమర్థుడు. కాళిదాసు మహాకవి యైనచో నాయన రచించిన కావ్యములలో నభిజ్ఞానశాకుంతలము పరమోదాత్తమైనచో, నితని మహాకవితాధారలో మా కొద్దీ దొరతనము అన్న పాట శాకుంతలము వంటిది .. ఆయనను జాతీయ గేయకవితా సార్వభౌము డనుట తప్పు. ఆయన జాతీయ కవి సార్వభౌముడు. ..భారతీయత, ఆంధ్రత్వము, తెనుగు నుడికారము కరుడుగట్టిన మహాపురుష డాయన....ముందాయనను చెప్పి తరువాత నింకొకరిని చెప్పవలయును.

—విశ్వనాథ సత్యనారాయణ.

....ఇంతటి అర్హతాపత్రమును విశ్వనాథవారి నుండి పొందిన గరిమెళ్ళవారు ధన్యులు.

—దాశరథి.

(శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ కవి మా కొద్దీ తెల్ల దొరతన మను గేయం, దండాలు దండాలు భరతమాత అనునవి ఆయన్ని కవిసార్వభౌముణ్ణి చేశాయని దాశరథి చెప్పారు—అని డాక్టర్ గూడూరి నమశ్శివాయగారు తమ లేఖలో పేర్కొన్నారు.)

....మహాకవులు పూరు మూలల యూరు పేరు లేని యుపాధులలో అజ్ఞాత గర్భాల నుండి పైకుబికి, జీవమణులుగా ప్రకాశించి, స్వప్రకాశ

మున నిలిచి కీర్తిచంద్రికలు విరజిమ్ముచూ భావాంబరమున ధ్రువతారలుగా భాసిల్లుతారు. అట్టి సుకృత జీవులలో కీ. శే. గరిమెళ్ళ సత్యనారాయణ గారొకరు ..ఆయన ఒక జానపద గేయ ప్రబోధనాయకమణి. తెనుగు నాట జాతీయ కవిత్వమునకు ఒరవడి పెట్టిన ప్రముఖ కవి గణమున మన గరిమెళ్ళ వా రొక మణిపూస. వారి దొక నూత్న పంథా.

—గురుజాడ రాఘవశర్మ.

కొందరు తమ కవితలతో ఆనాడు (స్వాతంత్ర్య సమరం జరిగిన రోజుల్లో) ప్రజలలో చైతన్యం కలిగించారు. అట్టి వారిలో శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగా రగ్రగణ్యులు... సత్యనారాయణ దేశం కోసం త్యాగం చేసి, నాయకుల ప్రజల గుర్తింపులేక తిండికి కష్టపడుతూ ఆత్మాభిమానంతో జీవితాన్ని నడిపి దేహాన్ని చాలించారు.

—మల్లెల శ్రీరామమూర్తి.

తమిళులు సుబ్రహ్మణ్యభారతిని బతికున్న రోజులలో గాకపోయినా చచ్చిన పిమ్మటేనా గొప్పవాడిని చేసేరు. తెలుగువారు తమ సుబ్రహ్మణ్య భారతికి ఏమి చేసేరు? చలవరాతి విగ్రహాన్ని స్థాపించినా ఆయన ఋణం తీరదే!...తెలుగువారు సృష్టించిన గొప్ప రాజకీయ గేయకవి గరిమెళ్ళ సత్యనారాయణగారు! ఆయన నేటి కవులకు ఆదర్శం!....జాతీయ గేయకవి సార్వభౌముని ఆత్మ శాంతించుగాక!

—టేకుమళ్ళ కామేశ్వరరావు.

దేశనాయకుల ఉపన్యాసాలకంటే కూడా ఆయన (గరిమెళ్ళ) రాసిన 'మా కొద్దీ తెల్ల దొరతనము' అనే పాట ఎంతగా ప్రజలను జాగృతం చేసిందో ఉద్యమంలోకి దూకే తెగువను వారికి కలుగజేసిందో, ఆ రోజుల్లో జీవించినవారికి అనుభవములో ఉన్న విషయం ..ఏ స్వాతంత్ర్యం కోసం ఆయన అనేక త్యాగాలు చేసి, అనేకులకు తన పాటలతో, రచనలతో ఉద్బోధించారో ఆ స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత జాతి అతని త్యాగాన్ని గుర్తించకపోవడం నిజంగా చాల దురదృష్టం.

—తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

(గరిమెళ్ళ) ప్రజాపాటల త్యాగయ్య!

—ఆచార్య యన్. జి. రంగా,

(గరిమెళ్ళ) మహాత్ముని శంఖారావం విని చదువు మాని అసహాయోద్యమంలో ప్రవేశించారు. ఉద్యమ ప్రచారం బాగా చేశారు. గేయ కవిత్వంలో దిట్ట .తమిళనాట సుబ్రహ్మణ్యభారతి వలె ఆంధ్ర దేశంలో ప్రచారం చేసిన వా రీయన. ఇద్దరూ ఆర్థికంగా చాలా శ్రమపడ్డారు. విశేష మేమంటే సుబ్రహ్మణ్యభారతి చనిపోయాక ఆయనకు స్మారకభవనాలు, ప్రశంసలు, కీర్తి దేశవ్యాప్తమయాయి. సత్యనారాయణగారితోపాటు ఆయన పేరూ కీర్తీ సమాధి అయాయి.

—బులుసు వేంకటరమణయ్య.

. సత్యాగ్రహులు ఎల్లవేళలా మా కొద్దీ తెల్లదొరతనము దేవ— అనే పాటలు పాడేవారు. ఈ పాటకు ఆ రోజుల్లో ఎక్కువ ప్రచార ముండేది. నూరు చరణాల పాట యిది. మా కొద్దీ తెల్లదొరతనము— అంటూ పాట పాడుతూ వీధులలో తిరుగుతూంటే లాఠీచార్జి చేసేవారు. ఒకనాడు కొన్ని లాఠీ దెబ్బలు నాకు తగిలాయి.

—గూడూరి నమశ్శివాయ.

దేశభక్తి కవిత మూలాన జైలు శిక్ష ననుభవించిన వారిలో గరిమెళ్ల సత్యనారాయణ చుట్టిందే శ్రీకారం ...నిజాయితీకి నిర్భీతికి గరిమెళ్ళ సత్యనారాయణ పేరు మారు పేరైందంటే—మా కొద్దీ తెల్ల దొరతనము— దేవ మా కొద్దీ తెల్లదొరతనము పల్లవితో 39 చరణాలున్న పెద్ద పాట జనం గుండెను పట్టి సర్కారువారి గుండెను కంపింపజెయ్యటమే కారణం... యీ ఉజ్వల వ్యక్తిని యిన్నిటిలో ఆదుకున్నదేది! నిర్లక్ష్య నిరాదరణలు జాతి సుగుణాలా? కృతఘ్నత ఘనతా?

—కె. వి. రమణారెడ్డి.

మా కొద్దీ తెల్లదొరతనము అనే ప్రసిద్ధ గీతం రచయితగా మా సబ్ ఎడిటర్ల మందరం ఆయనను గౌరవించే వాళ్ళం.

—నండూరి రామమోహనరావు.

అగ్ని సదృశమైన స్వాతంత్ర్యోద్యమానికి గరిమెళ్ల ఝంఝామారుతం. ఆయన కవిత్వం ఆజ్యం.... ఆయన కాలంలో ఆయనంతటి జాతీయ కవి మరి లేడు అనిపించుకున్నవాడు గరిమెళ్ళ సత్యనారాయణ గారు.

—మద్దూరి సుబ్బారెడ్డి.

1950 ఆ ప్రాంతాల గరిమెళ్ళను మైలాపూరులో వీరభద్రయ్యర్ కోయిల్ వీధిలో చూసినట్లు గుర్తు. ఆయన స్ఫురద్రూపి కాడు. కంటి చూపు తగ్గి, ఆరోగ్యం అంతంతగా వున్న వ్యక్తిలా కనిపించారు.

—యన్నార్ చందూర్.

స్వాతంత్ర్యోద్యమ కవుల్లో గరిమెళ్ళ సత్యనారాయణగారిది విశిష్టమైన స్థానం.

— రాచపాళెం చంద్రశేఖరరెడ్డి.

గరిమెళ్ళ వారి గేయాలన్నీ జాతీయ వీరరసంతో తొణికిసలాడుతూ పాఠక జనాన్ని ఉద్రూత లూగించినవి.

—శావినూతల శ్రీరాములు.

....ప్రజల హృదయాలను కుదిపే చరణా లెన్నో ఇందులో (మా కొద్దీ తెల్లదొరతనము పాట) ఉన్నాయి. ఆనాడు తెలుగునాట ప్రతినోటా ఈ పాట మార్మోగేది. ఇంతటి వీరభక్తి గేయాన్ని రచించిన గరిమెళ్ళ చివరకు కటిక దారిద్ర్యంతో 'దేహి' అంటూ జీవించవలసివచ్చింది. ఈ దేశభక్తుడే తెలుగువాడు కాకుండా వుంటే ఈ దుస్థితి దాపురించేది కాదేమో! అయినా గరిమెళ్ళ తెలుగువాడైనందుకు గర్వించాల్సిందే!

—ద్వా. నా. శాస్త్రి.

జాతిపితను గూర్చిన గేయాలను గూర్చి పరామర్శిస్తున్నప్పుడు మొట్ట మొదట జ్ఞప్తికి వచ్చే రచయిత శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు.... ఈయన వ్రాసిన 'స్వరాజ్య గీతములు' రెండు మూడు భాగములు కూడ ప్రసిద్ధము లైనవే....ఈ దేయ సంపుటులు మూడింటిలోను గరిమెళ్ళ వారి దేశాభిమానం వ్యక్త మవుతుంది.

—మొదలి నాగభూషణశర్మ.

# 19. రాజకీయాల నుంచి కవిత్వ విషయాలు

"రాజకీయాల నుంచి కవిత్వ విషయాలు ఎంచుకోవాలి కవులు." ఈ మాటలు గరిమెళ్ళ సత్యనారాయణగారివి. 1927 లో ఆయన పేకు మళ్ళ కామేశ్వరరావుగారితో అన్న మాట లివి!

గరిమెళ్ళ సూత్రప్రాయంగా చెప్పిన ఈ మాటల్లో గంభీరార్థం ఇమిడి ఉంది. కవులు–అందులోనూ జాతిని ముందుకు నడిపించదలచిన కవులు–కేవల కల్పనా కథలతో తృప్తిపడక జాతి భవిష్యత్తుని తీర్చిదిద్దు తున్న రాజకీయాల నుంచి ఇతివృత్తాలు స్వీకరించాలి. ఇలా స్వీకరించ డానికి కవికి ధైర్యం కావాలి. రాజకీయాల స్వరూప స్వభావాలు బాగా తెలిసి ఉండాలి. రాజకీయ విషయాలంటే వర్తమాన జగతికి సంబంధించిన విష యాలు. అంటే నడుస్తున్న చరిత్ర. మానవుల చిత్తవృత్తులు విభిన్నాలు కనుక, సమకాలిక విషయాల పట్ల ఏకవాక్యత కుదరడం అంత సులభం కాదు.

సంఘం ఎప్పటికప్పుడు మార్పులకు లోనవుతూ ఉంటుంది. మార్పు సహజసిద్ధం. మార్పు లేని సంఘం మృత్పిండం వంటిది. సంఘంలో ఎలా మార్పులు ఏర్పడుతూ ఉంటాయో, రాజకీయ విషయాలలోనూ మార్పు ఉండకమానదు. అంటే స్థిరత్వం ఉండదు. అస్థిరమైన విషయాలను కళాత్మకంగా అభివర్ణించడం కష్టమైన విషయమే.

వివిధ భాషల్లోనూ మన జాతీయ కవులు పేర్కొనదగిన రచనలు చేశారు. కాని జాతీయమోద్యమం చప్పబడడంతో ఆ జాతీయ వాఙ్మయం కాలక్రమాన అనాదృత వాఙ్మయ మయింది. పైపెచ్చు ప్రచార సాహిత్యం అనే పేరు సంతరించుకుంది. అందువల్ల ఆ జాతీయ కవులు విస్మృత కవు లయ్యారు. అయినా నేటికీ సుబ్రహ్మణ్యభారతి, గరిమెళ్ళ సత్యనారాయణ, బసవరాజు అప్పారావు ప్రభృతుల రచనలు చదువుతుంటే మనకు నూత నోత్తేజం కలుగుతుంది. వారు ఆనాటి రాజకీయాల నుంచి ఇతివృత్తాలు స్వీకరించారు. అయినా కొన్ని రచనల్లో కవిత్వాంశం ఉండడంవల్ల అవి నేటికీ నిలిచి ఉన్నాయి. కేవలం ప్రచారాంశం ఉన్నవి తెరమరుగున పడి పోయాయి.

గాంధీజీని ప్రస్తుతించని జాతీయ కవి లేడనడం సత్య సన్నిహితం. ఆనాటి రాజకీయ లోకంలో ఆయన ప్రముఖుడు. ఆయన సిద్ధాంతాలు మొదలైన వాటిని వస్తువులుగా గ్రహించి వివిధ భాషా కవులు రచన లెన్నో చేశారు. అవి ఈనాటి వారికి నచ్చక పోవచ్చు. కాని బసవరాజు అప్పారావుగారు 'మా గాంధీ' గేయం నేటి పఠితను అనాయాసంగా ఆకర్షించే విధంగా సంతరించారు. ఆయన చేసింది గాంధీజీ బాహిరమైన వర్ణన. కాని ఆ వర్ణనలో కవిత్వాంశం నిండి ఉంది. గాంధీజీ కొల్లాయి కట్టాడనడం జగద్విదితం. కాని వెన్నపూస మనస్సు, కన్నతల్లి ప్రేమ అని కవి అన్నప్పుడు గాంధీజీ ఆంతరిక స్వరూపం కళ్ళ ఎదుట సాక్షాత్కరిస్తుంది. మనస్సులోని మెత్తదనాన్ని వెన్నపూస వ్యక్తీకరించినట్లు మరొక వస్తువు తెలియజేయలేదు. అలాగే ప్రేమ అన్నప్పుడు మాతృప్రేమను మించింది మరొకటి లేదు. ఆయన నాలుగు పరకల పిలక నాలుగు వేదాల నాణ్య మెరిగిన పిలక అట! మూర్తీభవించిన వేదసారం గాంధీజీ అన్న మాట! ఆయనలోని ఆధ్యాత్మిక విభూతిని ఈ పదబంధం చక్కగా తెలియ జేస్తున్నది. కనుకనే ఆయన పండంటి ముఖం మీద బ్రహ్మతేజస్సు! బోసి నోరు విప్పితే ముత్యాల వంటి మాటలు; చిరునవ్వులో వరహాల వర్షం! ఈ గేయం ఆ నాళ్ళలోనే కాదు ఈనాడు కూడా పఠన యోగ్యంగా ఉంది.

ఆనాటి రాజకీయ విషయాలకు అద్దం పడుతున్న మా 'కొద్దీ తెల్ల దొరతనము' గేయం నేటికీ పఠనయోగ్యంగా ఉండడానికి కారణం, అందులో కవిత్వాంశం నిండి ఉండడమే. చెప్పదలచిన విషయాన్ని గరిమెళ్ళ హృదయాన్ని స్పందించేలా తెలియజేశాడు. 'మా కొద్దీ తెల్ల దొరతనం' అన్న పదబంధంలో అయస్కాంత శక్తి ఏదో ఉంది. పైగా కవిహృదయాన్ని అది వ్యక్తం చేస్తున్నది. పన్నెండు దేశాలు పండుతున్నా పట్టెడన్నం లోపం, నోట మట్టి కొట్టిపోతాడు, కుక్కలతో పోరాడి కూడు తింటామండి—ఈ వాక్చిత్రం ఆనాటి దుర్భర పరిస్థితిని మనస్సుకి హత్తు కునేలా తెలియజేస్తున్నది. కుక్కలతో పోరాడి కూడు తినడ మన్నది హృదయవిదారకమైన ఖేదం.

జాతీయోద్యమం ముమ్మరంగా సాగిన రోజుల్లో రాట్నలక్ష్మిని గురించి వివిధ భాషా కవులు ఎన్నో గేయాలు వెలయించారు. ఆనాటి రాజకీయ విషయాల్లో రాట్నం అధిక ప్రాధాన్యం సంతరించుకుంది. కనుక ప్రచారాంశం ఆ విషయంలో చోటు చేసుకోవడం ఆశ్చర్యం లేదు. అలాంటి విషయాన్ని కూడా గరిమెళ్ళ సత్యనారాయణ కవిత్వాంశంగా తీర్చి దిద్దడం గమనించదగింది. నవ్వు రంజిల్లు మోముతో రాట్నలక్ష్మి పాడుతోందనీ, అందువల్ల కరవు పాడుతున్నదనీ, దానిగుండా స్వేచ్ఛ తిరుగుతున్నదనీ, అది తెల్ల దొరల తేజాన్ని కూల్చే జెండా అని ఆయన తెలియజేశాడు. రాట్నం కనక తిరిగితే కరవు మటుమాయ మవుతుందని మన నమ్మకం. రాట్నం వల్ల స్వాతంత్ర్యం లభిస్తుందనీ, తెల్లవారి తేజం దానివల్ల తొలగిపోతుందనీ గరిమెళ్ళ–

*'స్వేచ్ఛ తిరుగుచున్నది దానిగుండా*
*ఆ దొరల తేజం బెల్ల తూల్చు జండా.'*

అని చెప్పడం హృద్యంగా ఉంది. ఈ చరణాలు చదివినప్పుడు, రాట్నానికున్న ప్రాశస్త్యం పఠితకు అనాయాసంగా అవగత మవుతుంది. ఇక్కడ రాట్నం స్వాతంత్ర్యానికి ప్రతీకగా చెప్పబడింది.

దేశ కాల పరిస్థితుల్లో మార్పులు ఏర్పడడం సహజం. ఈ మార్పుల్ని తోసి రాజనడం వివేక మనిపించుకోదు. అదీకాక ప్రస్తుత పరిస్థితుల్లో రాజకీయ విషయాలకూ, రాజకీయేతర విషయాలకూ మధ్య ఉన్న భేదం కొద్దిపాటిది. రాజకీయాలకు రోజు రోజుకీ ప్రాధాన్యం ఎక్కువవుతోంది. రాజకీయ విషయాల ప్రభావం ప్రతి రంగంలోనూ కనిపిస్తున్నది. కాగా గరిమెళ్ళ సత్యనారాయణగారు పేర్కొన్నట్లు కవులే కాదు రచయితలు కూడా రాజకీయాల నుంచి సాహిత్య ఇతివృత్తాలు ఎంచుకోవలసిన అవసరం బాగా కనిపిస్తోంది. సాహిత్య మంటే కేవల కల్పనా కథలు కాదు. అయితే రాజకీయ విషయాలను పురస్కరించుకుని ప్రచార సాహిత్య సృష్టికి కవులు ప్రయత్నించడం సమంజసం కాదు. ఆ ప్రచారాంశాలను సైతం సాహిత్యంగా మలచగలిగిన నేర్పు రచయితలకు ఉండాలి. అలా వెలుగులోకి వచ్చే సాహిత్యం సామాన్య పాఠకుల్ని బాగా ఆకర్షించ గలుగుతుంది.

# 20. గరిమెళ్ల సూక్తులు

దేశభక్తుడూ, గాంధీజీ అనుచరుడూ కావడంవల్ల, గరిమెళ్ళ గీతాలు దేశభక్తి ప్రబోధాత్మకంగానూ గాంధీజీ సందేశ ప్రధానంగానూ కనిపించడంలో ఆశ్చర్య మేమీ లేదు. వస్తుతః ఆయన కవి కనుక ప్రచారాంశాలు సైతం ఆయన చేతిలో కమ్మని సూక్తులుగా అందాలు దిద్దుకున్నాయి. జాతీయోద్యమ కాలంలో వెలుగులోకి వచ్చినా, ఉదాత్త భావగర్భితాలు కావడం వల్ల, ఆ సూక్తులు నేటి పాఠకుల్ని కూడా అలరించేవిగా ఉన్నాయి. వాటిని మననం చేసుకోవడం మన కర్తవ్యం. ఆ దృష్టితో గరిమెళ్ళ వెలయించిన గీతాలను ఇతర రచనలను పరిశీలించి, కొన్ని సూక్తుల్ని ఉదాహరిస్తున్నాను.

(భారత జననీ!)
మూడు భాగ్యములకు నెల్ల మహితకరవు.
యుద్ధ శకము మాన్పునట్టి బుద్ధి శాలివి.
ధర్మ దేవుడె మా రక్ష సుండీ.
ప్రజల ప్రేమయె మాకు దిక్కండీ.
మేము ఐకమత్యము తోడ అలరారుతాము.

ఎవరెన్ని చెప్పిన హిందూదేశవాసు లేక సోదరులె సుండీ; అంటూ దోషము మాకు లేదండీ, పాప మంటూ చాటుదాము రండీ.

స్నాన ధ్యానము చేసి రామకృష్ణ యంచు దేవుడి గుడిలోకి రండి.
(గాంధి) స్వేచ్ఛ మొలిపించె మన శక్తి చేత.
నిర్మలత్వ మాత్మను పొందండి.
బలము దుర్బల మను భేద మెచ్చట లేదు.
కత్తిని నిరసించు.

నిమ్నజాతుల నెత్తుమోయి, వారు నిరసించిన యెడల నిక నీకు గోయి.

కోర్టు సంబంధము విడురా, ఆ కూపంబు లోపల కూలిపోకుమురా.

రాటము గొని యారాట ముడిగి పోరాటము లేకను పొంది సుఖాంతము.

గ్రామోద్ధరణకు జనులారా ఇక గడగుదమండీ,

పడిన వృత్తులను పైకి తీయుదము.

పంచమ జాతిని జనులారా మన పక్షము గొందము.

మత మనగను మన యాత్మోన్నతికే.

హస్త నిపుణతను ధ్వంసము చేసిన పరుల చేతలకు బానిస లగుదుము.

ప్రేమ చేతనే పగతుని గెలుతుము.

రక్తపాతములు రాక్షస మత మగు.

సత్య మహింసలు జనులారా మన శస్త్రాస్త్రములు; శాంతము తపనో జనులారా అది శ్రేయ మన్నిటికి.

కత్తి భయము మాని, పశు శక్తి నూత మాని, ఆత్మబలము బూని గైకొనుడి మాతృముక్తి.

దేశ కళల నెల్ల తేజరిల చేదాము.

పాటకజనమునకు పనులు కల్పిద్దాము.

ఉత్తమ విద్యల నుద్ధరించుదాము.

నే చెప్పినదల్లా విని తర్వాత తప్పులు ఉంటే తిట్టారోరయ్యో.

మానవజన్మం బెత్తినావు మనిషి రక్తం త్రాగకురో.

పొరుగువాని మాంసం తింటే పొట్ట పగిలిపోతుందో.

వాని (గాంధి) మాట బ్రహ్మ మాట.

కల్లు త్రాగి నీ యిల్లు నెల్ల గుల్ల చేయకు.

నీ వళ్ళు రోగాల కెల్ల వడ్డి కీయకు.

మాన్యాలు భోగాలు మునుజు లందరి కబ్బు మార్గాలు వెతకాలి.

కర్షకులు కార్మికులు కలవండి వేగ.

అందరము మేలుకోవాలి.

ఛేదించవయ్యో అసమాన భేదముల

నీది నాదనెడి అన్యాయంబు వీడు.

మనము మన దనెడి సద్గానంబు పాడు.

స్వాతంత్ర్యవాంఛ అను తేజస్సుతో మిళితములు కాని కవితా

సక్తియు, సాహిత్యాభిమానమును కేవల వ్యసనములును, విద్యాభిరుచి యొక విలాస మాత్రమును, దైవ భక్తి యొక బూటకము.

*        *        *

ప్రఖ్యాత కావ్యములను భాషాంతరీకరించునెడల మూలమునకు సరిగ నుండుట మొదటి యావశ్యకతయు; జాతీయతయు సౌందర్యమును చెడకుండుట రెండవ లక్షణముగ మాత్రమే యై యుండవలయు ననియు పెక్కురి విశ్వాసమును నా విశ్వాసమును.

*        *        *

ఈ కాలములో సద్గ్రంథ రచనము, ప్రచురణము, విక్రయము మొదలగునవి యెల్లయు ఎంత కష్టసాధ్యము లైనవో ఆంధ్రు లెల్లరును గ్రహించవలసియున్నది.

*        *        *

ఏది యెట్లున్నను కార్యము కొనసాగించనిదే విరమించవలెనను నుద్దేశ్యము లేదు.

*        *        *

లేమి నీమమును చెరుస్తుంది.

*        *        *

మన భారతదేశము వృద్ధికి రావలె నన్న మనయొక్క వివిధ జాతి మత భేదముల కంతర్గతమైన సర్వసాధారణమైన యుత్కృష్ట ధర్మమేదో గుర్తించి యోగులు సాధకులు కవులు ప్రచారకులు నాయకులు ఆ తీగను కదిలించి ఆలాపన ప్రారంభించి పాట సాగించితే తక్కిన భౌతిక విభూతులన్నీ వాటంతట అవియే దాని చుట్టూ మూగుకుంటూ వస్తాయి.

*        *        *

గొప్ప కార్యం తలబెట్టుకున్నప్పుడల్లా ముందు ఇండియా గవర్నమెంటు బడ్జెట్టులాగ ఒక ప్రణాళిక వుండవలసినదే.

*        *        *

మిల్లు పరిశ్రమలు హెచ్చితే గృహ పరిశ్రమలు మూల పడతాయని గత రెండు వందల సంవత్సరముల నుండి జరుగుతున్న పారిశ్రామిక విప్లవమే తెలియ పరుస్తుంది.

*        *        *

సంఘ జీవనమునందాసక్తి పుట్టి వారి యాశలు ఆశయముల యందు మన కభిరుచి జనించి వారి తళుకులు బెళుకులు హొయలు యొయ్యారములు నవ్వులు పరియాచకములు విచారములు కష్ట సుఖములు మొదలగు వానియందు సానుభూతి జనించి, ఆ అచ్చటలను ముచ్చటలను ఆనంద దాయకముగ వీలయినంతవరకు వారు మాటలాడుకొనే శబ్దార్థాన్యలంకార రహితమగు శైలిలో చెప్పెడి ప్రశంసలకే సాంఘిక నవల లని పేరు.

సాంఘిక నవల యనిన కథను చిత్రించుట.

* * *

శైలి కవికి నైజమై యుండవలెను కాని శ్రమపడి పుస్తకములు వెదకి కష్టమై అపరూపమైన ప్రయోగముల నేర్చి గ్రంథములో జొనుపకూడదు. మనము తర్జన భర్జనము చేసి సరియైన సమాధానమునకు రావలెను గాని తొందరగా గాని, అభిమాన పురస్సరముగా గాని యేదో యొక నిశ్చయము చేసుకొనిన్నీ వ్రాతలు వ్రాయ మొదలుపెట్టినచో అవి సత్య దూరములు కాక మానవు.

* * *

మన చిత్తవృత్తులను మరలించుకొని, ప్రజలకు సత్యమును చూపించగల నిగ్రహశక్తి మనము సముకొననిదే మన జాతీయాభివృద్ధి ప్రారంభము కాదు—ప్రస్తుతము దేశ మందుకు సంసిద్ధముగ లేదు.

* * *

పాండిత్యమునకును వివాదమునకును నిక్ష్వాకుల నాటి నుండియు చుట్టరికము.

* * *

దేశాభిమానమదేను నెమలీ-తత్త్వ
దేవతను చూపగల దివ్వే నెమలీ.

* * *

ఈ యుగము తిరుపతి వేంకట కవీశ్వరుల కవిత్వములతోను, వీరేశలింగం పంతులుగారి వచనములతోను ధర్మవరం కృష్ణమాచార్యులుగారి నాటకములతోను ప్రారంభించుచున్నదని చెప్పవచ్చును.

* * *

కావ్యరచన ముక్తిప్రద మను భావము పోయినది.

*　　　*　　　*

ఇది గద్యయుగము, వ్యవహార యుగము. విద్యా పాండిత్యముల యుగము కాదు.

*　　　*　　　*

ఇప్పుడు గద్యము చేయవలసిన పనులు హెచ్చినవి. చారిత్రము నెల్లను పరిశోధించి తిరగవేసి వ్రాయవలెను—వృక్ష శాస్త్రము, శరీర శాస్త్రము, పదార్థ విజ్ఞాన శాస్త్రము, రసాయన శాస్త్రము మొదలగు శాస్త్రములను బాలురకును ప్రౌఢులకును తెలియజేయవలెను. దేశకాల పరిస్థితులను గూర్చి విమర్శనములు చేసి ప్రజల నుద్బోధించవలెను. ఎక్కడెక్కడి వింతలను విడ్డూర్యములను పత్రికలను వ్రాసి లోకమునకు చాటవలెను.

*　　　*　　　*

నవల యనగా ప్లాటు నొకటి పెట్టి కథ నల్లివేయుట కాక సమకాలిక సాంఘిక జీవనమును చిత్రించుటయై యున్నది. అట్టి నవల లొకటి రెండు తప్ప ఆంధ్ర జీవనమును చిత్రించునవి లేనే లేవు.

*　　　*　　　*

వార్తా పత్రికలు కేవలమును వార్తావాహకములు మాత్రమే కావు. యుక్తాయుక్త విచక్షణము, సమహితశీలము, దేశాభిమానము, స్వాతంత్ర్యాకాంక్ష, నిర్భీరుత్వము మొదలగు గుణములు గల సంపాదకులచే నడుపబడుచుండు పత్రిక లనతికాలంలో దేశములో నాచార్య పీఠము వహించి, ప్రజలకు విధి నిషిద్ధములను చూపుచు, క్లిష్ట సమయములయందు అనుసరణీయ మైన సలహాల నీయగల హక్కును సంపాదించుకొనుచున్నవి.

*　　　*　　　*

మొన్న మొన్నటి వరకును గ్రంథ విమర్శన మనిన ఒప్పులు మూని వేసి, తప్పులు చూపించుట అనియే అర్థము. అవియును వ్యాకరణము తప్పులు, లక్ష్యములు లేని ప్రయోగములు చేసిన తప్పులు, కవిత్రయమునకు విరుద్ధ మైన తప్పులు.

*　　　*　　　*

విమర్శకుడు కేవలమును వ్యాఖ్యాత కాడు. కవి హృదయ గ్రహణ విద్యాధురీణుడు. ఇది (విమర్శ) నిజముగా నొక కళ.

* * *

(శాస్త్ర రచనకు) కావలసినది భాషా పాండిత్యము కాదు. శాస్త్ర పాండిత్యము. భాష సుందరముగను మనోరంజకముగను నుండవలసిన పనిలేదు. తెలుగు మాటలాడుటలోను వ్రాయుటలోను కాస్త ధోరణి యున్నచో చాలును. కాల క్రమేణ దానికి కొంత పరిభాష యేర్పడి, ధోరణి నలిగిపోయి ప్రవాహము వలె నుపన్యసించుటకు వీలిచ్చును.

* * *

...శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి సిద్ధాంతములు, తర్కములు, ప్రచురణములు, ప్రయత్నములును మిక్కిలి శ్లాఘ్యము లనుటలో సందేహము లేదు.

* * *

....కాల లక్షణమును భాషా తత్త్వమును గుర్తెఱిగి, వారి కందరికిని చేతులు సాచి స్వాగత మొసంగుట ఉదార నీతి గల విద్వాంసులకు సుభూషణము.

* * *

ఆదర్శ జ్ఞానము వాత్సల్యరసము నేనాటికిని జయింప జాలదు.
జాతి పులుగుఁ జూచి-మదిలో
సహన మొందవేమే
ప్రీతి చూపుచున్నా-అన్యులు
ప్రేమ నీయగలరే?

* * *

పొల్లు మాట లనకు – ఈశ్వరు
పూజ లెపుడు విడకు.
కల్లలాడఁబోకు – అన్యుల
కలిమి కేడ్వఁ బోకు.

## అనుబంధం

# లఘు వివరణ

అచ్యుతరావు, చేకుమళ్ళ (1880–1947) : సుప్రసిద్ధ వాఙ్మయ విమర్శకులు. గ్రంథకర్తలు. అధ్యాపకులు. ప్రతిభా వ్యుత్పత్తులు సరిసమానంగా గలవారు. ఆయన రచనలలో విజయనగర సామ్రాజ్య మందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర (రెండు భాగాలు) అమూల్య మైనది. ఆంగ్లంలో పింగళి సూరనార్యుని జీవితం వ్రాశారు. 'కవి జీవిత విశేషాలను, కవికృత కావ్య విమర్శలను సమానముగా పర్యాలోకించుచు సారస్వత గ్రంథమును రచింప ప్రయత్నించిన ఆంధ్రులలో ఒక విధముగా ప్రథము' లని ఆయన్ని త్రిలిఙ్గ పత్రిక ప్రశంసించింది.

అప్పారావు, గురజాడ (గురజాడ వెంకట అప్పారావు, 1861–1915): నవ్యాంధ్ర సాహిత్య నిర్మాతలలో ప్రముఖులు. వ్యావహారిక భాషకు సాహిత్యంలో గణనీయ మైన స్థానం కల్పించిన విశిష్ట రచయిత. కన్యాశుల్కం, పూర్ణమ్మ, దేశమును ప్రేమించుమన్నా మొద లైనవి ఆయన రచనలలోనే కాక తెలుగు సాహిత్యంలోనే ఆణిముత్యాలు. సాంఘిక నాటక రచనకు మార్గదర్శి.

అయ్యరు, వ. వె. సు. (వి. వి. యస్. అయ్యరు, 1881–1925) : తమిళ కథానికా రచనకు గట్టి పునాదులు వేశారు. తమిళ కథానికకు పితామహులుగా భావించబడుతున్నారు. సుప్రసిద్ధ దేశభక్తులు. సాహితీవేత్త. బహు భాషాభిజ్ఞులు. లాటిన్ మొదలైన పది భాషలలో పండితులు. విప్లవ వాది. మంగైయర్ క్కరసియిన్ కాదల్, ది మాక్సిమ్స్ ఆఫ్ తిరువళ్లువర్, కంబరామాయణ–ఎ స్టడీ మొదలైనవి ఆయన ప్రసిద్ధ రచనలు.

కామేశ్వరరావు, చేకుమళ్ళ (1907) : ప్రసిద్ధ వాఙ్మయ విమర్శకులు. చేకుమళ్ళ అచ్యుతరావుగారి జ్యేష్ఠ పుత్రులు. పాఠశాలల జూనియర్ డిప్యూటి ఇన్‌స్పెక్టరు ఉద్యోగానికి 1950 లో తిలోదకా లిచ్చి పత్రికా రచయితగా కుదురుకునేందుకు మదరాసు వచ్చారు. సాంఘిక, విద్యా రంగాలలో సంస్కరణ వాది. వ్యావహారిక భాషా రచనకు కొన్ని

నియమాలు ఉండాలని ఆశించడమే కాక, ఆ విషయమై రచన కూడా చేశారు. ఖండకావ్యాలు, చిన్న కథలు, బాలల గేయాలు ఎన్నో సంతరించారు. నా వాఙ్మయ మిత్రులు ఆయన రచనలలో తలమానికం. గరిమెళ్ళతో సన్నిహిత పరిచయం గలవారు. గరిమెళ్లను గురించి వ్రాస్తూ ఆయన ఒకచోట ఇలా అన్నారు: "నా బాధ వేరు. ఆయన (గరిమెళ్ల) దారిలో ఎదురైనపుడు 'రండి, కాఫీ హోటేలుకి' అని అనలేకపోతినే! నా దశ ఆయన నన్ను చెన్నపట్టణంలో చూసిన మొదటిసారే చెప్పారు."

కామేశ్వరరావు శ్రీపాద (1877–1943): రాజమహేంద్రవరం ప్రభుత్వ కళాశాలలో ఉపన్యాసకులుగా ఉండేవారు. జాతీయ వాది. పూర్తిగా ఖద్దరు ధరించేవారు. సాహిత్య సేవ చెయ్యాలనే ఉద్దేశంతో అభినవాంధ్ర గ్రంథమాల స్థాపించి బెంగాలీ, మరాఠీ, పంజాబీ, హిందీ, తమిళం మొదలైన భాషలలోని ఉత్తమ నాటకాలను తెలుగు వారికి తెలియజేశారు. గరిమెళ్ళను ఆదరించిన సహృదయులు.

కృష్ణస్వామి అయ్యంగారు, ఎ. యన్. (1884–?): గరిమెళ్ల సత్యనారాయణకు తమిళం నేర్పడమే కాక ఆ భాషలోని అనర్ఘ రత్నాలను తెలుగు చేయగల సామర్థ్యమూ కల్పించిన వారిలో ఒకరు కృష్ణస్వామి అయ్యంగారు. ఆయన స్వాతంత్ర్య సమరయోధుడు. హరిజనుల దేవాలయ ప్రవేశం, ఖద్దరు ఉద్యమం మొద లైన జాతీయోద్యమాలలో ఆయన చురుకుగా పాల్గొన్నారు. ఆయన శతజయంతి మధురకు దగ్గరలో ఉన్న–హనుమంతన్‌పట్టి అనే గ్రామంలో 1984, మే నెలలో మాజీ తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ యం. భక్తవత్సలం గారి అధ్యక్షతను జరిగింది.

కేసరి, కే. యన్. (1875–1953): ఇంటి పేరు కోటవారు. తలిదండ్రులు పెట్టిన పేరు నరసింహం. ఆయన మదరాసుకి వచ్చిన తర్వాత నరకేసరి అయ్యారు. చివరికి కేసరి పేరే స్థిరపడింది. చిన్నప్పుడు పేదరికం అనుభవించారు. కాని వైద్యవృత్తి నవలంబించి లక్షలు గడించారు. ఆయన 1928 లో గృహలక్ష్మి మాస పత్రిక ప్రారంభించారు. అందులో కొంతకాలం గరిమెళ్ళ సత్యనారాయణగారు ఉపసంపాదకులుగా పనిచేశారు. ఆయన మదరాసులో ఒక ఉన్నత పాఠశాలను స్థాపించారు. రచయిత్రుల్ని సత్కరించే

సదుద్దేశంతో సువర్ణ కంకణ ప్రదానం చేయసాగారు. ఆయన స్వీయచరిత్ర అయిన 'నా చిన్ననాటి ముచ్చట్లు' చదువ దగిన పుస్తకాలలో ఒకటి.

గాంధీజీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869-1948): మహాత్ముడుగా జగద్విఖ్యాతుడు. మన జాతిపిత. దానవత్వాన్ని మానవత్వంతో గెలిచిన మహా మనీషి. సత్యా హింసలు ఆయన ఆయుధాలు. విభిన్న మతాలకు సంస్కృతులకు కొలువుకూటమైన మనదేశాన్ని ఒక్క త్రాటిమీద నడిపించి, స్వాతంత్ర్య సమరాన్ని విజయవంతం చేసిన కర్మవీరుడు! ఆయన ఎన్నో విషయాలు గురించి ఎన్నో రచనలు చేసిన నిజాయితీగల రచయిత!

గౌరన (15 వ శతాబ్ది): పాల్కురికి సోమనాథుని తర్వాత అంత ప్రశస్తంగా ద్విపదలో కావ్య నిర్మాణం చేసినవాడు గౌరన అనడం అతిశయోక్తి కాదు. హరిశ్చంద్రోపాఖ్యానం, నవనాథ చరిత్ర—ఆయన కృతులు.

చిత్తరంజన దాసు (1870-1925): ప్రముఖ దేశ భక్తుడు. స్వాతంత్ర్య సమరయోధుడు. గాంధీజీ నాయకత్వాన ప్రారంభమైన సహాయ నిరాకరణోద్యమం మొదలైన ఉద్యమాలలో పాల్గొన్నారు. న్యాయశాస్త్ర వేత్త. 1922 లో గయలో జరిగిన కాంగ్రెసు మహాసభలకు అధ్యక్షత వహించారు. 1923 లో స్వరాజ్య పార్టీ స్థాపించారు. ఆయన సాహితీపరుడు. పత్రికా సంపాదకుడు కూడా.

చిన్నయ సూరి, పరవస్తు (1809–1862): ప్రసిద్ధ పండితుడు; వ్యాకరణవేత్త. మదరాసులోని పచ్చయప్ప కళాశాలలోనూ, రాజధాని కళాశాలలోనూ తెలుగు పండితుడు. ఆయన రచనలలో నీతి చంద్రిక, బాల వ్యాకరణం మొదలైనవి సుప్రసిద్ధములు. ఆయన వచన రచన శబ్దాలంకార సమన్వితమై పఠితను ఆకర్షిస్తుంది. అయన శైలి 'కృతక' మని కొందరి అభిప్రాయం. అయినా సూరి ఉత్తమ వచన రచయితలలో ఒకరని చెప్పవచ్చు.

తిరుక్కురళ్: ధర్మార్థ కామములకు (త్రివర్గము) సంబంధించిన ప్రసిద్ధ నీత్యుద్బోధక గ్రంథం. తమిళవేద మని ప్రసిద్ధి కెక్కిన యీ గ్రంథం పెక్కు ప్రాచ్య పాశ్చాత్య భాషలలోకి అనూదిత మయింది. ఇందులో 1330 కురళులు (ద్విపదలు) ఉన్నాయి. దీనికి వెలసిన వ్యాఖ్యా

నాలలో పరిమేలళగర్ అనే ప్రాచీన పండితుడు వెలయించిన వ్యాఖ్యానం ప్రశస్త మని భావించబడుతున్నది.

తిరుపతి వేంకట కవులు (దివాకర్ల తిరుపతి శాస్త్రి 1872–1920; చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి 1870–1950): తాము జీవించిన రోజులలో మకుటం లేని మహారాజులుగా పేరు ప్రఖ్యాతులు గడించిన జంట కవులు. బహు గ్రంథకర్తలు. అవధాన విద్యలో ఆరితేరినవారు. ఊరూరా తెలుగు కవిత్వానికి పెళ్ళి పందిళ్ళు వెలయింపజేసినవారు. జమీందారుల కొలువు కూటాలలో మగ్గుతున్న తెలుగు కవితను సామాన్యుల వాకిళ్ళకు తీసుకు వచ్చిన కవితా భగీరథులు. ఎందరికో విద్యా ప్రదానం చేసిన గురుదేవులు.

తిరువళ్లువర్: తమిళవేద విఖ్యాతిని సముపార్జించిన తిరుక్కురళుని రచించిన తత్త్వవేత్త. ఆయన కాలం వివాదగ్రస్తం. క్రీస్తుశకం తొలి మూడు శతాబ్దులలో జీవించినట్లు పండితుల విశ్వాసం. ఆయన శైవుడని కొందరూ, జైను డని మరికొందరూ భావిస్తున్నారు. ఆయన అసలు పేరు కూడా స్పష్టంగా తెలియ రాలేదు. ఆయన జీవితానికి సంబంధించిన కథలు కొన్ని నేటికీ ప్రచారంలో ఉన్నాయి. కొందరి కథనం ప్రకారం ఆయన మధు రలో జన్మించినట్లు చెప్పవచ్చు. కాని తిరువళ్లువర్ ఆలయం మదరాసులోని మైలాపూరులో ఉన్నది.

త్యాగరాజు (1767–1847): సుప్రసిద్ధ వాగ్గేయకారుడు. ఆంధ్రే తరులకు సుపరిచితులైన కొద్దిమంది తెలుగు కవులలో ఒకడే కాక ప్రము ఖుడు కూడా. భక్తి భావంతో రంగరించబడిన కీర్తనలతో రామభక్తి సామ్రాజ్యంలో సుస్థిరమైన స్థానం సంపాదించిన మహనీయుడు. రాజా శ్రయాన్ని నిరసించి, పేదరికంతోనే జీవయాత్ర సాగించిన చిరస్మర ణీయుడు. కీర్తనలే కాక, ప్రహ్లాద చరిత్రం, నౌకా చరిత్రం అనే సంగీత రూపకాలు సంతరించిన సంగీత సాహిత్య మర్మజ్ఞుడు.

నన్నయ (11 వ శతాబ్ది): తెలుగు సాహిత్యంలో ఆది కవి. ఆంధ్ర మహాభారతంలో తొలి మూడు పర్వాలు ఆ మహనీయుని రచన. ఆంధ్ర శబ్ద చింతామణి ఆయన రచన అని కొందరి నమ్మకం.

నాగేశ్వరరావు, కాశీనాథుని (1867–1938): దేశోద్ధారకులుగా ఎనలేని కీర్తి నార్జించిన నాగేశ్వరరావు పంతులు గారిని విశ్వదాత, కళా

ప్రపూర్ణ మొదలైన బిరుదులు కూడా వరించాయి. ఆయన చేసిన దాన ధర్మములను అభిజ్ఞులు కథలుగా చెపుతూ వుంటారు. 1903 లో ఆయన ఆంధ్ర పత్రిక స్థాపించారు. తర్వాత భారతి సాహిత్య పత్రికను స్థాపించారు. ఈ రెంటినే కాక ఆంధ్ర గ్రంథమాలను స్థాపించి తెలుగు భాషా సాహిత్యాలకు చిరస్మరణీయమైన సేవ చేశారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ప్రారంభించారు. ఆంధ్ర సారస్వత చరిత్ర, అల్లమ ప్రభువు, భగవద్గీత-మొదలైనవి ఆయన రచనలలో కొన్ని.

నామక్కల్ రామలింగం పిళ్లై (1888-1972): ప్రసిద్ధ జాతీయ కవి. ఆయన సేలం జిల్లాలోని మోహనూర్ అనే గ్రామంలో జన్మించారు. ఎన్నో జాతీయ గీతాలు తమిళంలో వెలయించారు. గాంధి అంజలి, తమిళన్ ఇదయం మొదలైనవి ఆయన ప్రధాన రచనలు. చిత్రకారుడు కూడా. రెండుసార్లు జైలు శిక్ష అనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు. గాంధేయ కవిగా ప్రసిద్ధుడు.

నారాయణదాసు, ఆదిభట్ల (1864–1945): అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు అని కూడా అంటారు. సుప్రసిద్ధ హరికథకుడు. హరికథా పితామహులని కీర్తి గడించారు. వీణావాదన, నృత్య సంగీతాలలో ప్రముఖుడు. ఆయన హరికథలు పండిత పామరుల్ని సరిసమానంగా అలరించాయి. సంస్కృతాంధ్రములలో రచనా వ్యాసంగం చేసి సహృదయుల ప్రశంసకు పాత్రుడైన ధన్యజీవి. ఆయన ఉమర్ ఖయ్యాం నీతి పద్యాలను సంస్కృతం, అచ్చ తెలుగులలో అనువదించిన దిట్ట.

పట్టాభి సీతారామయ్య, భోగరాజు (1880–1959): వైద్యశాస్త్ర ప్రవీణులు. బహుముఖ ప్రతిభా సంపన్నులు. భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. జాతిపిత గాంధీజీ ఆయన్ని తన వ్యాఖ్యాతగా స్వీకరించారు. స్వాతంత్ర్యానంతరం ఆయన కొంతకాలం మధ్యప్రదేశ్ గవర్నరుగా పనిచేశారు. గొప్ప వక్త. అలాగే ప్రముఖ రచయిత. ఆయన ఆంగ్లంలో భారత జాతీయ కాంగ్రెసు చరిత్రను రెండు సంపుటాలలో వ్రాశారు. గాంధీయిజం అండ్ సోషలిజం ఇంకా మరి కొన్ని రచనలు చేశారు. బందరులో జాతీయ కళాశాల స్థాపనకు తోడ్పడ్డారు.

పటేలు, వల్లభ్ భాయి (1875–1950): దేశభక్తుడు. ఉక్కుమనిషిగా చరిత్రలో నిలిచిపోయిన ధీరుడు. ధర్మ నిరతుడు. స్వాతంత్ర్య సమర యోధుడు. ప్రముఖ న్యాయవాది; బారిష్టరు. రైతు బాంధవుడు. చారిత్రాత్మకమైన బర్డోలీ సత్యాగ్రహానికి నాయకత్వం వహించారు. స్వాతంత్ర్యానంతరం మనదేశంలోని వివిధ సంస్థానాలను విలీనం కావించిన కర్మవీరుడు. ఉక్కు మనిషయినా, మనసు మెత్తన!

పరిమేలళగర్: 14 వ శతాబ్దమున జీవించిన ప్రసిద్ధ తమిళ పండితుడు. తిరుక్కురళు వెలుగు చూసిన నాటినుంచీ నేటిదాకా ఎన్నో వ్యాఖ్యాన గ్రంథాలు వెలిశాయి. వాటిలో పరిమేలళగర్ వెలయించిన వ్యాఖ్యానం తలమానికంగా భావించబడుతున్నది. కొన్ని కురళులకు ఆయన వ్యాఖ్యానం సంతృప్తికరంగా లేదని ఆధునికులు కొందరి అభిప్రాయం. వైష్ణవ బ్రాహ్మణు డైన ఆ ప్రముఖ వ్యాఖ్యాత కాంచీపుర వాస్తవ్యుడు.

పాత్రో, ఎ. వి. (పరశురామ పాత్రో, అన్నెము –20 వ శతాబ్ది పూర్వార్థం): బరంపురం న్యాయవాదులలో సుప్రసిద్ధుడు. సర్ బిరుదం పొందిన ప్రముఖుడు. 1921 నుంచి 1926 దాకా మదరాసు రాష్ట్రంలో మంత్రిగా ఉండి, విద్య మొద లైన శాఖలు నిర్వహించారు. జస్టిస్ పార్టీ నాయకులలో ఒకరు. మదరాసు విశ్వవిద్యాలయ పునర్నిర్మాణ చట్టం (1923) రూపొందడానికి ఆయన ప్రముఖ పాత్ర నిర్వహించారు.

పోతన, బమ్మెర (15 వ శతాబ్ది): సహజ కవి. రాజాశ్రయాన్ని నిరసించిన అభిమానధనుడు. దారిద్ర్యాన్ని వరించిన రామభక్తుడు. శ్రీనాథుని సమకాలికుడు. మహాభాగవత కర్త. పోతన రచన వల్లనే, ఆ కృతికి తెలుగునాడులో అంత ఆదరభావం లభించింది. ద్రాక్షాపాకంలో సాగిన తెలుగు భాగవతం తెలుగు వారికి ప్రీతి పాత్ర మైన గ్రంథాలలో ఒకటి. ఆంధ్రేతరులకు కూడా పరిచితు డైన తెలుగు కవి!

ప్రకాశం, టంగుటూరి (1872–1957): ఆంధ్రకేసరిగా జగద్విఖ్యాతు లైన ప్రకాశం గారి ధైర్యసాహసాలను తెలిసినవారు కథలుగా చెబుతారు. ప్రజల మనిషిగా, ధైర్యానికి మరోపేరుగా ఆయన చరిత్రలో నిలిచిపోయారు. ఆయన త్యాగబుద్ధి దొడ్డది. ప్రముఖ న్యాయవాదిగా లక్షలు గడించారు; కాని ధనహీనుడిగానే జీవయాత్ర చేశారు. ప్రజలను ధాజ

కీయంగా విద్యావంతుల్ని చెయ్యాలనే ఉద్దేశంతో స్వరాజ్య అనే ఆంగ్ల దిన పత్రికను 1921 లో స్థాపించారు. ఆయనే సంపాదకుడు. తెలుగు, తమిళ ములలో కూడా అ పత్రికను నడిపారు. కీర్తిని మాత్రం మిగిల్చిన ఆ పత్రిక ఆయన్ని నిర్ధనుణ్ణి చేసింది. ఆయన 'నా జీవితయాత్ర' తెలుగులో వెలిసిన స్వీయ చరిత్రలలో ప్రముఖ మయింది.

బాలగంగాధర తిలక్ (1856–1920): లోకమాన్యుడని అఖండ యశస్సు నార్జించిన దేశభక్తుడు. స్వాతంత్ర్యం జన్మహక్కని నా సింహ గర్జనచేసిన ధీరుడు. ఓరియాన్, గీతారహస్యంవంటి సద్గ్రంథాలు రచించిన పండిత రచయిత. ప్రముఖ పత్రికా సంపాదకులు కూడా. చాలాసార్లు జైలు శిక్ష అనుభవించినవారు. న్యాయశాస్త్ర ప్రవీణులు. ఆయనకి ఆరేళ్ళ ద్వీపాంతరవాస శిక్ష విధించింది, హృదయం లేని తెల్ల దొరతనం.

బ్రహ్మంగారు (పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, 17 వ శతాబ్ది పూర్వార్ధం): సిద్ధ పురుషుడు. సంఘ సంస్కర్త. మత సామరస్యానికి కృషి చేసినవాడు. మహిమ లెన్నో ప్రదర్శించినట్లు చెపుతారు. ఆయన రచించిన కాల జ్ఞాన తత్త్వాలు, గోవింద వాక్యాలు ప్రసిద్ధ మైనవి. నేటికీ బ్రహ్మం గారి తత్త్వాలు ప్రచారంలో ఉన్నాయి. కందిమల్లయ పల్లిలో జీవసమాధి చెందిన మహనీయుడు. కందిమల్లయ పల్లిలోని బ్రహ్మంగారి మఠంలో ఏటేటా ఆరాధనోత్సవం శ్రద్ధాసక్తులతో జరుగుతుంది.

భారతి, గోపాలకృష్ణ (20 వ శతాబ్ది): తమిళదేశంలో సంగీత రచనలు చేసిన వారిలో భారతి ప్రముఖుడు. శివభక్తుల కథలకు నిలయ మైన పెరియ పురాణం ఆధారంగా చేసుకుని ఆయన తిరునీలకంఠ నాయ నార్ కీర్తనై, నందనార్ కీర్తనై అనే సంగీత రచనలు చేశారు. నందనార్ కీర్తనై ప్రచుర ప్రచారం గడించింది. సంగీత రచనలో సుబ్రహ్మణ్యభారతికి కూడా గోపాలకృష్ణ భారతి మార్గదర్శకు డయ్యాడు.

భారతి, సి. సుబ్రహ్మణ్య (1382–1921): భారతి తమిళ నవయుగ ప్రవక్త. జీవించింది 39 సంవత్సరాలే అయినా, ఆ కొద్ది కాలంలోనే పది కాలాలపాటు నిలిచివుండే గీతాలూ, కవితలూ, వ్యాసాలూ ఎన్నో సంత రించి అధునిక తమిళ వాఙ్మయాన్ని పరిపుష్టం చేసిన పుణ్యాత్ముడు.

తమిళసాహిత్య చరిత్రలో ఆయన చిరంజీవి. భారతికీ, గరిమెళ్ళకీ ఎన్నో పోలిక లున్నాయి. ఈ గేయకవి సార్వభౌము లిద్దరూ పేదరికంతో బాధలు పడ్డారు. గరిమెళ్ళను తెలుగుదేశపు భారతిగా మొదట గుర్తించినవారు వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారు.

మల్లికార్జునరావు, పందిరి (20 వ శతాబ్ది): జాతీయవాది. ప్రసిద్ధ పత్రికా రచయిత. ఆయన చాలాకాలం కిన్నెర అనే సాంస్కృతిక సాహిత్య పత్రికను సమర్థంగా నిర్వహించారు. సంఘ సంస్కరణాభిలాష గలవారు. తెలుగు భాషా సమితి కార్యనిర్వాహకవర్గ సభ్యులు.

మాలవ్యా, మదనమోహన (1861-1946): విద్యావేత్త. విఖ్యాత జాతీయవాది. కాశీ హిందూ విశ్వవిద్యాలయ స్థాపకులు. ఆయనే ఆ విశ్వ విద్యాలయం తొలి ఉపాధ్యక్షులు. ఆయనకి వేద విజ్ఞానంపట్ల అపారమైన ఆదరభావం. ఆయన మూడుసార్లు అఖిల భారత కాంగ్రెసు మహాసభలకు అధ్యక్షత వహించారు. గొప్ప వక్త.

రాఘవశర్మ, గురుజాడ (1899-1987): కవిశేఖర బిరుదాంకితులు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. తామ్రపత్ర గ్రహీత. తెలుగులో వెలువడిన జాతీయోద్యమకాలపు పాటలు పద్యాలు మొదలైన వాటిని అధ్యయనం చేసేందుకు ఆయన సంపాదకత్వంలో ప్రచురించబడిన జాతీయ గీతాలు అనే అమూల్య సంపుటం బహుధా ఉపకరిస్తుందనడం సత్యసన్నిహితం. గరిమెళ్ళ సాహిత్య మంటే ఆయనకి మహాభిమానం. ఆయన వ్రాసిన గరిమెళ్ళ సత్యనారాయణగారి జీవిత చరిత్ర అవశ్య పఠనీయం. శర్మగారు 1987, ఆగష్టు 25 న పరమపదించారు.

రాజాజీ (1878-1972): పిల్లలకూ పెద్దలకూ అమూల్య రచన లెన్నో చేసిన రాజాజీ పూర్తి పేరు చక్రవర్తి రాజగోపాలాచారి మహా మేధావి; రాజనీతి శాస్త్రవేత్త. స్వాతంత్ర్య సమరవీరులు. పరిపాలనా దక్షులు. రచయిత. ఆయన బహుముఖీనమైన ప్రజ్ఞ రాజకీయాది వివిధ రంగాలలో ప్రతిభాసించింది. చక్రవర్తి తిరుమగన్, ఆత్మ చింతనై, కర్పనైక్కాడు మొదలైనవి ఆయన ప్రధాన రచనలలో కొన్ని. ప్రముఖ కథకులు.

రామకృష్ణమాచార్యులు, ధర్మవరం (1853–1912): ఆంధ్రనాటక పితామహులు. సంస్కృతాంధ్ర కర్ణాటక భాషా పండితులు. ఆయన వ్రాసిన చిత్ర నళీయం (1866), విషాద సారంగధర, పాదుకాపట్టాభిషేకం మొదలైనవి ప్రసిద్ధ నాటకాలు. తెలుగులో 28 నాటకాలూ, కన్నడంలో 2 నాటకాలు, ఆంగ్లంలో 1 నాటకం వెలయించిన ప్రతిభావంతుడు.

రామచంద్రశాస్త్రి, మారేపల్లి (1874–1951): కవిగారుగా లబ్ధ ప్రతిష్ఠులైన శాస్త్రిగారు సాహిత్య సాంస్కృతిక రాజకీయాది రంగాలలో కృషి చేశారు. సంఘ సేవకులు. హరిజనోద్ధరణకు పాటుపడ్డారు. బాలికల విద్యను ప్రోత్సహించారు. గ్రంథాలయోద్యమంలో కృషి చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సాహిత్యంలో నవ్యతను అభిలషించారు. కావ్యాలు కథలు హరికథలు వ్యాసాలు ఎన్నో రచించారు. నుడికడలి అనే పేరున నిఘంటు రచనకు పూనుకున్నారు. కళాభిలాష కావ్యమాలను స్థాపించి గ్రంథ ప్రచురణ సాగించారు. విశాఖపట్టణంలోని కవితా సమితికి అధ్యక్షులు.

లక్ష్మీనారాయణశాస్త్రి, చల్లా (1903–1968): ప్రబంధకవి శిరోమణి బిరుదాంకితులు. సంస్కృతాంధ్ర హిందీ భాషా విశారదులు. అష్టావధాని. బహు గ్రంథ కర్త. ఆయన చాలాకాలం చెంగల్పట్టుజిల్లా పొన్నేరిలో తెలుగు పండితునిగా పనిచేసి, ఎందరికో తెలుగు భాషా సాహిత్యాల పట్ల అభిరుచి కలిగించిన భాషాభిమాని. ఆయన రచనలలో గీతా సప్తశతి (భగవద్గీత), రణ తిక్కన, మైథిలి, విరివాన మొదలైనవి ముఖ్యమైనవి.

లాలా లజపతిరాయ్ (1865–1928): దేశభక్తుడు, స్వాతంత్ర్య సమరయోధుడు. పంజాబ్ కేసరిగా విఖ్యాతుడు. సంఘ సంస్కరణాభిలాష గలవారు. ప్రజాహిత కార్యకలాపాలలోనూ రాజకీయాలలోనే కాక పత్రికారంగంలోనూ అవిరళమైన కృషిచేసి చిరకీర్తి గడించారు. 1928 లో సైమన్ కమిషన్ వారు లాహోరు వచ్చారు. ఆ సంఘాన్ని బహిష్కరించాలని కోరుతూ ఆయన గొప్ప ఊరేగింపు జరిపారు. ఆ సందర్భంగా ఆయన్ని పోలీసులు దయాదాక్షిణ్యాలు లేకుండ హింసించారు, తత్ఫలితంగా ఆయన కన్ను మూశారు.

లింగరాజు, క్రొవ్విడి (1904-1986): ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. బహుముఖ ప్రజ్ఞాశాలి. పత్రికా రచయిత. మాక్సిం గోర్కి 'మదర్' నవలను అమ్మ అనే పేరున అనువదించి చిరకీర్తి నార్జించారు. కొంతకాలం రాజమహేంద్రవరం పురపాలక సంఘాధ్యక్షులు. సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, యార్లగడ్డ వెంకన్న చౌదరి సాహిత్య పురస్కారం, కొడుకుల వెంకటశివయ్య సాహిత్య పురస్కారం మొదలైనవి లభించాయి.

వళ్ళత్తోళ్ నారాయణమీనన్: (1879-1958): జాతీయవాది. అధునిక మలయాళ కవిత్రయంలో ఒకరు. అధ్యాత్మ రామాయణ కర్త అయిన ఎళుత్తచ్చన్ మహాకవికి తర్వాత ఇంతటి ప్రముఖ కవి లేడని మలయాళ పండితుల అభిప్రాయం. ఋగ్వేదం, వాల్మీకి రామాయణం మొదలైన వాటిని అనువదించడమేకాక, ఎన్నో కావ్యాలు వెలయించిన వారు. ఆయన స్థాపించిన కేరళ కళామండలం కేరళలోని కళల అభివృద్ధికి గణనీయమైన కృషి చేస్తున్నది.

విక్రమదేవవర్మ (1869-1951): జయపురం మహారాజు. అపర భోజుడుగా యశస్సు నార్జించారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తుకి పోషకులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వైజ్ఞానిక శాఖను ఏర్పాటు చేశారు; కొన్నాళ్ళు ఆ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా పని చేశారు. ఆంధ్రాంగ్ల ఉత్కళ భాషలలో ప్రవీణులు. శ్రీనివాస కల్యాణం, మానవతీ చరిత్రము, బాల గోపాల శతకం మొదలైనవి ఆయన తెలుగు రచనలు. కళాపూర్ణోదయ కావ్య కథను ఒడియా భాషలోకి అనువదించారు.

విశ్వనాథం, తెన్నేటి (1895-1979): ప్రముఖ స్వాతంత్రశ సమరయోధులు. మదరాసు, తిరువాంకూరు విశ్వవిద్యాలయాలలో విద్యాభ్యాసం. ఆంధ్రరాష్ట్ర మంత్రి వర్గంలో (1953) ఆర్థికశాఖామాత్యులుగా, ఆ తర్వాత కాఫీ బోర్డు అధ్యక్షులుగా వ్యవహరించారు. కలువరింతలు, నవజీవనము, మన లోక్‌సభ మొదలైనవి ఆయన రచనలు. ప్రసిద్ధ వక్త.

వీరేశలింగం, కందుకూరి (1848-1919): నవ్యాంధ్ర నిర్మాతలలో ప్రముఖులు. సాహిత్యానికే కాక సంఘ సంస్కరణకు కూడా జీవితాన్ని మీదు కట్టిన మహనీయుడు. ఆయన స్పృశించని సాహిత్య ప్రక్రియ

లేదనవచ్చు. విషయ ప్రధానములూ, విజ్ఞాన ప్రదములూ అయిన రచన లెన్నో చేసిన బహు గ్రంథ రచయిత. గద్య తిక్కన బిరుదాంకితుడు. సాహిత్యాన్ని ఆయుధంగా మలచుకున్న కర్మ వీరుడు. మహాకవి సుబ్రహ్మణ్యభారతి తన తమ్ముడు సి. విశ్వనాథ అయ్యరు ఉద్యోగ విషయమై వీరేశలింగం గారికి ఒక ఉత్తరం వ్రాసినట్లు తెలియవస్తున్నది. భారతికి వీరేశలింగంగారి పట్ల ఆదరాభిమానాలు ఉండేవి.

వెంకట అప్పారావు, బసవరాజు (1894-1933): ప్రముఖ కవి. గీత రచనలో ప్రముఖుడు. సెలయేటిగానం, బసవరాజు అప్పారావు గీతములు, ఆంధ్ర కవిత్వ చరిత్ర మొదలైనవి ఆయన రచనలలో ప్రధానమైనవి. సాహిత్య విమర్శకుడుగా కూడా ప్రసిద్ధి కెక్కినవాడు.

వెంకట కృష్ణశాస్త్రి, దేవులపల్లి (1897-1980): పద్మభూషణ బిరుదాంకితులు. ప్రముఖ కవి. భావ కవిత్వ రథసారథి. గొప్ప వక్త. ఆధునిక భావాలు గల సహృదయుడు. ఆయన రచనలలో కృష్ణపక్షము ఊర్వశి ప్రవాసము, అప్పుడు పుట్టి ఉంటే, ధనుర్దాసు, తిరుప్పావు మొదలైనవి ప్రచుర ప్రచారం పొందాయి. గీత రచనలో ఆయన సిద్ధహస్తులు.

వెంకట నరసింహం, చెరకువాడ (1877-1964): ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. ప్రసిద్ధ వక్త. త్యాగనిరతుడు. నాలాసార్లు జైలు శిక్ష అనుభవించిన దేశభక్తుడు. గాంధీజీ సిద్ధాంతాలను ప్రచారం చేసిన 'ఉపన్యాస కేసరి.' రాజకీయ విషయాలు గురించి రచనలు చేసిన రచయిత..

వెంకటరత్నం, బిక్కని (20 వ శతాబ్ది పూర్వార్ధం): స్వాతంత్ర్య సమరయోధులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. జైలు శిక్ష అనుభవించారు. 1947 లో ప్రకాశం మంత్రివర్గంలో ఆయన సభ్యులుగా ఉన్నారు.

వెంకటరామమూర్తి, గిడుగు (1863-1940): గిడుగు పిడుగుగా ప్రసిద్ధి చెందిన పండితుడు. వ్యావహారిక భాషా వాదానికి మూలపురుషుడనవచ్చు. స్వయంకృషితో ప్రాచీన లిపితోను, సవర భాషతోను ప్రగాఢ పరిచయం సంపాదించిన భాషాభిమాని. సవర - తెలుగు నిఘంటువు,

తెలుగు-సవర నిఘంటువు, బాలకవి శరణ్యం, వ్యాసమంజరి మొదలైనవి ఆయన రచనలలో ముఖ్యమైనవి. ఆంగ్లంలో కూడా సవర భాషను గురించి రచనలు వెలయించిన పండితుడు.

వేంకటరామ విద్యానందనాథుడు, కనుపర్తి (1803–1899): తత్త్వవేత్త. తిరుక్కురళుని ప్రప్రథమంగా తెలుగు (అర్ధ కందములో) చేసిన పండితుడు; ఆయన మొదటి రెండు భాగాలను మాత్రమే అనువదించారు. కైవల్య నవనీతం అనే వేదాంత విషయకమైన రచన—కావించిన ప్రముఖులు.

వెంకటరామా నాయుడు, నెల్లూరు (1891–1959): ప్రసిద్ధ దేశభక్తులు. ప్రముఖ పత్రికా సంపాదకులు. జమీందారుల రద్దుకోసం కృషి చేశారు. తత్ప్రచారానికిగాను జమీన్ రైతు అనే వార పత్రికను స్థాపించిన జాతీయవాది. రైతాంగంలో చైతన్యం ఏర్పడడానికి ఆ పత్రిక ఎంతగానో తోడ్పడింది.

వేంకటేశ్వర శాస్త్రులు, వావిళ్ళ (1884–1956): భాషోద్ధారకులు. కళాప్రపూర్ణులు. చేతివ్రాత పుస్తకాలు చదువుకునే రోజుల్లో ముద్రణాలయం స్థాపించి పాఠకుల కష్టాలు తొలగించిన రామస్వామి శాస్త్రులు గారి ఏకైక పుత్రులు. వేంకటేశ్వరశాస్త్రులుగారి నిర్విరామ కృషివల్ల వావిళ్ల సంస్థ మూడు పువ్వు లారు కాయ లయింది. సంస్కృతాంధ్ర తమిళ భాషలలో గ్రంథా లెన్నో ప్రచురించడమే కాక, శాస్త్రులుగారు గాంధీజీ, ప్రకాశం ప్రభృతుల జీవిత చరిత్రలు రచించారు. ప్రముఖ జాతీయవాది. త్రిలింగ అనే తెలుగు వార పత్రికనూ, ఫెడరేటెడ్ ఇండియా అనే ఆంగ్ల మాస పత్రికనూ సమర్థంగా చాలాకాలం నిర్వహించారు. శాస్త్రులుగారి భాషా సేవను గుర్తించి ప్రజలు ఆయన్ని భాషోద్ధారకు లనగా, ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ఆయన్ని కళాప్రపూర్ణ బిరుదంతో గౌరవించింది.

వేమన (17 వ శతాబ్ది): మానవతావాది. యోగి. ప్రజా కవి. వానను తడియని వారూ వేమన పద్యం తెలియని తెలుగువారూ ఉండరు. ఆంధ్రేతరులకు కూడా సుపరిచితుడైన కవి. వేమన పద్యాలు తమిళం, ఆంగ్లం మొదలైన భాషలలోకి అనూదితము లయినాయి. మనోగత భావాన్ని డొంక తిరుగుడు లేకుండా కుండ బ్రద్దలు కొట్టినట్లుగా వేమనలా

చెప్పిన కవులు తెలుగులోనే కాదు ఇతర భాషలలో కూడా చాలామంది లేరనడం సత్య సన్నిహితం. రచనలో సామాజిక న్యాయ దృష్టి సంత రించుకున్న మహనీయుడు.

సత్యనారాయణ, విశ్వనాథ (1895–1976): తమ అమూల్య రచనలతో ఆధునికాంధ్ర సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కవి సమ్రాట్ సత్యనారాయణగారు చేపట్టని సాహిత్య ప్రక్రియ లేదు. ప్రతిభావ్యుత్పత్తులు సరిసమానంగా ఆయన వివిధ రచనల్లోనూ కానవస్తాయి. గజారోహణాది సమ్మానాలు ఎన్నో పొందారు. పద్మభూషణ్ మొదలైన బిరుదులు ఆయన్ని వరించాయి. విశ్వనాథ సాహిత్యంలో ధ్రువతారగా ప్రతిభాసిస్తున్న శ్రీ మద్రామాయణ కల్ప వృక్షానికి జ్ఞానపీఠం వారి బహుమతి లభించింది. ఆ విశిష్ట బహుమతికి నోచుకున్న తొలి తెలుగు రచన యిదే. సంస్కృ తంలో కూడా ఆయన రచనలు వెలయించారు.

సుబ్బారావు, రాయప్రోలు (1892–1984): యుగకర్తగా భావించ బడుతున్న రాయప్రోలువారు నవ్య కవిత్వానికి ఎనలేని సేవ చేశారు. తృణకంకణం, ఆంధ్రావళి, రమ్యాలోకం మొదలైనవి ఆయన రచనలలో ప్రసిద్ధాలు. అమలిన శృంగార తత్వానికి సాహిత్యంలో ప్రాణ ప్రతిష్ఠ చేశారు. ఆయన రచనల్లో ఆంధ్ర దేశాభిమాన కవిత్వం పుష్కలంగా కని పిస్తుంది; స్వాతంత్ర్య ప్రబోధమూ కనిపిస్తుంది. ప్రముఖ భావకవులు. ఆంగ్లంలోనూ రచనలు చేశారు.

సూరిశాస్త్రి, పురాణం (1888–1941): మచిలీపట్టణం (బందరు) వాస్తవ్యులు. రసాయనశాస్త్ర పట్టభద్రులు. సుప్రసిద్ధ నాటక విమర్శకులు. బందరులోని తమ నివాసాన్ని విద్యాలయంగా మార్చి నాటక కళకు అమూల్య సేవ చేశారు. తెలుగునాట నాటక పోటీలకూ నాటక విమ ర్శకూ ప్రారంభకులు. ఆయన రచనలలో నాట్యాంబుజము (1923), నాట్యోత్పలము (1924), ఆంధ్ర నాటక సంస్కరణ, విమర్శక పారి జాతము (1925) మొదలైనవి ప్రసిద్ధములు.

సూర్యనారాయణశాస్త్రి, మల్లాది (1880–1962); సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులు. వైయాకరణి. ఆయన ఆంధ్ర విశ్వవిద్యా లయంలో అధ్యాపకత్వం నిర్వహించిన సాహిత్యవేత్త. ఆయన రచనలలో

ఆంధ్ర భాషాను శాసనం (1926), సంస్కృత వాఙ్మయ చరిత్ర (1933) బహు ప్రసిద్ధ మైనవి. సాంప్రదాయిక పండితులే అయినా నవ్యులు.

సోమనాథుడు, పాల్కురికి (15 వ శతాబ్ది): సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో పండితుడు. బసవపురాణాది బహు కృతి నిర్మాత. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన కావించిన మహాకవి. దేశీయచ్ఛంద మైన ద్విపదకు కావ్య గౌరవం కల్పించిన భాషాభిమాని.

శ్రీనాథుడు (15 వ శతాబ్ది): కవిసార్వభౌమ బిరుదాంకితుడు. పండితులకూ, పామరులకూ రచనలు చేసిన మహాకవి. ఆయనలా తెలుగు నేల నాలుగు చెరగులా పర్యటించిన మరొక కవి లేడనడం సత్యసన్నిహితం. సుఖదుఃఖాలు సరిసమానంగా అనుభవించినవాడు. ఆయన కృతులలో శృంగారనైషధం, కాశీఖండం, హరవిలాసం మొదలైనవి పేర్కొనదగినవి. పల్నాటి వీర చరిత్రం ఆయన రచనగా భావించబడుతున్నది. శ్రీనాథుని చాటువులు సాహిత్య ప్రియులకు గోరుముద్దలు.

శ్రీనివాసయ్యంగారు, యస్. (1874–1941): ప్రముఖ న్యాయ శాస్త్రవేత్త. ప్రసిద్ధ దేశభక్తులు. 1926 లో గౌహతిలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలకు అధ్యక్ష స్థానం అలంకరించారు. కేంద్ర శాసన సభలో స్వరాజ్య పార్టీ ఉపనాయకుడు. వితరణి. ఆ రోజుల్లోనే గంగా కావేరీ నదుల్ని కలపడం శ్రేయస్కర మని సూచించిన ఆయన దూర దృష్టి బహుధా ప్రశంసార్హం!

శ్రీరాములు, పొట్టి (1901–1952): ఆంధ్ర రాష్ట్ర సిద్ధికై ఆత్మార్పణం చేసిన అమరజీవి. జాతీయవాది. గాంధేయుడు. స్వాతంత్ర్య సమర యోధులు. ఆయన సాహసోత్సాహములు చూసి గాంధీజీ అంతటివాడే ఆశ్చర్యచకితు డయ్యాడు. స్వార్థరహితుడు. హరిజనోద్ధరణకు కృషి చేసిన మహనీయుడు.

శ్రీరామమూర్తి. మల్లెల (1907-1985): స్వాతంత్ర్య సమర యోధులు. విజయవాణి వారపత్రికను 1948 లో స్థాపించి స్వర్గస్థులయ్యే దాకా సమర్థంగా నిర్వహించిన సంపాదకులు. విజయవాడలోని శ్రీ దుర్గా మల్లేశ్వర దేవస్థానం ధర్మకర్త పదవిలో కొంతకాలం ఉన్నారు. గరిమెళ్ల

ప్రభృతులను గురించి మల్లెలవారు వ్యాసాలు వ్రాశారు. ఆయన కృషికి గుర్తింపుగా ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘంవారు 'గ్రంథాలయోద్యమ భూషణ' అనే బిరుదు ఇచ్చారు.

శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు, 1910–1983): మహాప్రస్థానం, ఖడ్గ సృష్టి మొదలైన ఉత్తమ కవితా సంపుటులు ఆయన ప్రసిద్ధ రచనలు. ఆధునిక యుగం శ్రీశ్రీ యుగమన్నా సాహసం కాదు. ఆయన ప్రభావం ఆధునిక కవుల మీద కనిపించడంలో వింత లేదు. సాహిత్య అకాడెమీ, సోవియట్‌లాండ్ నెహ్రూ బహుమతులు ఆయన రచనలకు లభించాయి.

హాలాస్యం అయ్యరు (1897–1954): తిరుచ్చిరాపల్లి వాస్తవ్యులు. ప్రసిద్ధ దేశభక్తుడు. న్యాయవాది. చాలాసార్లు జైలు శిక్ష అనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు. బహుభాషాభిజ్ఞుడు. తమిళంలో గొప్ప వక్త. గరిమెళ్ళ వంటి స్వాతంత్ర్య సమరవీరులు చాలామందికి తమిళం నేర్పిన భాషాభిమాని. తమిళనాడులో హరిజనుల ఆలయ ప్రవేశానికి కృషి చేసిన విశాల హృదయుడు. తంజావూరు బృహదీశ్వరాలయంలో హరిజనులు ప్రవేశించడానికి ఆయన కారకుడు.

# ఉపయుక్త గ్రంథ, వ్యాస సూచి


తెలుగు :

కామేశ్వరరావు, టేకుమళ్ళ : నా వాఙ్మయ మిత్రులు, గ్రంథకర్త, చిత్తూరు, 1966.

కె. వి. ఆర్. (కె.వి. రమణారెడ్డి) : ఉత్తరాంధ్ర కవులు-1, గరిమెళ్ళ సత్యనారాయణ (వ్యాసం), జముకు, శ్రీకాకుళం సాహితి బులెటిన్ నెం. 2.

చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం : తిరుగుబాటు బాట గరిమెళ్ళ పాట (వ్యాసం), ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం, 30-10-1983.

రమణారెడ్డి, కె. వి. : గరిమెళ్ళ 'వాల్మీకి ధార' (వ్యాసం), ఆంధ్రప్రభ.

రాఘవ శర్మ, గురుజాడ : గరిమెళ్ళ సత్యనారాయణగారి జీవిత చరిత్ర, 1985.

రాఘవ శర్మ, గురుజాడ : స్వాతంత్ర్యోద్యమ కాలంలో తెలుగు జాతీయ గీతాలు (వ్యాసం), తెలుగు వాణి, సం. 4, 7-9, 1979.

రాఘవ శర్మ, గురుజాడ (సంపాదకులు) : జాతీయ గీతాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1973.

రాఘవ శర్మ, గురుజాడ : గరిమెళ్ళ సత్యనారాయణ (వ్యాసం), ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం, పుటలు 756-757, 1987

రాధాకృష్ణ శర్మ, చల్లా : మాకొద్దీ తెల్లదొరతనము (వ్యాసం), ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక, 21-8-1985.

రాధాకృష్ణ శర్మ, చల్లా : గరిమెళ్ళ వివరించిన గాంధీజీ సందేశం (వ్యాసం), ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం, 10-12-1985.

రాధాకృష్ణ శర్మ, చల్లా : రాజకీయాలనుంచి కవిత్వ విషయాలు (వ్యాసం) ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక, 21-8-1987.

రాధాకృష్ణ శర్మ, చల్లా : గరిమెళ్ళ ఘనత (వ్యాసం), ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం, 5-7-1987.

రాధాకృష్ణ శర్మ, చల్లా : భారతి, గరిమెళ్ళ: తెలుగు తమిళ కవుల సామ్యాలు (వ్యాసం), ఆంధ్ర జ్యోతి ఆదివారం సంచిక, 13-11-1982.

శాస్త్రి, ద్వా. నా. : జాతీయ గేయకవి సార్వభౌమ గరి : మెళ్ళ (వ్యాసం), ఆంధ్రప్రభ దిన పత్రిక, 14-8-1988

శ్రీరాములు, రావినూతల : కీ. శే. గరిమెళ్ల సత్యనారాయణ (వ్యాసం), ఆంధ్రపత్రిక, 1982.

శ్రీ రామమూర్తి, మల్లెల : మా కొద్దీ తెల్లదొరతనము (వ్యాసం), ఆంధ్రపత్రిక ఆదివారం సంచిక, 30-6-1985.

శ్రీ రామమూర్తి, మల్లెల : మృతవీరుని స్మరణ (వ్యాసం), విజయ వాణి, 15-8-1982.

# రాధాకృష్ణ రచనావళి

తెలుగు

తెలుగు విందు (వ్యాసాలు)
వ్యాస మంజూష ,,
మదరాసు తెలుగు ,,
వేమన సూక్తులు ,,
దళవాయి రామప్పయ్య (నవల)
రాణి మీనాక్షి ,,
జయించిన జనత (కవిత)
ఆర్తిగీతాలు ,,
శ్రమలో స్వర్గం ,,
శాంతి సూక్తం ,,
సి.పి. బ్రౌన్ సాహితీసేవ (విమర్శ)
ఆడపిల్ల తండ్రిని (కథానికలు)
శ్రీ విజయం (నాటికలు)
రాజభక్తి ,,
చరిత్రకెక్కిన చరితార్థులు, 3 భాగాలు
చందమామ (పిల్లల గేయాలు)
వాన కురిసింది ,,
అనగనగా (పిల్లల కథలు)
దయావీరులు ,,
మణి మంజీరము
తమిళ వేదము
తమిళ పంచకావ్య కథలు
తమిళ సాహిత్య చరిత్ర
తరతరాల తమిళ కవిత
సుబ్రహ్మణ్య భారతి
తెలుగు–దాక్షిణాత్య సాహిత్యాలు
ఆధునిక తమిళ సాహిత్య
నిర్మాతలు (జీవిత చరిత్రలు)
ఆర్కాటు సోదరులు

అనువాదాలు

ఆత్మ చింతనము
తమిళ కథానికలు
చిట్టికి చిరుగంట
దారి చూపిన తాత : గాంధి
మా తాతయ్యకొక యేనుగుండేది
అనంత శయనం మొ॥ వి
తిరుక్కురళ్

తమిళం :

అయిరం తలైనాగం
తెలుంగు ఇలక్కియప్పలకణి (వ్యాసాలు)

ఆంగ్లం :

The Ramayana in Telugu and Tamil–A Study
Landmarks in Telugu Literature
Tales From Telugu
Ramblings in Telugu Literature
Palkuriki Somanatha